**Scholars' Edition.**

శ్రీ ర స్తు

శ్రీ నా థ క వి ప్ర ణీ త ము

# శృంగారనైషధము

ఉత్పల వేంకటనరసింహాచార్యపరిష్కృతము



చె న్న పు రి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్సు వారిచే

ప్ర క టి త ము

1951

# పీఠిక

## శ్రీనాథుఁడు

ఆంధ్రవాఙ్మయమునఁ దిక్కనతరువాత నింతపండితుఁడు మఱొకఁడు లేఁడు. తిక్కనవలెనే యీతఁడును గురుపీఠమలంకరించిన మహామూర్తి. సోమయాజివలెనే యీకవిసార్వభౌముఁడును రాజభోగములన్నిటిని ననుభవించినపుణ్యశాలి. ఇతఁడు తనసమకాలముననేగాక మొన్న మొన్నటివఱకును గూడ, నీ భాషపయిఁ దనప్రభావము నెఱపిన శక్తిమంతుఁడు; విపుల కావ్యేతిహాసములనుండి యాంధ్రరసికులదృష్టిని ప్రబంధముల వైపు మరలించిన రసికావతంసుఁడు.

శ్రీనాథునిఁగూర్చి యెఱిఁగినంతపూర్ణముగ మనకితర కవులఁ గూర్చి తెలియదు. శ్రీనాథుఁడు చిన్నతనముననే సమస్తవేదవేదాంగపాండిత్యమును సంపాదించెను; సాంఖ్యాది సిద్ధాంతములను, శైవవైష్ణవాగమములను, పాతంజలాది యోగసూత్రములను, న్యాయవైశేషికాదిదర్శనములను గఱపించెను. ఈసమస్తవిద్యాపరిశ్రమ మాతనిగ్రంథములయందుఁ గానవచ్చును. సంస్కృతకవిప్రపంచమునఁ గాళిదాసభారవి మురారిశ్రీహర్షులతనికి గురుస్థానము. ఆంధ్రకవులందుఁ గవిత్రయమువారియెడను భీమకవియెడను నీతనిది కేవలము శిష్యభావము. (చూ. వచియింతు వేములవాడభీమసభంగిత్యాది.) పాల్కురికి సోమనయెడనైతమీతనికి గౌరవము లేకపోలేదు. వలన నితఁడతని ద్విపదకావ్యమైన పండితారాధ్యచరిత్రమును బద్యకావ్యముగ సంతరించి మామిడిప్రెగ్గడయ్యకుఁ గృతి నొసంగెను. సోమనాథునికావ్యమును గేవలము చదివి పరి

వర్తన మొనర్చుటయేగాక తఱచుగా నంచలిద్విపదలనే తనపద్య ముల నెక్కించె నని పిడుపర్తిసోమన వచించియున్నవాఁడు.

కాశీఖండమున వేమభూపాలుఁడు త న్నుద్దేశించి చెప్పి నట్టు లీతఁడురచించిన "ఈక్షోణిన్ నినుఁ బోలుసత్కవులు లేరీ నాఁటికాలంబునన్." అనుపద్యార్థ మెంతేని నిజము. అట్టికవి యానాఁడు లేఁడు. శ్రీనాథుఁడు కొండవీటిరాజులలోఁ బెద కోమటియాస్థానకవి. అంతేగాదు. తత్ సంస్థానవిద్యాశాఖాధి కారిగసహిత ముండెను. వేమారెడ్డియాస్థానమున దిగ్దంతి వంటి సంస్కృతకవి వామనభట్టబాణుఁడను వాఁడొకఁడుండెను. ఇతఁడు విద్యారణ్యులవారిశిష్యుఁడు. వామనభట్టబాణుఁడు సంస్కృతమున వ్రాసినగ్రంథములలో నలాభ్యుదయ మొకటి. అది నలునిచరిత్రలోఁ బూర్వభాగము. ఈరచనయే శ్రీనాథుని హర్షనైషధాంధ్రీకరణమునకుఁ బ్రేరకమయియుండును. మైత్రికి భంగమురానివిద్యాస్పర్ధచే శ్రీనాథుఁడాకృతిఁ దలపెట్టియుం డును. ఇది క్రీ. శ॥ 1415 ప్రాంతమున రచియింపఁబడియుండు నని యూహ.

"చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర" ఇత్యాదిపద్యములవల్ల శ్రీనాథుఁడు బహు గ్రంథకర్తయని స్పష్టమగుచున్నది; కాని వాన నుపలభ్యమాన ములు నైషధము (1415), హరవిలాసము (1425), భీమ ఖండము (1430), కాశీఖండము (1440), శివరాత్రిమాహా త్మ్యము, క్రీడాభిరామము (వీధినాటకము), పల్నాటివీరచరి త్రము నను గ్రంథములే.

# శృంగారనైషధము

సంస్కృతవాఙ్మయమాంధ్రపరివర్తనముఁ బొందినచరిత్రములో మూఁడవస్థాభేదములు గలవు. మొదటిది కవిత్రయము వారు ప్రారంభించిన పురాణేతిహాసపరివర్తనపద్ధతి. నామమాత్రముస నివి పరివర్తనములు, గాని మూలకథ నాధారముగాఁ గొని వారు గావించిన స్వతంత్రరచనలు మూలముతోఁ పాటు సమానకావ్యములుగ నొప్పినవి. కొన్నిఘట్టములందు వారు మూలమునకు పన్నెచిన్నెలు దిద్దిరి. కావ్యకళాదృష్టిచే మూలమును దాఁటుమాఁటు చేసిరి. ఈస్వతంత్రపద్ధతి మొదటిది. ఈ చరిత్రలోని రెండవయవస్థకు నైషధము తార్కాణము. ఇందు మూలానుసరణము తప్పలేదు. ముక్కకు ముక్కగాఁ దెలిఁగింపను లేదు. అనఁగా మూలవిధేయతయు స్వతంత్రతయు నను రెండుగుణములును గలిసినసంధి. ఈప్రక్రియకు నైషధమే మొదలు. మూఁడవపద్ధతి సంస్కృతనాటకములకు నేఁటితెలుఁగు సేత. ఇందు భాషాంతరీకర్తలు కేవలము మూలమునకు దాసులయిరి.

నైషధము సంస్కృతమున నెంతమహాకావ్యమైనను దత్కర్తయగు శ్రీహర్షుఁడు కాళిదాసాదులతోఁ బోల్పఁదగిన కవికాఁడు. అతఁడు మహాపండితుఁడు, శబ్దార్థకల్పనాచాతురి గలవాఁడు. కాళిదాసభవభూతులకు లభించిన యుదాత్తకవితాతత్త్వ మితనికి లేదు. శ్రీహర్షనైషధమును లోకము కొనియాడుట యితనిపాండిత్యనిరూపణమునకును గల్పనాచాతురికిని. ఈగ్రంథమున ననౌచిత్యదోషము దొరలినతావులును గలవు. స్త్రీవిషయమున నెట్టిచిన్నవలనైనను జేయుటకు వెను

దీయని శ్రీనాథుఁడు సైత మిందలి యనౌచిత్యములఁ జూచి కంటగించుకొనెను. బుద్ధిపూర్వకముగ వానిని బరిహరించితి నని తానే చెప్పుకొనెను. చూడుఁడు హర్షుని నలగుణవర్ణనము:—

శ్లో. సాపీశ్వరే శృణ్వతి తద్గుణౌఘాన్ ప్రసహ్య చేతో హరతోఽర్ధశంభుః,
అభూదపర్ణాంగుళిరుద్ధకర్ణా కదానకండూయనకైతవేన.

శ్లో. అలంసజన్ ధర్మ విధే విధాతా రుణద్ధి మౌనస్యమిషేణ వాణీం,
తత్కంఠమాలింగ్య రసస్య తృప్తాం న వేద తాం వేదజడః సవక్త్రాం.

శ్లో. శ్రియస్తదాలింగనభూర్నభూతా వ్రతక్షతః కాపి పతివ్రతాయాః,
సమస్తభూతాత్మతయా నభూతం తద్భర్తురీర్ష్యాకలుషాణునాపి.

పై శ్లోకములలో రంభాద్యప్సరోభామినులేగాక త్రిమూర్తులభార్యలుసైతము నలునిగుణములను విని చాపలము వహించిరని యాతఁడు సూచించినాఁడు. జగన్మాతలకీదోషము సంటఁగట్టుట మిక్కిలియనుచిత మని దానిని బరిహరించి రంభావిషయమునుమాత్రము తా నిట్టులు తెలిఁగించెను.

శ్లో. అస్మత్కిలశ్రోత్రసుధాం విధాయ రంభా చిరంభామతులాం నలస్య,
తత్రానురక్తా తమనాప్య భేజే తన్నామగంధాన్నలకూబరం సా.

చం. వినుకలి.........వాసవన్.

హంస దమయంతియొద్ద నలుని వర్ణించునపుడు

శ్లో. సువర్ణశైలా.........కీర్ణైః

అనుశ్లోకములోని "స్మరకేళికాలే" యనునసందర్భకపద ప్రయోగమును శ్రీనాథుఁడు పరిహరించుట లెస్స. అతని తెనుఁగిది.

గీ. కనకశైలంబు డిగ్గి.........వైశాఖ వేళలందు.

ఇచ్చట "వైశాఖవేళ" యన్న దెంతసందర్భశుద్ధిగలదో రసికు లరయుదురుగదా ?

ఔచిత్యసంపాదనముకై చేసినమార్పుల నటుండనిచ్చి మొత్తముమీఁద భాషాంతరీకరణపద్ధతిఁ జూచినచో శ్రీనాథుఁ డన్నట్లు నిజముగా నిది "భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యంబాపాదించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబునఁ" జెప్పఁబడినదేయని స్పష్టమగును. ఇట "భావం బుపలక్షించి" యనఁగా మూలకారునియభిప్రాయము గుఱుతించి యనియర్థము చెప్పవలసియుండును. కొన్ని చోట్ల నాతనియాశయములు స్పష్టముగా లేనప్పుడు ఆంధ్రకవి వానిని చక్కఁగా నుపలక్షించి స్పష్టపఱచినాఁడు.

శ్లో. విధిం వధూసృష్టిమపృచ్ఛ మేవ తద్యానయుగ్యో నలకేళియోగ్యాం,
త్వన్నామవర్ణా ఇవ కర్ణపీతా మయాస్య సంక్రీడతి చక్రచక్రే.

చ. అడిగితినొక్కనాఁడు కమలాసను తేరికి వాహనంబనై
నడుచుచు నుర్విలో నిషధనాథున కెవ్వతె యొక్కొ భార్య య
య్యెడు నని చక్రఘోషమున నించుక యించుకగాని యంత యే
ర్పడ వినరాలె నీ పనుచుఁ బల్కినచందము దోఁచె మాలినీ.

ఎంత మూలము ననుసరించినను మూలమునకు నితఁడు వన్నె పెట్టుట మానలేదు.

సీ. నలినసంభవు సాహిణము వారువంబులం తులమఁ సాములు మాకుఁగువలయాక్షి
చదలేటిబంగారు జలరుహాంబులతూండ్లు భోజనంబులు మాకుఁబువ్వుఁబోఁడి
సత్యలోకముదాఁక సకలలోకంబులు నాటపట్టులు మాకు నబ్జవదన [గి
మధురాక్షరములైన మామాటలువినంగ నమృతాంధసులె యోగ్యులనుపమాం

గీ. భారతీదేవి ముంజేతిపలుకుఁజిలుక, సమదగజయాన సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్రపురాణాది విద్యలెల్లఁ, దరుణి నీయాన ఘంటాపథమ్ము మాకు.

అను సుప్రసిద్ధపద్యము మూలార్థమునకుఁ బ్రత్యాదేశము చేయుచున్నది.

కేవలము మూలానుసార మని తెలుపుటకుఁ గొన్ని చోట్టుల మూలమునందలిపదములనే పద్యమున నెక్కించవలె నని యితఁడుచేసినప్రయత్నము స్వాతంత్రతాలక్షణముగాఁ దోఁచుటలేదు. అది మూలాభిమానమునకు లక్షణము. ఆ సంస్కృతపదముల నవలంబించుటలోఁ దత్ప్రయోగము ఆంధ్రభాషావిరుద్ధమనియైన నాతఁడు దలఁపలేదు.

శ్లో. సరసీః పరిశీలితుం మయా గమికర్మీకృతనైకనీవృతా
అతిథిత్వమనాయి సా దృశోః సదసత్సంశయగోచరోదరీ.

పైశ్లోకమునందలి "గమికర్మీకృతనైకనీవృతా, సదసత్సంశయగోచరోదరీ" అనెడు రెండపూర్వశబ్దకల్పనముగల ఒక్క భావమునే రెండుపద్యములలోఁ జెప్పినాడు.

మ. కమలేందీవరషండమండితలసత్కాసారసేవారతిన్
గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్, రాకేందుబింబాననన్
సమపీనస్తని నస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్.

మ. మృదురీతిం బ్రతివాసరంబు గమికర్మీభూతనానానదీ
సదనాంతారపురీశిలోచ్చయుఁడనై నైకాద్భుతశ్రీజిత
త్రిదివంబైన విదర్భదేశమున నారీరత్నముం గాంచితిన్
సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్.

మూలములోని

శ్లో. అస్తి వామ్యభరమస్తి కౌతుకం సాస్తి ఘర్మజలమస్తి వేపథు,
అస్తి భీతిరతమస్తి వాంఛితం ప్రాపదస్తి సుఖమస్తి పీడనమ్.

అనుశ్లోకమునందలి "అస్తివామ్యభరా"ది సమాసములు. వ్యాకరణసాధ్యములును, వైయాకరణమనోరంజకములును, అంతేగాని పూర్వకవిప్రయోగార్హములు కావు. అయ్యును బండితుఁడయిన శ్రీహర్షుఁడు ప్రయోగించుటచేఁ దానును బ్రయోగింపకుండుట పరిహాసహేతువగునేమో యనిజంకి శ్రీనాథుఁడు వానిని యథాస్థితముగా నిట్లు వాఁడుకొనెను.

గీ. అస్తివామ్యభారమస్తికౌతూహల, మస్తిఘర్మసలిల మస్తికంప
మస్తిభీతి యస్తిహర్ష మస్తివ్యథం, బస్త వాంఛ మన్మథపుడు రతము.

ఈయెత్తుగీతి పైనున్న నాలుగుసీసపాదములును శ్రీనాథునికల్పనమే. ఈరీతి యాసీసమునకెంతేని వన్నెపెట్టుచున్నది. సీసపద్యపు ఆనాలుగుపాదము లివి.

పతిపాణిపల్లవచ్యుతనీవిబంధనవ్యగ్రబాలాహస్తవనరుహంబు
ధవకృతాధరబింబదశనక్షతవ్యథాభుగ్నలీలావతీభ్రూలతంబు
ధరణినాయకభుజాపరిరంభమండలీగాఢపీడితవధూఘనకుచంబు
వరనఖాంకుర మృదువ్యాపారపులకిత నీరజాక్షీనితంబోరుయుగళి

గీ. అస్తివామ్యభార.........

మూలశబ్దానుసరణము పరమావధిని బొందిన దనుటకుఁ బయి నుదాహరించిన శ్లోకములతోఁ బాటు దీనినిఁగూడఁ జేర్కొనఁదగును.

శ్లో. అశ్రాంతశ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరిశ్రవా,
జిహ్వాబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేళినా...

అనుటకు

శా. వేదాభ్యాసవిశేషపూతరసనావిర్భూతభూరిశ్రవా
సావబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేళిచే.

నన్నది తెలుఁగుసేఁతయఁట.

ఇఁక నీగ్రంథముఁ గూర్చి యొకటిరెండుమాటలు. ఇది లోకులనుకొనునట్లు హర్షనైషధమునకు డుముఖులు చేర్చిన యాంధ్రగ్రంథముకాదు. శ్రీనాథునిశ్లోకములలో మూలశ్లోకము లిమిడినట్లుగాఁ గనఁబడునుగాని మూలశ్లోకములలో నాతఁడిమిడినట్టు లగపడదు. చమత్కారార్థము గనిశ్రీకృతాదులగు నొండు రెండుశ్లోకముల తెనుఁగుసేఁతను జూపి మోపిన యీలోకనిందలో నేమాత్రమును సత్యము లేదు. ఇక్కడి ప్రౌఢసాహిత్యముగల సంస్కృతనైషధము నటుంచి శ్రీనాథుని కృతినే చదివితిమేని మూలాపేక్ష లేకయే సర్వమును విశదమగును. ఇదియే దానిమూలసమప్రాధాన్యమును నిశ్చయము సేయును.

ఈకావ్యమునఁ గవితాశిల్పము చక్కఁగాఁ బ్రసన్నతమైనపట్టు నలదౌత్యఘట్టము. హంసదూత్యము దానితరువాతిది. అందు మొదటిదానిలో నాయికానాయకులకు జరిగిన ప్రౌఢసంభాషణాక్రమము, కవికిఁగల లోకజ్ఞతకును నౌచిత్యపరిపాలనమునకును సాక్ష్యముగా నున్నది. హంసదూత్యము వంగకవిసూచిన శుచిముఖీదూత్యమునకు నొరవడిగా నున్నది.

## శ్రీనాథుని శైలి

నన్నయ సంకల్పించి నాచనసోముఁడు కొంతవఱకుఁ గొనసాఁగించిన శయ్యాసౌభాగ్యము శ్రీనాథునివలనఁ బరిణతిఁ జెందినది. ప్రబంధకవులకును, బురాణేతిహాసకర్తలకునుగల ప్రధానమైనవాసి యీశయ్యయందే గలదు. తిక్కనాదు లర్థము నారాధించిరి గాని శయ్యను గాదు. ప్రబంధకవులు శయ్యాసంపాదనార్థమై శబ్దము నారాధించిరి. అర్థమును గౌణము చేసిరి. వారికి నీత్రోవచూపినవాఁడు శ్రీనాథుఁడు కాని, శ్రీనాథునివిషయమున మాత్రము క్వాచిత్కముగాఁ దక్క నర్థమును శబ్దమునుగూడఁ బ్రధానములే. ఇతనిశయ్య లో జిగిబిగులు రెండును గలవు. ఇతనివాక్కు మిక్కిలి భావ భరితము కావుననే యితనిశైలి యుద్దండముగా నుండును.

శ్రీనాథునిజీవితచరిత్ర వ్రాయుటనఁగా బదునేనవశతాబ్ది యాంధ్రదేశచరిత్ర వ్రాయుట యని శ్రీచిలుకూరి వీరభద్ర రావుగారొకచో వచించియున్నారు. ఆకాలమున నుచ్చస్థితిలో నున్న యాంధ్రకర్ణాటకరాజ్యములతో నతనికిఁగలసంబంధము, నానామంత్రులతో నతనికిఁగలమైత్రి నానాదిశల నాతఁడొనర్చిన సంచారము—ఇత్యాదు లతని నాంధ్రలోకైకకవిగాఁ జేసినవి.

ఇఁక మిగిలినదొక్కటి. చంద్రునకు నూలుపోగన్నట్టులు శ్రీనాథమహాకవిచక్రవర్తిఁగూర్చి రెండువాక్యములు వ్రాయ నాకవకాశమిప్పించిన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారి మిక్కిలి కృతజ్ఞుఁడను.

టీచర్స్‌కాలేజి, సైదాపేట, మద్రాసు
వృష, ఆషాఢ శు ౫.

ఇట్లు,
గ. శ్రీ. న. ఆచార్య.

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము

| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| ఇష్టదేవతాప్రార్థనాదికము | ... | ... | 1 |
| ఆదికవిస్తుతి | ... | ... | 2 |
| కృతిపతిప్రశంస | ... | ... | 3 |
| షష్ఠ్యంతములు | ... | ... | 10 |


## కథాప్రారంభము

| | | | |
|---|---|---|---|
| నలమహారాజవర్ణనము | ... | ... | 11 |
| దమయంతి నలునియం దనురక్త యగుట | | ... | 17 |
| నలుండు దమయంతియం దనురక్తుండగుట | | ... | 19 |
| నలునియుద్యానవనవిహారము | ... | ... | 22 |
| నలుండు హంసముం బట్టుకొనుట | ... | ... | 26 |
| ఆశ్వాసాంతము | ... | ... | 28 |


## ద్వితీయాశ్వాసము

| | | | |
|---|---|---|---|
| హంస నలునిచే విడువఁబడి కృతజ్ఞతఁ జూపుట | | ... | 30 |
| హంస నలునికడ దమయంతి నభివర్ణించుట | | ... | 32 |
| హంస దమయంతికడకు దూతయై చనుట | | ... | 38 |
| కుండిననగరవర్ణనము | ... | ... | 39 |
| రాజహంసదూత్యము | ... | ... | 42 |
| దమయంతి నలునిఁ దక్క నన్యుని వరియింప ననుట | | ... | 49 |
| హంస దమయంతి వీడ్కొని నలునకు దూత్యసిద్ధిం దెల్పుట | | | 55 |
| హంస నలుని వీడ్కొని సత్యలోకంబున కేఁగుట | | ... | 57 |
| దమయంతీవిరహవర్ణనము | ... | ... | 57 |

| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| చంద్రదూషణము | ... | ... | 60 |
| మన్మథదూషణము | ... | ... | 63 |
| సఖులు దమయంతికి శిశిరోపచారములు సేయుట | | ... | 64 |
| దమయంతీస్వయంవరప్రకటనము | ... | ... | 65 |
| ఆశ్వాసాంతము | ... | ... | 65 |

## తృతీయాశ్వాసము

| | | |
|---|---|---|
| నారదపర్వతు లింద్రునికడ కేతెంచుట | ... | 67 |
| నారదుఁ డింద్రునకు దమయంతీస్వయంవరము దెల్పుట | | 70 |
| ఇంద్రాదులు దమయంతీస్వయంవరమునకుం దరలుట | ... | 73 |
| ఇంద్రాదులు నలుం గాంచుట ... | ... | 75 |
| ఇంద్రాదులు దమయంతికడకు నలుని దూతఁగాఁ బంపుట | | 76 |
| నలుండు రాయబారి యై దమయంతికడ కేఁగుట | ... | 82 |
| దమయంతికడ కింద్రాదులదూతికలు వచ్చుట | ... | 91 |
| నలుడు దమయంతీసౌందర్యమును వర్ణించుట | ... | 97 |
| ఆశ్వాసాంతము ... | ... | 109 |

## చతుర్థాశ్వాసము

| | | | |
|---|---|---|---|
| నలునిరాయబారము | ... | ... | 111 |
| నలుఁడు దమయంతికిఁ దనసామాదుల నెఱిఁగించుట | | ... | 132 |
| దూత్యము నెఱవేఱమికి నలుఁడు చింతిల్లుట | | ... | 133 |
| దమయంతిమాఱుగాఁ జెలియ నలునితో ముచ్చటించుట... | | | 135 |
| నలదమయంతులు చింతిల్లుట | ... | ... | 135 |
| నలదమయంతులకడకు హంస వచ్చుట | | ... | 136 |
| హంస సాంత్వనవాక్యములఁ బలుకుట | | ... | 136 |
| నలునిమనశ్శుద్ధి | ... | ... | 137 |

| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| నలునిమనశ్శుద్ధికి దేవతలు సంతోషించుట | | ... | 138 |
| స్వయంవరాగతవర్ణనము | ... | ... | 138 |
| భీమరాజు సరస్వతీదేవిం బ్రార్థించుట | | ... | 143 |
| సరస్వతీ సాక్షాత్కారము | ... | ... | 144 |
| ఆశ్వాసాంతము | ... | ... | 144 |

## పంచమాశ్వాసము

| | | | |
|---|---|---|---|
| దమయంతి స్వయంవరాస్థానమున కేతెంచుట | | ... | 147 |
| రాజులు దమయంతిసౌందర్యమున కచ్చెరువందుట | | ... | 148 |
| సరస్వతి దమయంతికి వరణీయుల వర్ణించుట | | ... | 150 |
| దేవతలు | ... | ... | 150 |
| వాసుకి | ... | ... | 151 |
| పుష్కరద్వీపాధిపతి | ... | ... | 153 |
| శాకద్వీపాధిపతి | ... | ... | 154 |
| క్రౌంచద్వీపాధిపతి | ... | ... | 156 |
| కుశద్వీపాధిపతి. | ... | ... | 158 |
| శాల్మలిద్వీపాధిపతి | ... | ... | 159 |
| ప్లక్షద్వీపాధిపతి | ... | ... | 160 |
| జంబూద్వీపరాజులు | ... | ... | 161 |
| ఉజ్జయినీపతి | ... | ... | 162 |
| గౌడరాజు | ... | ... | 164 |
| మథురాధిపతి | ... | ... | 165 |
| కాశీరాజు | ... | ... | 166 |
| అయోధ్యాధిపతి | ... | ... | 167 |
| పాండ్యరాజు | ... | ... | 169 |

## విషయసూచిక


| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| కాళింగుడు | ... | ... | 172 |
| నేపాళరాజు | ... | ... | 173 |
| కామరూపాధిపతి | ... | ... | 175 |
| ఉత్కలదేశరాజు | ... | ... | 176 |
| కీకటుఁడు | ... | ... | 177 |
| పంచనళి | ... | ... | 179 |
| దమయంతి నలుని దెలిసికొనుట | ... | ... | 184 |
| ఆశ్వాసాంతము | ... | ... | 187 |


### షష్ఠాశ్వాసము


| | | | |
|---|---|---|---|
| నలమహారాజవరణము | ... | ... | 188 |
| ఇంద్రాదులు నలదమయంతులకు వరంబు లిచ్చుట | | ... | 190 |
| సరస్వతి నలునకుఁ జింతామణిమంత్రం బుపదేశించుట | | ... | 191 |
| నలుఁడు విడిది కేఁగుట | ... | ... | 194 |
| దమయంతీకళ్యాణనేపథ్యము | ... | ... | 196 |
| నలునికళ్యాణనేపథ్యము | ... | ... | 199 |
| నలుఁడు కళ్యాణమంటపంబున కేతెంచుట | | ... | 201 |
| నలదమయంతీపరిణయము | ... | ... | 208 |
| బువ్వపుబంతి | ... | ... | 212 |
| ఆశ్వాసాంతము | ... | ... | 220 |


### సప్తమాశ్వాసము


| | | | |
|---|---|---|---|
| నలుఁడు దమయంతీసహితుఁడై నిజరాజధాని కేఁగుట | | ... | 221 |
| నలదమయంతులపురప్రవేశము | ... | ... | 225 |
| ఇంద్రాదులు స్వర్గమునకు మరలుట... | | ... | 226 |
| ఇంద్రాదులకు మన్మథుఁ డెదురుపడుట | | ... | 229 |

| విషయము. | పుట. |
|---|---|
| క్రోధుం డెదురుపడుట ... ... | 230 |
| లోభుం డెదురుపడుట ... ... | 232 |
| మోహుం డెదురుపడుట ... ... | 233 |
| కలి యెదురుపడుట ... ... | 234 |
| నిషధదేశంబునం గలిపురుషుని దుర్వర్తనము ... | 250 |
| నలదమయంతీగృహప్రవేశము ... ... | 256 |
| విహారసౌధవర్ణనము ... ... | 257 |
| నలదమయంతులవిహారము ... ... | 259 |
| ఆశ్వాసాంతము ... ... | 270 |

అష్టమాశ్వాసము

| | |
|---|---|
| ప్రాభాతవైతాళికగీతములు ... ... | 271 |
| నలుఁడు ప్రాతఃకాలకృత్యంబులం దీర్చుట ... | 277 |
| నలదమయంతులగోష్ఠి ... ... | 280 |
| మాధ్యాహ్నికము ... ... | 289 |
| శివపూజ ... ... | 292 |
| హరిపూజ ... ... | 294 |
| హరి స్తుతి ... ... | 295 |
| భగవద్దశావతారవర్ణనము ... ... | 296 |
| సంగీతాదిగోష్ఠి ... ... | 302 |
| సాయంసంధ్యావర్ణనము. ... ... | 302 |
| నక్షత్రవర్ణనము ... ... | 304 |
| అంధకారవర్ణనము ... ... | 305 |
| చంద్రవర్ణనము ... ... | 306 |
| ప్రబంధోపసంహారము ... ... | 314 |
| ఆశ్వాసాంతము ... ... | 315 |

శ్రీరస్తు

# శృంగారనైషధము

## ప్రథమాశ్వాసము



ఇష్టదేవతాప్రార్థనాదికము

రామాకుచమండలీమృగమద
శ్రీగంధసంవాసిత
స్ఫారోదారభుజాంతరుండు ధరణీ
సంశ్లేషసంభావనా
పారీణుండు కృతార్థుఁ జేయుఁ గరుణా
పాథోధి పద్మాక్షుఁ డిం
పారన్ మామిడిపెద్దమంత్రిసుతు సిం
గామాత్యచూడామణిన్. 1

మ. *కనకక్షోణిధరంబు కార్ముకముగాఁ గద్రూతనూజుండు శిం
జినిగా మాధవుఁ డమ్ముగాఁ బురము లక్షీణైకదోశ్శక్తి గె
ల్చినయాదీశ్వరుఁ డిచ్చుఁ గాత జయలక్ష్మీసుస్థిరైశ్వర్యశో
భనముల్ పెద్దయసింగమంత్రికి జగత్ప్రఖ్యాతసత్కీర్తికిన్.

ఉ. *హాటకగర్భుచేతఁ గమలాసనుచేఁ జతురాస్యకంఠశృం
గాటకవీథికాకృతవిగాహచతుశ్శ్రుతిచేత దేవతా

---

* ఈ గుర్తుగలవి [illegible] పాఠములు.

కోటికిరీటసంఘటితకోమలపాదసరోజు చే జగ [తుల్.
న్నాటకసూత్రుచేతఁ గృతినాథుఁడు గాంచుఁ జిరాయురున్న

శా. జే జే యంచు భజింతు నిష్టఫలసంసిద్ధుల్ మదిం గోరి ని
ర్వ్యాజప్రౌఢకృపావలంబునిఁ గటప్రస్యందిదానాంబునిం
బూజాతత్పరదేవదానవకదంబుఁ బాలకేళీకళా
రాజత్కౌతుకరంజితోరగపతిప్రాలంబు హేరంబునిన్. 4

సీ. సింహాసనము చారుసితపుండరీకంబు
చెలికత్తె జిలువారుపలుకుఁజిలుక
శృంగారకుసుమంబు చిన్నిచుక్కలరాజు
పసిఁడికిన్నెరవీణ పలుకుఁదోడు
నలువనెమ్మోముఁదమ్ములు కేళిగృహములు
తళుకుటద్దంబు సత్కవులమనసు
వేదాదివిద్యలు విహరణస్థలములు
చక్కనిరాయంచ యెక్కిరింత

తే. యెపుడు నేదేవి కాదేవి యిందుకుంద
చంద్రచందనమందారసారవర్ణ
శారదాదేవి మామకస్వాంతవీథి
నిండువేడుక విహరించుచుండుఁ గాత. 5

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి. 6

### ఆదికవిస్తుతి

సీ. వ్యాసవాల్మీకిసంయమివాక్సుధాంభోధి
లోలోర్మిపంక్తుల నోలలాడి
భట్టబాణమయూరభారతీసందర్భ
సౌభాగ్యగరిమంబు సంగ్రహించి

భాసపౌమిల్లికప్రతిభాసమున్మేష
హేలావిశేషంబు నిచ్చగించి
మాఘభారవిచకోరమకరందనిష్యంద
మాధుర్యమునకు సమ్మదము నొంది
తే. కాళిదాసు మనంబులోఁ గాంచి మ్రొక్కి
రాజశేఖరుఁ గవిరాజుఁ బ్రస్తుతించి
ధీరమతి నన్నపార్యునిఁ దిక్కయజ్వ
శంభుదాసునిఁ గర మర్థి సన్నుతించి. 7

వ. నవరసభావానుబంధబంధురంబుగా నొక్క ప్రబంధంబు నిర్మింపం దలంచి కౌతూహలాధీనమానసుండ నై తన్మహాప్రబంధప్రారంభంబునకుం దగినపుణ్యశ్లోకపురాతనమహారాజచరిత్రం బెయ్యది యొకో యని వితర్కించుచున్నసమయంబున. 8

కృతిపతిప్రశంస

సీ. తనకృపాణము సముద్ధతవైరిశుద్ధాంత
తాటంకముల కెగ్గుఁ దలఁచుచుండఁ
దనబాహుపీఠంబు ధరణిభృత్కమఠాహి
సామజంబులకు విశ్రాంతి యొసఁగఁ
దనకీర్తినర్తకి ఘనతరబ్రహ్మాండ
భవనభూములఁ గొండ్లిఁ బరిఢవిల్లఁ
దనదానమహిమ సంతానచింతారత్న
జీమూతసురభుల సిగ్గుపఱుపఁ
తే. బరఁగుశ్రీపెమ్మఁడలేశ్వరునిమంత్రి
యహితమన్మంత్రినదనము ప్రాచతార

శాసనుఁడు రాయవేశ్యాభుజంగబిరుద
మంత్రి పెద్దయసింగనామాత్యవరుఁడు. 9

శా. పంచాంగస్థిరమంత్రరక్షణకళాప్రౌఢుండు బాలావసః
పాంచాలుండు విరించివంశజలధిప్రాలేయభానుండు దో
శ్చంచచ్చాపకృపాణలబ్ధవిజయైశ్వర్యుండు దిక్కామినీ
కాంచీమౌక్తికకీర్తి పెద్దవిభుసింగం డొక్కనాఁ డిష్టులన్.

వ. మృదుమధురచిత్రవిస్తరకవితావిలాసవాగీశ్వరు లగుకవీశ్వరులును, పతంజలికణాదాక్షచరణపక్షిలాదిశాస్త్రసిద్ధాంతకమలవనహంసు లగు విద్వాంసులును, భరతమతంగ దత్తిల కోహ లాంజనేయప్రణీత సంగీతవిద్యారహస్యవిజ్ఞానసన్నైజ్ఞానికస్వాంతు లగుకళావంతులును, శక్తిత్రయచతురుపాయషాడ్గుణ్యప్రయోగయోగ్యవిచార లగు రాయబారులును, నిఖిలపురాణేతిహాససంహితాతాత్పర్య పర్యాలోచనాధురంధరధిషణాసముత్సాహం బగు పౌరాణికసమూహంబును, బరివేష్టింపం గొలువుండి, సకల విద్యాపారీణుండు సరస సాహిత్యగోష్ఠీవినోదప్రసంగంబున. 11

*శా. భారద్వాజపవిత్రగోత్రుని శుభాపస్తంబసత్సూత్రు వి
ద్యారాజీవభవుండు మారయకుఁ బుణ్యాచారభీమాంబకు
న్గారామైనతనూజ నన్ననఘు శ్రీనాథాఖ్యునిం బిల్చి స
త్కారం బొప్పఁగ గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢిమన్.

శా. బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడ వురుప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చనకళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాదిమహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే! 13

క. జగము నుతింపఁగఁ జెప్పితి
ప్రెగడయ్యకు నాయనుంగుఁ బెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగునాయారాధ్యచరిత మాదిగఁ బెక్కుల్. 14

వ. కావున నాకు నొక్కప్రబంధంబు పుణ్యశ్లోకపురాతనరాజర్షి
చరితానుబంధబంధురంబుగా రచియింపు మందును. 15

సీ. కవిరాజరాజిశేఖరహీరముకుటంబు
శ్రీహీరకలశాబ్ధిశిశిరకరుఁడు
మామల్లదేవీకుమారరత్నంబు చిం
తామణిమంత్రచింతనఫలంబు
కవికులాదృష్టాధ్వగమనాధ్వనీనుండు
కాశ్మీరనృపసభాకమలహేళి
ఖండనగ్రంథసంగ్రంథకర్కశబుద్ధి
షట్కర్మధర్మైకచక్రవర్తి

తే. భట్టహర్షుండు ప్రౌఢవాక్పాటవమున
నెద్ది రచియించె బుధలోకహితముపొంటె
నట్టినైషధసత్కావ్య మాంధ్రభాష
ననఘ యొనరింపు నాపేర నంకితముగ. 16

చ. పనివడి నారికేళఫలపాకమునం జవి గైనభట్టహ
ర్షునికవితాసుగుంభములు సోమరిపోతులు కొంద అయ్యెలొ
నని కొనియాడ నేర రది యట్టిద; లేజవరాలు చెక్కు గీఁ
టిన నస నల్లుబాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే!

వ. అని పలికి సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలం బొసంగి
జాంబూనదాంబరాభరణంబులు గట్టనిచ్చి వీడ్కొలిపిన; నేను

నమ్మహాప్రధానునిం గృతినాయకుంజేసి నైషధకావ్యంబు
చెప్పం దొడంగితిఁ దత్ప్రారంభంబునకు మంగళాచారం
బుగాఁ దదీయవంశావతారం బభివర్ణించెద. 18

కృతిపతివంశావతారవర్ణనము

శా. తోరంబై నతపోవిశేషమున సద్యోజాతవక్త్రంబున
న్గౌరీవల్లభుచేత దీక్షఁ గొనియె న్సత్త్వస్థలం దొక్కఁడై
తారావీథి నలంకరించెఁ, గనియెం ద్రయ్యర్థసంఘాతముల్,
భారద్వాజమహామునీంద్రుఁ డగదే భక్తిం బ్రశంసింపఁగన్.

ఉ. ఆమునినాథునన్వయమునం దుదయించెఁ బయఃపయోనిధిన్
యామవతీకళత్త్రుఁ డుదయం బయినట్లుగఁ గల్పవృక్షచిం
తామణికామధేనుసమదాననిరూఢుఁడు విద్విషత్తమ
స్తోమదివాకరుండు పెదతూర్కనమంత్రి కులాగ్రగణ్యుఁడై.

వ. తత్సంతానక్రమంబున. 21

మ. కుటిలారాతివరూథినీధవశిరఃకుట్టాకధాటీమహా
పటహధ్వానవిపాట్యమానదశదిగ్భాగుండు త్రైలోక్యసం
పుటపేటీపరిపూర్ణకీర్తిమయకర్పూరప్రకాండుండు శ్రీ
చిటిపెద్దప్రభుఁ డొప్పె విక్రమపురీసింహాసనాధ్యాసియై. 22

క. ఆచిటిపెద్దప్రభునకు
వాచస్పతిసదృశనీతివైభవలక్ష్మీ
వైచిత్త్రి కధికవిమలశి
వాచారఘనుండు మామిడన్న జనించెన్. 23

ఉ. స్వామిహితంబునన్, సమదశాత్త్రవభంజనశక్తి, బంధుసం
తోషవహానీయసంపద, వసంతసమాగమఫుల్లమల్లికా
స్తోమతుషారపాండురయశోగరిమంబున, ధర్మశీలతన్,
మామిడిమంత్రిఁ బోలమఱి మంత్రులు లేరు వసుంధరాస్థలిన్.

తే. అతనియర్ధాంగలక్ష్మి యక్కాంబ గనియె
నాత్మజుల వేదమూర్తుల నబ్ధినిభుల
వెలయ శ్రీపెద్దనామాత్య వీరభద్ర
మారనప్రభు నామన మంత్రివరుల. 25

సీ. అనవద్యహృద్యవిద్యాబుద్ధిసంసిద్ధి
బిసరుహాసనుసుద్ది పెద్దవిభుఁడు
భద్రనిర్నిద్రవాఙ్మయప్రాసముద్వృత్తిఁ
గద్రూభవుఁడు వీరభద్రమంత్రి
మేరుభూధరసారధీరతాగుణహారి
వైరిశైలబలారి మారశౌరి
స్వామిభక్తిహితైకభావవైభవభూమి
భామినీరతిరాజు నామరాజు

తే. మామిడీశ్వరసాగరామరకుజంబు
లక్కమాంబికాశుక్తిరత్నాంకురములు
వంశపావను లర్థార్థివాంఛితార్థ
దానశౌండులు సౌభ్రాత్రధర్మహరులు. 26

*మ. అనతారాతివసుంధరారమణసప్తాంగాపహారక్రియా
ఘనసంరంభవిజృంభమాణపటుదోర్గఖడ్గాద్వితీయాగ్రసుం
డనవేమాధిపురాజ్యభారభరణవ్యాపారదక్షుండు పె
ద్దనమంత్రీశుఁడు మామిడన్నసుతుఁ డేతన్మాత్రుఁడే చెప్పఁగాన్.

ఉ. హేమధరాధరేంద్రమున కెక్కటిపెద్ద ధృతిన్ భుజంగమ
స్వామికి మేలుచేయి పటువాగ్విభవంబున బుద్ధిసంపదం
దామరచూలికి న్సరి ప్రధానులు దక్కినవారు సాటియే
మామిడివీరభద్రున కమాత్యశిఖామణి కివ్వసుంధరన్? 28

ఉ. సత్యవచోనిరూఢుఁడు నిశాకరశేఖరభక్తిభావనా
సాత్యవతేయుఁ డుద్భటభుజాబలవిక్రమకేళి విక్రమా
దిత్యుఁడు కార్యఖడ్గసముదీర్ణుఁడు మామిడిమంత్రి మారనా
మాత్యుఁడు వానిఁ బోల వశమా ధరణీధవమంత్రికోటికిన్?

శా. స్వామిద్రోహరగండలాంఛనసునర్కున్ సంగ్రామగాండీవికిన్
వేమక్ష్మాపతికార్యభారకలనావిఖ్యాతధీశక్తికిన్
నామామాత్యున కన్యరాజనిటలాంతర్న్యస్తభాగ్యాక్షర
స్తోమాపాకరణప్రవీణునకు మంత్రుల్ సాటియే యెవ్వరున్?

ఉ. తమ్ములు దన్ను మువ్వురును దైవముఁగా గురుఁగా మహానిధా
నమ్ముఁగ దాతఁగాఁ దమమనంబుల భావన సేసి కొల్వ భా
గ్యమ్ముల కెల్ల నెల్ల యయి కాంచెఁ బ్రసిద్ధి నృపప్రధానర
త్నమ్మగుమంత్రి పెద్దన యుదాత్తమతిన్ రఘురాముకైవడిన్.

సీ. గౌతమగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
పరమసంయమిసూత్రపావనుండు
గారాపుఁబౌత్త్రుండు గంధవారణుఁ డగు
శ్రీకేతనామాత్యశేఖరునకు
పేషణిహనుమంతబిరుదాంకు లగు రాచ
వారికి నెయ్యంపువరసుతుండు
చౌహత్తమల్లుండు దోహత్తనారాయ
ణుండు ఖండియరాయచండబిరుద

తే. మంత్రియల్లాడరాజును మహితపుణ్య
యన్నమాంబయుఁ దనకు నత్యంతగరిమఁ
దల్లియును దండ్రియును గాఁగఁ దనరునట్టి
తల్లమాంబికాదేవి నుద్వాహమయ్యె. 32

మ. వనితారత్నము తల్లమాంబికకు శ్రీవత్సాంకతుల్యుండు పె
ద్దనకుం బుట్టిరి నందనుల్ విమలవిద్యాభారతీవల్లభుల్
వినతాసూనుసమానవిక్రమనిధుల్ వీరందు వేమాహ్వయుం
డును శ్రీప్రెగ్గడదండనాథతిలకుండుఁ సింగనామాత్యుఁడున్.

వ. అందగ్రజుండు. 34

సీ. కాలకంఠ కఠోరకంఠహుంకారంబు
చెవులు సోఁకనినాఁటిచిత్తభవుఁడు
కుపితరాఘవఘనక్రూరనారాచంబు
తనువు నాఁటనినాఁటివనధిరాజు
క్రుద్ధకుంభోద్భవభ్రూలతాకౌటిల్య
వికృతిఁ గ్రుంగనినాఁటివింధ్యశిఖరి
వీరభద్రోదారఘోరవీరావేశ
విహతిఁ గందనినాఁటితుహినకరుఁడు

తే. చక్కఁదనమున గాంభీర్యసారమునను
బ్రకటధైర్యకళాకలాపములయందు
దండనాయకచూడావతంసమైన
మంత్రిమానిడి వేమనామాత్యుఁ డెలమి. 35

మ. తగుఁ గైవారమొనప్ప విక్రమకళాధౌరేయతాశాలి శ్రీ
ప్రెగ్గడన్న ధ్వజినీశుఁ డంబునిధిగంభీరుండు శుంభద్ద్విష
న్నగరద్వారకవాటపాటనవిధానప్రౌఢబాహార్గళా
యుగళుం డాహవసవ్యసాచి ధరలోనొక్కండు వేరున్ననన్.

సీ. గగనకల్లోలినీకల్లోలమాలికా
హాస్లీనకములతోఁ సవఘళించి

చరమసంధ్యాకాలసంఫుల్లమల్లికా
స్తబకసంతతులతోడ సరస మాడి
శరదాగమారంభసంపూర్ణపూర్ణిమా
విమలచంద్రికలతో వియ్యమంది
బిసరుహాసనవధూపృథుపయోధరభార
హారవల్లరులతో నసఁగి పెనఁగి

**తే.** వెలయు నెవ్వానియభిరామవిమలకీర్తి
యతఁడు త్రిభువనరాయవేశ్యాభుజంగ
కదనగాండీవిజగనొబ్బగండబిరుద
శాశ్వతుం డొప్పు సింగన సచివవరుఁడు. 37

**మ.** అరుదార న్వివిధాగ్రహారములతో నాందోళికాచ్ఛత్త్రచా
మరకల్యాణకళాచికాదిబహుసమ్మానార్హచిహ్నంబు లా
దర మొప్పారఁగ వేమభూవరునిచేతం గాంచెసామ్రాజ్యసం
భరణప్రౌఢుఁ డమాత్యసింగఁడు నయప్రాగల్భ్యగర్వోన్నతిన్. 38

**వ.** ఈదృగ్విధగుణాలంకారుఁ డైనయమ్మహాప్రధానశేఖరునకు.

షష్ఠ్యంతములు

**క.** శ్రీమంతున కావర్జిత
సామంతున కహితహృదయజలజాతపనీ
హేమంతునకును సలలిత
భామాకంతునకు సచివభాస్వంతునకున్. 40

**క.** కుకురు కురు చోళ కేరళ
శక మరు కర్ణాట లాట సౌవీర నృప

ప్రకరసభాభరణమహా
సుకవిజనానీకవినుతశుభచరితునకున్. 41

క. చెంచిమలచూరకారున, కంచితకరుణాతరంగితాపాంగునకున్
జంచలనయనాకలకిల, కించితలీలావిలాసకేళీరతికిన్. 42

క. హాటకగిరిధీరున కరి, తాటంకవతీకపోలతలకరిమకరీ
పాటచ్చరకఠినభుజును, జ్యాటంకారునకు మన్మథాకారునకున్.

క. శ్రీమహితు పెద్దసుతునకు, వేమక్షితిపాలరాజ్యవిభవకళార
తామణికి సింగసచివ, గ్రామణికిం బాండ్యరాజగజకేసరికిన్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యిమ్మహా
ప్రబంధంబునకుం గథానాయకుండు. 45

---

## కథాప్రారంభము

### నలమహారాజవర్ణనము

సీ. తపనీయదండైకధవళాతపత్రితో
ద్దండతేజఃకీర్తిమండలుండు
నిర్మలనిజకథాసుధాపూరకల్లోలినీ
క్షాళితాఖిలజగత్కల్మషుండు
వితతనవద్వ్యాయద్వీపనానాజయ
శ్రీవధూటీసమాశ్లిష్టభుజుండు
నిఖిలవిద్యానటీనృత్తరంగస్థలా
యమానాయమానరసజిహ్వాగ్రలుండు

తే. ప్రస్తుతింపంగఁ దగు సముత్స్ఫుటకఠోర
చటులగుణటంక్రియాఘనస్ఫురితఘోష

చాపనీరదభవశరాసారశమిత
బలవదహితతేజోదవానలుఁడు నలుఁడు. 46

చ. అలయకధీతిబోధములు నాచరణంబు ప్రచారణంబు గాఁ
గలుగునుపాధిభేదముల గాఢమతి న్నిగమాదు లైనవి
ద్యలు పదునాలుగింటికి నతం డొనరించెఁ జతుర్దశత్వముం;
దెలియఁగ లేము కారణము దీనికి నెమ్మెయిఁ జర్చ చేసినన్.

తే. అతనివిద్య జిహ్వానటి శ్రుతివిధమున
నంగగుణమున నష్టాదశాత్మ యగుచు
విస్తరిల్లె నవద్వయద్వీపపృథగ
శేషభూజయలక్ష్మీజిగీషఁబోలె. 48

తే. తాఁ ద్రినేత్రునియపరావతార మగుటఁ
దెలుపుదిక్పాలకాంశావతీర్ణుఁ డతఁడు
కామసంచారహరణప్రగల్భ మైన
శాస్త్ర మనుపేరియధికలోచనము కలిమి. 49

చ. కెరలి మహాసివేమసహకృత్వరితద్భటకోటిచాతురీ
తురి సమరాంగణంబులఁ జతుర్వారిదావరణంబులన్ యశోం
బరముల నేయుచుండు బహుభంగులఁ బున్నమనాఁటినిండు
చంద్రునునుసోగవెన్నెలలతోఁ దులఁ దూఁగెడుతద్గుణం
బులన్. 50

తే. తద్దిశాజయయాత్రోత్థధరణిధూళి
దోఃప్రతాపవైశ్వానరధూమ రేఖ
పాలమున్నీటిలోఁ బడి పంక మయ్యె
నమృతదీధితిపైఁ జెంది యంక మయ్యె. 51

చ. అరయక గల్గి భూమివలయం బఖిలంబును నీతిబాధలం
బొరయక యుండ నాన్నృపతిపుంగవుఁ డేలుచు నుండ నొండు
చోఁ, నిరవయి యుండ కుండుటఁజుమీయతివర్షము లాశ్ర
యించెఁ ద, త్పరనరనాథయూథవనితాజనతానయనోత్ప
లంబులన్. 52

ఉ. కొం డని వేడ్కతోఁ బసిఁడికొండ ధనార్థుల కెల్లఁ బంచి
యీ, కుండుట దానధారకుఁ బయోనిధు లెల్ల వ్యయింప
లేమి యీ, రెం డప కీర్తులం దల ధరించినవాఁడు ప్రదాన
శీలుఁ డా,తం డిరువ్రాయ గా ముడికి దార్చినవెంద్రుక
లన్మిషంబునన్. 53

చ. నియమవిచిత్రభంగి మహనీయుఁడు భూమివిభుండు మిత్రజే
తయును నమిత్రజేతయుఁ బ్రతాపగుణంబున నీతిఁ జారదృ
ష్టియును విచారదృష్టియు, నటే! పరిపంథిమహీశులట్ల త
ద్భయమున భేత్తృతాగుణము వాసెనొ కాక విరుద్ధ
ధర్మముల్. 54

మ. ధర నేకాంఘ్రికనిష్ఠికాంగుళమ యూర్ధ్వాంబుగా నిల్పి ని
ర్భరలీలం గృతవేళ నెట్టన యధర్మంబుం దపస్విత్వముం
బొరసెం దక్కినవార లెవ్వరు తపంబుల్ సేయ! తన్మేదినీ
శ్వరసామ్రాజ్యమునందు ధర్మము చతుష్పాదంబునం గ్రాలఁ
గన్. 55.

క. ఆరాజు విజయలక్ష్మికి
నీరాజన మాచరించు నిర్దగ్ధదిగం
తారాతిరాజనగరి
దారుణవైశ్వానరప్రదక్షిణశిఖలన్. 56

చ. ఇతఁడు దరిద్రుఁ డౌ ననుచు నెప్పుడ నర్థిలలాటపట్టికా
శతధృతి వ్రాసినట్టి లిపిజాల మనర్థము గాని యట్లుగా
వితరణఖేలనావిభవవిభ్రమనిర్జితకల్పభూరుహుం
డతఁడు దరిద్రతాగుణమునందు దరిద్రుని జేయు నాతనిన్.

*తే. అతనికీర్తి ప్రతాపంబు లవనిఁ గలుగ
నేల యివి? యంచు మదిలోన నెపుడు దలఁచు
నపుడ పరివేషమిషమున నబ్జసూర్య
మండలముల విధాత్రుండు గుండలించు. 58

వ. అన్నలుండు నళినబాంధవుండునుంబోలెఁ బ్రతిదినంబును నభ్యుదయంబు నొందుచుఁ, గ్రమంబున శైశవంబు నతిక్రమించి యౌవనారంభంబున నరిదుర్గలుంఠనావసరంబులం బోలె లోహార్గళదీర్ఘపీనతయును గోపురద్వారకవాటదుష్ప్రధర్షతయును బాహావక్షంబులచేత బందిగ్రాహంబు గ్రహించి రోమకోటికపటంబున హాటకగర్భుండు పాటించి లిఖించిన సుగుణగణనారేఖ లవయవంబులం బొలుపార సంపూర్ణపూర్ణిమాచంద్రబింబంబు విడంబింపం జాలునెమ్మొగంబునకుం గళంకాలంకారశంక సంఘటింపఁజేయంజాలు కోమలశ్మశ్రురాజి విరాజిల్లం గందు మెఱసి రెండవకుసుమకోదండుండునుంబోలె విలాసినీమండలికిం గన్నులపండువై వెండియు. 59

తే. దాస్య మొనరించు విధుఁ డేతదాస్యమునకుఁ
బల్లవము లేతదంఘ్రిసంపల్లవములు
జలరుహములకుఁ దచ్ఛయచ్ఛాయదాయ
నాఁగనతఁ డొప్పె నవయౌవనాగమమున. 60

వ. అయ్యవసరంబున. 61

తే. వానిఁ గలలోనఁ గానని వనజముఖియు
వాని మాఱ్పునఁ జొక్కని మానవతియు
వానిఁ గా నాత్మ భావించి వరునిఁ గవయ
నప్పళింపనిసతియు లేదయ్యె నచట. 62

వ. దరహాసితావధీరితసుధాకరబింబము నేత్రనిర్జితాం
బుజహాము నైన యానిషధభూవరునుల్లసితాననంబుతో
సరి మఱి యొర్లు గల్గమికి సంశయ మేటికిఁ దద్ద్వయీవిజి
త్వాపకమనీయవస్తురహితం బగుచు త్రైచరాచరంబునన్? 63

క. తలవెంట్రుక లెగఁగట్టెడు
కొలఁదిన నానృపకుమారకుఁడు కడిమి మెఱయన్
నలు దెసలకరులగండ
స్థలఫలకములన్ లిఖించె జయశాసనముల్. 64

తే. తరుణపాథోరుహోద్ధోవిధానములను
ధరణినాథకిరీటాగ్రధానములను
నూర్ధ్వమయ్యెడునిది యంచునో కో విధాత
తత్పదం బూర్ధ్వరేఖాంకితంబు సేసె. 65

తే. అప్పుడు లీలావినిర్జితానంగుఁడైన
యతనిఁ గనియును వినియుఁ జింతానురక్తి
స్వర్గమర్త్యపాతాళవిష్టపములందు
విబుధనరభోగికాంతలు వివశలైరి. 66

ఉ. తెప్పలు వాఱ్ప కప్పుడమి తేనిమనోహరమూర్తి నిచ్చలుం
దప్పక చూచి చూచి విబుధప్రమదల్ ప్రమదంబు లాత్మలం

జిప్పిలుచుండ నెద్ది పరిశీలన సేసిరో యట్టియబ్బెఱం
బిప్పుడు వారు చూపుదూ రవేతనిమేషము లైనచూపులన్.

**తే.** తద్గుణాకర్ణనంబునఁ దదనిరీక్ష
ణమున ధన్యత్వమును నధన్యతయుఁ బొంది
యభిమతానభిమత మైనయట్టియంగముఁ
దాల్చెఁ జక్షుశ్శ్రినఃస్త్రీకవంబకంబు. 68

**చ.** †మొలచినకూర్మిఁగన్నుఁగవమోడ్చినయప్పు డజస్రభాసనా
బలమునఁ నాన్యపాలకునిఁబాయక చూతురు మర్త్యభామ లా
యలికులనీలవేణులకు నస్మెయి నవ్విభుఁ జూచువేళలన్
గలుగవు వో నిమేషపరికల్పనఁ బుట్టెడుసంతరాయముల్. 69

**సీ.** కోరి లీలాగేహకుడ్యభాగంబుల
వ్రాయుదు రమ్మహీశ్వరునిమూర్తి
వ్రాసి కన్యాత్వగౌరవము వీసరవోవ
దర్శింతు రనురాగతరళదృష్టి
దర్శించి యతని కేఁ దగుదునో తగనో యం
చించుకించుక సంశయింతు రాత్మ
సంశయించి కరాంబుజములఁ గ్రొన్మించుట
ద్దము లెత్తిచూతురు తమ్ముఁ దారు

**తే.** రాజకన్యలు జగతి నాక్రమమునందుఁ
గందు వారలనిట్టూర్పు గాడ్పు వేఁడి
ముకురములు చారుమోహనమూర్తి యనఁగఁ
బరఁగుదమయంతిచేతిదర్పణముదక్క. 70

---

† 'పొలుపొనఁగూడి; పొలుపొంగిఁజూచి' అని పాఠాంతరములు.

వ. ఇవ్విధంబునననన్యరూపలావణ్యరేఖావిలాసభాసమానయగు
భీమనందన యానరేంద్ర బృందారకునియందు డెందంబు
నిలుపుటయును. 71

తే. అప్పు డనలావపుష్పత నారఁ గూరి
బాణపురమును బోనియాభైమిమనముఁ
బుష్పబాణాసనుఁడు భోగభోజి యైన
వరవయోవిశేషంబు వార్యముగఁ దఱిసె. 72

దమయంతి నలునియం దనురక్త యగుట

వ. దమయంతియు శ్రవణప్రీతివాసనావశంబునం బ్రతిదిన
ప్రవర్ధమానంబగు మనోనురాగంబు నిరూఢంబై యుండ.

మ. జనకుం గొల్వఁగ వచ్చినప్పుడు తదాస్థానంబులోఁ బాఠకుల్
వినుతప్రౌఢి వసుంధరాధిపతులన్ వేర్వేఱ కీర్తించుచో
వనితారత్నము వీరసేనుతనయున్ వర్ణింపఁగా నున్నత
స్తనభారంబు కెలంకుల న్నినుచుఁ జంచల్లీల రోమాంచముల్.

తే. మహిమ హిమవేళలందు నస్మానవతికి
మాసరము లయ్యెఁ దలఁపంగ వాసరములు
పొడవు గలిగి తపర్తుసంపూర్తియందు
నంచితాయామవతు లయ్యె యామవతులు. 75

సీ. సఖులుఁ బాఁ బుష్పాస్త్రసామ్రాజ్యపదవికి
నభిషేక మొనరించు నవనినాథు
నలనామధేయ మైనత్పృణంబు వినఁబడ్డ
నధిపతిపే ర్విన్న యట్ల యలరు

నిషధదేశపువిప్రనికరంబుఁ బూజించి
యలయక ప్రియుసుద్ది యడుగఁ దలఁచు
నభ్యాసవశమునఁ బ్రాణేశ్వరునిమీఁది
యించుగీతములు వాయించు వీణ
తే. నేర్పు గలచిత్రకరులచే నిలయభిత్తి
భువనమోహనాకారతఁ బొలుపు మిగుల
మగని మగువను వ్రాయించి మదిఁ దలంచు
నిషధరాజును దన్నుఁగా నీరజాక్షి. 76

ఉ. పువ్విలుకానితోడ సరిపోలెడుచక్కనివాఁడు భూమిలో
నెవ్వఁడు చెప్పుఁడా? యనుచు నిష్టవయస్యలఁ గూర్చి
యాత్మలో, నువ్విళులూరుచుం బలుకు; నొప్పులనుప్ప!
నలుండు గాక యొం, డెవ్వఁ? డనంగ మెచ్చుఁ బరాక్షేశుణ
నెయ్యము వియ్య మెట్టిదో. 77

వ. మఱియు మనోరథపరంపరాసంవరణప్రసూనదామంబున నన్న
హీపతిం బఱిఁగా వరియించియుం ద్రిభాగశేషంబు లగు
విభావరీసమయంబు నిమీలితంబైన నేత్రయుగ్మంబును
బాహ్యేంద్రియమానముద్రాభిముద్రితం బైనయంతఃకర
ణంబును మొఱంగి నిద్రాసమానీతుం డైనయారాజమనో
జాతుతో నెంతయుం దడవు మంతనం బుండియు నిరంతర
స్మరణసరణిధారావాహికావగాహంబున నెడనెడం బొడ
చూపు నప్పుడమితేనిం గనుంగొని లజ్జాసాధ్వసభ్రమంబులు
మనంబులో ముప్పిరిగొనం బ్రమోదించియు నవ్వైవర్బి
నిర్భర మదనశరశలాకాశంకుసంకలిత వేదనాదూయమాన
మానసయై విజృంభితమనోభవభుజావష్టంభంబులగుహిమా

రంభంబులును గాలాగరుకళంకితకామినీకంఠమూలంబులగు శిశిరకాలంబులును గలకంఠ కామినీకంఠకోమలకుహూకారకోలాహలకరంబితకకుబంతంబు లగువసంతంబులును, సాయంతనసమయ సంఫుల్లమల్లికామోద మేదురసమీరణౌఘంబు లగునిదాఘంబులును విరహిజనహృదయభయంకర స్తనితసందోహంబు లగుజలధరానేహంబులును సకలజన మనోవికాసమయంబు లగుశారదసమయంబులును గడపుచుండె నవ్వేళ జలధి వేలావలయవలయితవసుంధరాభువన మండలాఖండలుం డగునలుండును విమలనిజకీర్తిమౌక్తిక మాలికాసంతానంబులకు నంతర్ఘటనాగుణంబులుంబోలెం బొలుచునక్కాంతాలలామంబుగుణంబులు జనపరంపరవలన వినియె నాసమయంబున. 78

నలుండు దమయంతియం దనురక్తుం డగుట

శా. ఆవామాక్షిమనోహరాకృతియమోఘాస్త్రంబుగాభూవరుం
* లావణ్యాధికు నచ్చలంబుమెయిగెల్వం బూని యిందిందిర
జ్యావల్లీకిణకర్కశం బయినహస్తం బుద్ధతిం జాఁపి వే[మున్.
పూవుందూపులజోదు పుచ్చుకొనియెం బుండ్రేక్షుకోదండ

క. శ్రవణావతంస మయ్యెను
ధవళాయతనేత్రగుణము ధరణీపతికిన్
శ్రవణావతంస మయ్యెను
బువువింటిగుణంబు నపుడ పుష్పాస్త్రునకున్. 80

ఉ. ఆవసుధాధినాథుని మహాధృతిశాలి జయించు తెంపునన్
భావజుఁ డప్పు డున్మదనబాణము తియ్యనివింటఁగూర్చుచోఁ

సేవలసాహసంబు మదిఁ గీల్కొనఁ జేసియు నుంచెఁ బాః త్రి
లో, కీవిజయార్జితంబు లగుకీర్తిభరంబుల సంశయాంబుధిన్.

తే. అతనుఁ డఁట జోదు! పూమొగ్గయఁట శరంబు!
చించినది యఁట తద్ధైర్యకంచుకంబు!
నలుని దమయంతితోఁ గూర్పఁ దలఁచియున్న
ధాతమదియెత్తికోల్తుదిఁ దాఁకకున్నె! 32

*ఉ. ఎయ్యది కారణంబుగ మహీపతియంచితధైర్యకంచుకం
బయ్యతనుండు సించె నలరమ్ములచే నది కారణంబుగాఁ
దొయ్యలి రాజనందనునితోడన కూర్పఁ దలంచుచున్నయా
దయ్యము నెత్తికోలు తుదిఁ దాఁకుటఁ గానఁగ నయ్యె
నయ్యెడన్. 33

ఉ. ఏస విరి న్విరించి నొకయేటునఁ దామరపాన్పుపై నుపం
ద్రోసినజోదు మన్మథుఁడు దుర్వహనూత్నవియోగపావనా
యాసిత మైనరాజుహృదయాబ్జము గాఁడఁగ నేసె నెంత
యుం, గాసిలి తేఁటితెక్క గటి గట్టినపుష్పశిలీముఖంబులన్.

తే. లలన లజ్జాసరిద్దుర్గలంఘనమున
రాజహృదయంబుఁ జొచ్చినక్రమముఁ జూడఁ
దరుణిమారంభపరికల్పితంబు లైన
వలుఁదకుచకుంభములప్రభావమునఁ జూవె. 35

సీ. జాగరోద్భూతదృగ్రాగంబు మాణిక్య
కర్ణకుండలదీప్తిఁ గప్పిపుచ్చు
రాజకార్యపరంపరాఖేదమిషమున
నిట్టూర్పుగాడ్పుల నివ్వాలించు

ఘనసారబహుళచందనవిలేపనమున
నాపాండుభావంబు నవలపించు
దోరంతరన్యస్తతారహారంబుల
నంతఃపరితాప మపనయించు
తే. మాననీయశశాంకకోమలము లైన
యామినీసమయములుఁ బర్యంకములును
సాధులుగ నొంచువలవంత జనవిభుండు
కన్నెకూర్మి ప్రకాశంబు గాకయుండ. 86

వ. ఇవ్విధంబున ననుపమం బైన శంబరవైరివిక్రమంబు క్రమ
క్రమంబునం బరిస్ఫుటం బగుచుండ వియోగవేదనాచిహ్నం
బులు నిహ్నవింపం గొలంది గాక చీకాకుపడి యాకారరేఖా
వినిష్ఫత్రితమత్స్యలాంఛనుండగు రాజకుమారుం డొక్క
నాఁ డారామవీథీవిహారంబునం గాలక్షేపంబు సేయు
వాఁడై ప్రభంజనాధ్యేయజవంబును జంచలఖురాంచలక్షో
భిత క్షోణిమండలంబును నిగాళగదేవమణి దీప్తిచ్ఛటాపటల
శంకావహాకృత్రిమకాటికాధవళకేసరకేశరశ్మిసంచయంబును వల్గు
వల్గాసుసక్తవదనతావిడంబిత వక్త్రస్థభుజగ వైనతేయంబును
జలాచలప్రోథతానువిధీయమాన నిజవేగదర్పప్రశంసా
ప్రవచనోపన్యాసంబును నై సింధుజంబును శీతమయూఖసహో
దరంబును నగుట రెండవ యుచ్చైశ్శ్రవంబునుం బోలిన
యాపవాహ్యంబు నారోహించి. 87

తే. ప్రమదసస్పందతరనేత్రపద్మలగుచుఁ
బౌరజనులు విలోకింపఁ బ్రకటలీల

సముచితానల్పపరివారసహితుఁ డగుచు
నవనినాథసుతుండు వాహ్యాళి వెడలె. 88

వ. తత్ప్రదేశంబున. 89

ఉ. నేమ మెలర్పఁగా గొడుగునీడ వహించువసుంధరాస్థలీ
సీమనె యెక్కి యాడెను విచిత్రగతిం దురగోత్తమంబు నా
భూమివిభుండు దత్ప్రియములు వో యెడ త్రెవ్వక యభ్యసించు
వా, త్యామయచక్రచంక్రమవిహారములన్ సుడిఁగాడుప్పు
లీడ్చుచున్. 90

వ. ఇవ్విధంబునఁ గొంతతడ వతిజవనచతురతురగస్తససక్రీడాడో
లాయమానమణికుండల మరీచిమండలీనీరాజితగండస్థలుండై
వాహ్యాళివిహారంబు సలిపి వలయునమాత్యులం బరివారం
బును నచ్చోటన యుండ నియమించి యొక్కరుండును సుం
పాదచారియై ఘనచ్ఛాయంబునుం బ్రవాళరాగస్ఫురితం
బును నగువిలాసకాననంబు పయోనిధానంబు నంబుజాక్షుం
డునుం బోలెఁ బ్రవేశించి. 91

నలుని యుద్యానవనవిహారము

తే. పత్త్రములమీఁద మూఁగినభ్రమరకులము
హారవిసర్జనజనితదుర్యశముఁ బోలఁ
గమియ విచ్చినగేదంగికన్నె పువ్వుఁ
గౌతుకము పల్లవింపఁగఁ గాంచె విభుఁడు. 92

వ. విరహిజనహృదయచ్ఛేదనక్రియాక్రకచంబులు వియోగి
మర్మవిదారణవ్యాపారకర్ణినారాచంబులు పాంథజనహృత్కీక
సూచకశలాకలు నగుకనకకేతకీజాలంబులఁ జేరం జను దెంచి.

చ. చిలుపనికమ్మఁదేనియలు చిప్పిలి హ_స్తము ల_స్తకంబునన్
నిలువక నేరువాఱునెడ నీయతిసాంద్రపరాగము ల్గడా
యలరులవింటిజోదునకు నప్పటి కప్పటి కప్పళించుకోఁ
గలిగెడు నంచు వే కనలు గైకొని దూఱె విభుండు కేతకిన్.

మ. దమయంతీ స్తనకుంభవిభ్రమముఁ బొందం గోరుటన్ ధూమ
పానముఁ గావించు నధోముఖంబు లగునానాకుంభముల్
వోలె ధూపములన్ దోహద మాచరింపఁగఁ గడుం బక్వం
బులై యున్నదాడిమముల్ సూచి నృపాలకుండు మదిఁ
బాటించెన్ మహాత్మ్యైక్యమున్. 95

తే. మన్మథుం డేయుకింశుకమార్గణములు
చన్నుఁగవ నాటుటయుఁ బాంథసతియుఁ బోలెఁ
బాఱు దెంచి కీరంబులు పండ్లు గఱవ
వణఁకుదాడిమిఁ జూచె భూవరుఁడు వేడ్క. 96

వ. మఱియు మందానిలపరిస్పందంబునం గందళితంబు లైనమక
రందబిందునిష్యందంబులు చిందించుగురివెందపూఁబందిరు
లును వలరాచరాచవారికి వనదేవత లొనర్చునీరాజనప్రదీ
పాంకురంబులుం బోనికోమలకోరకంబులం గరంబు సొంపారు
నంపెంగలును మదనచాపవిముక్తంబులై మొదలం గ్రోలిన
భవశరీరభస్మాంగరాగంబు పరాగవ్యాజంబున వెడలం
గ్రాయుచున్న సువర్ణపొన్నలును రోలంబనికురుంబంబులకుఁ
బానగోష్ఠీస్థానంబు లగువికస్వరస్థలకమలినీ కదంబంబులును
గలకంఠకంఠహుంకారంబులం బాంథులకు భయంబు సంపా
దింపఁ జాలు క్రోష్టృవిమోకచాలును ధూమకేతుమండలం
బులుం బోలె పిచిహిజనులఁగుండియ లవియించుచుఁ జంచరీక

పరంపరాశిఖరంబులై సొంపారుచాంపేయంబులును వలయా
కారంబునం బరిభ్రమించుభ్రమరంబులసంగతిం గేసరరేణు
విస్ఫులింగంబులెగయ బాణోత్తేజనప్రకారంబు నంగీకరించు
చుననంగునకుం బ్రధానశాణంబు లగునారంగంబులును
మృదులపవమానసంపాతకంపమానకిసలయకంటకప్రతుతంబు
లై మదనముద్రాభిముద్రితంబు లగువారాంగనాజనంబుల
వట్రువపాలిండ్లకుం జుట్టంబులై తోరంబు లగుపనసపుం
బండ్లును నిఖిలయువద్వయీచిత్తనిమజ్జనోచితంబు లగుసజ్జ
కపుఁ బూమొగ్గలును బ్రవాళగర్భగహ్వరంబులందు నివా
యించుచు నించువిలుకానితూణీరంబులకుం బోల్పఁ బన్నైన
కలిగొట్టుపాదలును నొండొండ చంద్రఖండంబులు పడలం
గ్రక్కు రాహుమడలంబులుంబోలెఁ గుటిలసితనుమ్మలంబులు
వ్రేలం గాఢాంధకారంబునం గాలుకొను మునుద్రమంబు
లును గనుంగొనుచుఁ బోషితరాజకీరంబులు కైవారంబులు
సేయఁ బ్రోదికోయిలలు మంగళగానం బొనప్పఁ గొలంకుల
కెలంకులను బావులక్రేవలను నికుంజక్రోడంబులనీడలను
విశ్రమించుచుఁ బ్రసవమృదుగంధపశ్యతోహరంబులగు
గంధవాహంబుల రాకలు విహారశ్రాంతి నపనయింప నికట
ఘటీయంత్రసలిలధారాసారణీమార్గంబులఁ దొక్కంబునకుం
జక్కనిగండుమీను వెదకుమీనకేతుండునుంబోలె నుద్యా
నం బెల్లఁ గ్రుమ్మరి యగ్రభాగంబున. 97

సీ. శేషపుచ్ఛచ్ఛాయఁ జెలువారుబిసములు,
తన్మగ్నసురదంతిదంతములుఁగ

నిండారవిరిసినపుండరీకశ్రేణి
యామినీరమణరేఖాళి గాఁగఁ
బ్రతిబింబితోపాంతబహుళపాదపములు
గర్భస్థశైలసంఘములు గాఁగ
నేకదేశంబున నిందీవరంబులు
కాలకూటమయూఖఖండములుగ
తే. బాలశైవాలవల్లరీజాలకంబు
బాడబానలభవధూమపంక్తి గాఁగ
వారిరాశిగనుఁబోలె గంభీర మైన
ఘనతటాకంబుఁ గాంచె నజ్జనవిభుండు. 98

వ. కాంచి యొక్కింతతడవు మనంబునం గొనియాడుచుం దిమి
తిమింగిలఘులీకులీర మత్స్యకచ్ఛపమకరనికరసంచారతరళ
తరంగమాలికాడోలాధిరోహ లీలావ్యాలోలకలహంససంస
చాలాసకోలాహలముఖరితదిశాభాగం బైన యమ్మహాతటా
కంబుతీరప్రదేశంబున. 99

సీ. విలుళితజంబాలపులినభాగమున ను
ద్దండపద్మాతపత్త్రంబునీడఁ
గమలకాండకఠోరకంటకాంకురపంక్తి
నొయ్యనఁ గంధరంబొరసికొనుచు
నొంటికాలనె నిల్చి యూర్మిమారుతములం
జగురుటెక్కలతేకు లెగయుచుండ
మిసిమిఁ బొసఁగు పక్షతిప్రాంతయుంబు పెడజాఱఁ
జంచు లోకించు కామంచితముగ

తే. వరుణరాజున కిడినచామరమువోలెఁ
బొడవు మిగిలినపాండదమ్మిపువ్వుఁబోలె
నిబిడనిద్రాభిముద్రితనేత్ర మైన
రాజహంసంబుఁ గాంచె నారాజసుతుఁడు. 100

*క. కాంచనపక్షం బగురా
యంచం గనుఁగొని నృపాలుఁ డనురాగముతో
వంచించి పట్టుకొనియెద
నంచుఁ దలఁచె దైవఘటన కనుకూలముగాన్. 101

**నలుఁడు హంసముం బట్టుకొనుట**

తే. వామనుం డైనకైటభవైరివిధము
నభినయించుక్రమంబున నధిపసుతుఁడు
నడఁకి నడఁకి యల్లల్లన నడిచి పట్టెఁ
బాణిపద్మద్వయంబునఁ బసిఁడియంచ. 102

వ. ఇట్లు నిషధరాజుచేతం బట్టువడి బిట్టు మేల్కాంచి యక్కాంచనహంసంబు కంచుగీసినతెఱంగున నెలుంగించుచు నెగయ నుంకించుచుఁ జంచుపుటంబునం బాణిపల్లవంబులు గఱచుచుఁ జరణంబులు గింజుకొనుచు నఖంబుల నొత్తుచు నలుదిక్కులుం జూచుచు నెద్దియుం జేయునది లేక చీకాకుపడుచుండ నప్పాటన సంభ్రమసముత్పతత్పతగకులంబై కమలషండంబు గలగుండువడియెఁ గూలంబులం గులాయంబుల నుండి పుండరీకవనలక్ష్మీచరణనూపుర క్రేంకారంబుల ననుకరించుచుఁ గారండవబకక్రౌంచరథాంగకోయష్టికాదులు విహాయసంబున కెగసి కూయం దొడంగె నప్పుడు. 103

తే. జాతరూపచ్ఛవచ్ఛటాజాతరూప
లక్ష్మి యిం తొప్పునే మరాళమున కనుచు
నద్భుతం బొంది తనుఁ జూచునధిపసుతున
కిట్లనె మనుజభాషల హేమఖగము. 104

క. ఇక్కాలకొనలం గలిగిన
యిక్కాంచన మాసపడియె దే నృప! నీకే
యక్కఱ దీనం దీరెడు
నక్కట! నీహార లేశ మబ్ధికిబోలెన్? 105

చ. ఎఱుఁగనె నీవు ప్రాంతమున నింతట నంతట నున్కియింత యే
మఱుదునె నిన్ను విశ్వజనమాన్యుఁడ వంచును విశ్వసించియి
త్తఱి సుఖనిద్రఁ బొందితి వృథామతి నెట్టన యాత్మనమ్మినం
జెఱుపఁ దలంతురే ఘనులు చిత్తమునన్ బగవారినేనియున్?

ఉ. హింసయ నీకు వేడ్క యగునేని కృపాశ్రయ మైనయీ
సరో,హంసముఁ జంప నేల ? కఱవా తరువాత వసుంధరాధి
పో, త్తంస! విజృంభమాణ భుజదర్ప నిరంకుశసాహసక్రియా
మాంసలచిత్తవృత్తు లయి మత్తిలి యుండునరాతిభూపతుల్.

వ. ఫలకుసుమమూలమాత్రంబున శరీరయాత్ర నడపుచు మును
లుంబోలె సలిలంబులలోనం దపంబు సేయుచున్న వారము
మామీఁద దండనీతిం బ్రయోగింప నీకుం దగునె? యది
యునుం గాక. 108

సీ. తల్లి మ దేకపుత్త్రిక పెద్ద కన్నులు
గానఁ దిప్పుడు మూఁడుకాళ్లముసలి
యిల్లాలు గడు సాధ్వి యేమియు నెఱుఁగదు
పనమపాతివ్రత్యభవ్యచరిత

వెనుకముందర లేరు నెన రైనచుట్టాలు
లేవడి యెంతేని జీవనంబు
గానక కన్నసంతానంబు శిశువులు
జీవనస్థితి కేన తావలంబు
తే. కృపఁ దలంపఁ గదయ్య యోనృపవరేణ్య!
యభయ మీవయ్య! యోతుహినాంశువంశ!
కావఁగదవయ్య! యర్థార్థికల్పశాఖి!
నిగ్రహింపకుమయ్య! యోనిషధరాజ. 109

వ. అక్కటకటా! దైవంబ! నీకంటికిం జేలగింజయుం బెద్ద యయ్యెనే? జననీ! ముదిసి ముప్పుకాలంబున సుతశోకసాగరం బెబ్భంగి నీఁదఁగలదానవు? ప్రాణేశ్వరీ! యేమిచందంబున మద్విరహవేదనాదవానలంబునం దరికొనియెదవు? సఖు లార! యేప్రకారంబునం బుటపాకప్రతీకాశం బైనకరుణ రసంబునఁ బుటపుటం బొక్కెదరు? బిడ్డలార! యేలాగున నతి క్షుత్పిపాసాకులంబు లై కులాయకూలంబులం గులగులం గూసెద? రని విలాపంబు సేయుచు దృగ్గోళకంబుల వేఁడి కన్నీరు వెడల గోలుగోలున నేడ్చినం గృపాళుండై యాభూ పాలుండు హస్తపల్లవంబులు వదలి రాజహంసంబ! పొమ్ము సుఖం బుండు మని విడిచి పుచ్చె ననంతరంబ. 110

—ఆశ్వాసాంతము—

శా. భారద్వాజపవిత్రగోత్ర! విమలాపస్తంబసత్సూత్ర! వి
ద్యారాజార్ధకిరీట! రాజహితకార్యారంభనిర్వాకణా
ధౌరంధర్యకళాయుగంధర! సమిద్గాండీవి! శ్రీఖండక
ర్పూరక్షోదవిపాండునిర్మలయశఃపూర్ణక్షమామండలా! 111

క. కేళాదిరాయ! యభినవ
లీలామకరాంక! చంద్రలేఖాంకుర చూ
డాలంకారపదాంబురు
హాలింగనసుఖితనిర్మలాంతఃకరణా! 112

మాలిని.—

జరఠకమఠరాజస్తబ్ధరోమప్రధాన
ద్విరసనపతిభూభృద్దిగ్గజగ్రామభూమ
స్థిరతరధృతసంపద్గేహబాహాగ్రపీఠీ
పరిచయసుఖలక్ష్మీపక్ష్మలక్షోణిచక్రా! 113

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్య పుత్త్ర సకలవిద్యాసనాథ శ్రీనాథప్రణీతం బైన శృంగార నైషధకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు

# శృంగారనైషధము

## ద్వితీయాశ్వాసము



రాజరాజవేమ
క్ష్మారమణకృపాకటాక్షసంవర్ధితల
క్ష్మీరక్షితబుధలోక! యు
దారగుణాధార! సింగనామాత్యమణీ. 1

వ. అవధరింపుము. 2

### హంస నలునిచే విడువఁబడి కృతజ్ఞతఁ జూపుట

తే. అట్లు పురుషోత్తముం డైనయతనివలన
ముక్తి గాంచినయాద్విజముఖ్యుఁ డెలమి
డెందమునకును వాక్కున కందరాని
యధికతర మైనయానంద మనుభవించె. 3

క. చుట్టంబులుఁ జెలులుం దన
చుట్టుఁ దిరిగి యుండ ముదము సొం పెసలారన్
నెట్టిపడి చచ్చి క్రమ్మఱఁ
బుట్టినచందమున హంసము దటాకములోన్. 4

సీ. తిక్కించికొనియున్న తెక్కమొత్తముతోడి
యొడలు జాడించి నెవ్వాడి విదిర్చుఁ
జేదోయియొత్తుగఁ జేసి నెత్తుగు లైన
యవయవంబులు నోర సవర చేయుఁ
గుటిల చంచూపుటకోటికుట్టనములఁ
దనుకీటములనిరోధంబు మాన్చుఁ
దోడరుజుంజురు మేనిదుర్వికారంబునఁ
బులుఁగుఁజుట్టాల బిట్టులియఁజేయు

తే. మూర్తిపంక్తుల నుయ్యాల లూఁగి యాడుఁ
దివుటఁ దియ్యనితమ్మిపూఁదేనె గ్రోలుఁ
బ్రమదమున నాఁచుఁదీగెజొంపములఁదూఱు
నరుగుఁ గేళికులాయశుద్ధాంతములకు. 5

వ. ఇవ్విధంబునం గొంతవడవు గ్రీడించి యానీడోద్భవంబు భవార్చనాయోగ్యంబును రుద్రాక్షమధువ్రతపరివృతంబును బహుశైవలక్ష్మితాసమన్వితంబును నగుటఁ బద్మంబునుంబోని నిషధరాజుహస్తంబునకుఁ గ్రమ్మఱ నరుగుదెంచె నమ్మహీభుజుండును భుజంబు సాఁచి యమ్మానసౌకంబు మన్నించి యిమిడ్చికొనియుండె నప్పుడు. 6

తే. ఇష్టమానస మయినయాహేమఖగము
నలునిమానస మానందజలధియందుఁ
గర్ణశష్కులికలశంబుఁ గౌఁగిలించి
యీఁదఁ జేయుచు మృదుభాష నిట్లు లనియె. 7

వ. దేవా! యవధరింపుము ధర్మశాస్త్రమర్మపారగులైన పెద్దలు 'దుర్బలకులజిఘాంసువులైన పక్షులను నీడప్రమపీడా

కరంబులైననీడజంబులను ననవద్యల్పహాసాప్రశంసంబు
లగుమృగంబులను మృగయావినోదంబుల నధియించి
మహీధవుండు కిల్బిషంబునఁ బొందం డని శాస్త్రవిదులు చెప్పుదురు నం
బట్టువడిననన్ను విడిచిపెట్టి ప్రాణంబు రక్షించినయుపకారికిం
బ్రియంబు సేయుదు నన నేర్తునే? నైనను నీకు నొక్క
ప్రియంబు చేసెద నయాచితోపపన్నం బయినహితంబు పరిహ
రింపం బనిలేదు నిఖిలభువననాయకుండవైనను నీకు నేము
బోంట్లు సేయునుపకారం బపేక్షణీయంబు గాకుండుట
యెఱుంగుదు నైనను గృతజ్ఞతాగుణావేశంబు ప్రేరేపించు
చున్నయది నన్నంబు దొడ్డయనువిశేషంబు సుచాలంకార
హస్తకల్పజనాంతరం బయినదైనంబు ప్రశస్తి విమర్శించి
నాచేయు ప్రయోజనం బంగీకరింపుము. 8

**హంస నలునికడ దమయంతి నభివర్ణించుట**

సీ. ప్రత్యర్థిసార్థసార్థకనామధేయుండు
భూమీశ్వరుం డొప్పు భీముఁ డనఁగ
నారాజు త్రిదివంబు సమరేంద్రుఁడునుబోలెఁ
దేజంబున విదర్భదేశ మేలు
దమనాహ్వయుం డైనతపసిసద్వరమునఁ
గాంచె నాతఁడు కన్యకాలలామ
సర్వలోకాంగనాసౌభాగ్యగరిమంబు
దమియించుకతమున దానినామ
తే. మభ్రభారతి దమయంతి యంచు నొడివెఁ
దద్గుణంబులు వర్ణింప ధరణినాథ!

యబ్జసూతికి నైన శక్యంబు గాదు
పలుకుఁబూఁబోఁడి కైనను నలవి గాదు.

తే. విదుషి యాయింతిదలఁదాల్చు వెండ్రుకలకు
నహహా! యెబ్భంగిసాటిసేయంగవచ్చుఁ
బశువుచేతఁ బురస్కృతిఁ బడయలేక
చాపలంబున వర్తించుచామరములు? 10

క. ఖురకండూయనమిషమున
హరిణంబులు సాంత్వనంబు నాపాదించున్
దరుణివిలోచనములచేఁ
బరిభూతము లైనతమచపలదృష్టులకున్. 11

క. లలనకనుదోయిముంగిటఁ
నలనడ నలినంబు మలిన మయ్యెను హరిణం
బులు పూరి మేయఁ దొణఁగెను
గలితద్యుతి ఖంజ మయ్యె ఖంజనకులమున్. 12

తే. రాజబింబంబునందు సారము హరించి
చేయఁ బోలు విధాత యాచెలువమోము
నడిమిరంధ్రంబునందుఁ గానంగ వచ్చు
ఖనిఖనీలిమ యది నివర్ణనము గాదె! 13

క. ప్రవిలేపనపాండరమును
నవలాంఛనగోమయాంచనము పగురాకా
ధవళాంశుమండలము విధి
నివాళిసేయును లతాంగినెమ్మొగమునకున్. 14

సీ. *జగము లాక్రాంతి సాధింప నెత్తిన
[illegible] రమణిబొమలు

కాంతినిర్ఝర మీఁదుకాపులయావనముల
కుంభస్థనము లింతికుచయుగంబు
నడు మింత యని కేలఁ దొడిపట్టినధాత
యంగుళిరేఖ లబ్జాస్యవళులు
యువమనోమృగరాజిఁ దవిలింపఁ దీర్చిన
మదనవాగుర లిందుముఖకుచులు

తే. బాల్యతారుణ్యసీమావిభాగమునకు
నజుఁడు వ్రాసినరేఖ తన్వంగియారు
భానువరమునఁ బడసినపంకజముల
యపరజన్మంబు పూఁబోణియడుగు లధిప! 15

క. జలదుర్గస్థమృణాళా
వలిజిత్కమనీయబాహువల్లరి యగునా
జలజానన నీకుం దగుఁ
బలుకులు వేయేల యధికబలశౌర్యనిధీ! 16

క. హాటకకలశంబులకును
బాటి యగువధూటిమెఱుఁగుఁ బాలిండ్లు నిరా
ఘాటస్ఫురణప్రభ యను
నేటికిఁ జక్కవలకవ యయి విరాజిల్లెన్. 17

తే. వలుదయును వట్రువయుఁ గాఁగ నలినభవుఁడు
భీమభూపాలపుత్త్రికిఁ బిఱుఁదు దోసర్చె
నర్కరథశిల్పశిక్షఁ బుష్పాస్త్రుతేరు
నేకచక్రంబు సేయ నూహించి యొక్కొ. 18

మ. వనజాతేక్షణయూరుయుగ్మమునలావణ్యంబునం గేళికా
ననసంక్రందనపట్టనప్రకటజన్మస్థానలక్ష్మి రంభలక్ష్మ

ఘననానాత్యర్థతపఃఫలస్తనుల నత్యంతాభిరామాంగులన్
మనుజాధీశ! యథనికరించుచుఁ బొగడన్ మాబోంట్లకున్
శక్యమే? 19

మ. పృథుకీలిం బ్రతివాసరంబు గమికర్మీభూతనానానదీ
నదకాంతారపురీశిలోచ్చయుఁడనై నైకాద్భుతశ్రీజిత
త్రిదివం బైనవిశిష్టదేశమున నారీరత్నముం గాంచితిన్
సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్. 20

మ. కమలేందీవరపుండమండితలసత్కాసారసేవారతిన్
గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తని నస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్. 21

వ. కాంచి నిరుపమరూపసౌందర్యరామణీయకం బీరమణీరత్నంబు
మునుపు నిస్సారంబుగ బొక్కనియును విధాతచిత్తంబున
నీసర్గకౌశలికిం దగిన యుత్తముండగుపురుషుం డెవ్వండు గలిగె
నో యున్నవాఁడో కో యని యనుచింతించుచుం గొంతవడవు
నిర్వ్యాజకౌతుకమానసుండనై యనంతరంబ యనుగుణరూపలావణ్య
రేఖాసంపన్నుం డైనవాని యనుసంధానము నవలోకింతు
నని లోకాలోకపర్యంతంబుగా నీలోకంబు విశ్వంబునుం
బరిభ్రమించి యుర్వీశ్వరకుమారుల నెల్లం బూర్వపక్షంబు
గావించుచు వచ్చి వచ్చి యిచ్చోట నిన్నుం గనుంగొని
సిద్ధాంతీకరించితి సాదృశ్యనిబంధనంబై పొడమినసంస్కార
బోధంబు: జిరకాలానవలోకిత యగునబ్బాల యిప్పుడు
నామనంబునం బొడగానవచ్చుచున్నయది. 22

క. దమయంతీతిలకించిత
మమృతాంశుకులావతంస యలరించు [illegible]
విమలతరతారహారము
రమణీరమణీయకుచభరంబును బోలెన్. 23

తే. సౌరభము లేనియట్టిపుష్పంబువోలె
గండుగోయిల వెలి యైనకానవోలె
నధిప! దమయంతితోడిసఖ్యంబు లేని
నీదుసౌందర్యవిభవంబు నిష్ఫలంబు. 24

వ. కావున నిఖిలవైమానికనికాయకామ్యమాన [illegible]
వతికి నిన్నుం గూర్ప నాకు నేర్పు గల [illegible]
బున నిన్నుం దక్కం దక్కొరుం బరిగ్రహింపకుండ [illegible]
భవద్గుణంబులు ప్రశంసించెద నన్నుం బనిగొమ్ము, [illegible]
కార్యంబున నార్యులు నిజప్రయోజనంబు [illegible]
గాని మాటలం బ్రకటింప రని పరిస్ఫుటంబుగాం [illegible] 25

తే. ఆద్విజాధిపువలన సంప్రాప్త మైన
వాక్సుధాధారం గ్రోలి భూవల్లభుండు
లలితలీలం దదుద్గారలవమువోలె
మొలకనవ్వు వహించెం గెమ్మోవిమీంద. 26

వ. ఇవ్విధంబున మందస్మితసుందరవదనారవిందుం డై [illegible]
విందంబునం బతంగపుంగవునంగంబు నివురుచు మృదుభాష
ణంబుల ని ట్లనియె. 27

సీ. అండజాధీశ నీయాకారరేఖతోం
దులం దూంగ లేవు వస్తువులు జగతి

బున విశ్రమించి రాయంచపలుకులు మనంబునం దలపోయు
చుండెఁ గలహంసంబును నలుని వీడ్కొని భూమండలమండ
నాయితంబైన కుండిననగరంబున కభిముఖంబై ప్రార్థనాసిద్ధి
సూచకంబులగు ననుకూలగంధవాహాదినానావిధశుభనిమిత్తం
బుల ననుసంధించుచు నికషపాషాణపట్టనిభం బయిన నభస్స్థలం
బునం దనపసిండిఱెక్క లొరపెట్టుచుం బింబున సంసంబుగా
ఝూంకారితపత్త్రధారావిహారంబుగ గోడిపడి డిగ్గునప్పు
డలవిగుననున్న పతంగంబులు సడపడ సడంకుచు నొంటి
కంటఁ గనుంగొన నొక్కొక్కమాఱు విధూతపక్షతియును
నొక్కొక్కసారి యూర్ధ్వాయనదుర్విభావంబును నొక్కొ
క్కమాటు వితతీకృతనిశ్చలచ్ఛదగుచ్ఛంబును నగుచు వనం
బులు గడచి శైలంబులు దాఁటి నదులు లంఘించి చని చని
ముందట. 35

కుండిననగరవర్ణనము

ఉ. అండజరాజు గాంచె లవణాంబుధివేష్టితమేదినీవధూ
కుండలమండనం బయినకుండినముం నిజకీర్తికల్పితా
ఖండలపట్టణప్రథితఖండనముం గ్రథకైశికేంద్రదో
ర్దండబలాభిగుప్తము సుదగ్రహిరణ్మయవప్రదీప్తమున్. 36

వ. అప్పట్టణంబున కరిగి నవ్రదీప్రాకారంబు లగు ప్రాకారంబుల
వలనను, నారసాతలగంభీర సలిలసంచారంబు లగుపరిఖా
కూపారంబులవలనను, బ్రస్ఫుటస్ఫటికకోకలవిగ్రహంబు లగు
గృహంబులవలనను, [illegible] సమగ్రోత్సేధంబు లగు
సౌధంబులవలనను, నింద్రనీలమణిచ్ఛాయా కల్పితాకాల
కాలీన [illegible]

లికుచఘుసృణపంకకషాయితాంభఃపూరంబు లగుకాసారం
బులవలనను, ఘనఘనాఘనఘటాకఠోరఘుర్ఘురధ్వానగోధూమ
ఘరట్టంబు లగుహట్టంబులవలనను, అనిలచలత్కేతనాంచల
దండతాడనా విహితహేళి హయాళీ ఖేలనక్రియావత్తా
మాచువిశ్రాంతు లగుప్రాసాదవైజయంతులవలనను, నవ
వికచవివిధకుసుమవాసనాపేటిక లగు లీలోద్యానవాటికల
వలనను, బటీరకర్పూరకస్తూరికాకుంకుమసంకుమదహిమాం
బుప్రముఖనిఖిలపరిమళవస్తువిస్తారసౌరభోద్గారసముత్కటం
బులగు నాపణంబులవలనను, హావభావవిలాసవిభ్రమైకభాజ
నంబు లగు వనితాజనంబులవలనను, జవవిజితమరుత్కురం
గంబు లగుతురంగంబులవలనను, అసమమదమగనిజమదాక
ణంబులగువారణంబులవలనను, నభిరామం బై నిష్కుల
హంసంబునకుఁ గౌతుకం బాపాదించె వెండియు. 37

తే. పరిఖ గుడివోలెఁ దనచుట్టు దిరిగి యుండఁ
బరుల కేరికి గ్రహణగోచరము గాక
విషధరాధీశభాషితవిషమభాష్య
ఫక్కికయుఁ బోలె నొప్పె నప్పట్టణంబు. 38

క. నెలపొడుపుల సురనదిని
ర్మలతరతదగారకుట్టిమస్రవదిందూ
పలతుందిలాప యగుచుం
దెలివొందుఁ బతివ్రతౌచితీసంపత్తిన్. 39

తే. క్రుంగఁబొలుసహస్రాంశుఁ గూడ లేక
వెనుకఁ జిక్కినజరదంశువితతివోలెఁ

బోలుచునపరాహ్ణవేళ నప్పురమునందు
భాసురాలేపకాశ్మీరపణ్యవీథి. 40

శా. వేదాఖ్యాపవిశేషపూతరసనావిర్భూతభూరిస్తవా
పాదబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేళిచే
వాదిక్ గాధితనూజుచే పగము సేయం బడ్డమిన్నేఱు ప్రా
పాదస్వచ్ఛదుకూలకైతవమునం జాలంగ నొప్పుం బురిన్. 41

తే. అమరు హాటకమయకవాటములతోడ
గురుతరం బైనయప్పోటికోటగవను
కులిశధారకుఁ దప్పి తెక్కలును దాను
బయటఁ గొలు వున్నపసిడికొండయునుబోలె. 42

మహాస్రగ్ధర—
దమయంతీకేళిధాత్రీధరశిఖరహరిద్రత్నభాదర్భసందో
హ మజాండాఘాతభగ్నస్యదభవమదతావాప్తలజ్జావసన్న
త్వముమై నుత్తానగాహస్త్యసురభివదనాంతఃస్థమై లీల నత్యూ
ర్థము గోగ్రాసప్రదానవ్రతసుకృతము తోరంబుగా వీటి
కిచ్చున్. 43

వ. ఇట్టి విచిత్రశోభావైభవంబులకుం బట్టైన యప్పట్టణంబు
గలయం గనుంగొని పతంగపుంగవుండు కన్యాంతఃపుర
ప్రదేశంబున నొక్కకృత్రింగాపవనంబులోన సఖీమధ్యంబునం
దావకామధ్యంబున శీతాంశురేఖయుంబోలె నున్నయా
రాజపుత్త్రినివీక్షించియభ్రమండలంబుననుండి విభ్రమభ్రమణ
రయవికీర్ణస్వర్ణమయిపక్షపాళిచ్ఛాయాపటలంబు దిక్కులం
జిక్కటిల్ల మెఱుంగు మెఱసినచందంబునం గొఱవి ద్రిప్పిన

మధురాక్షరము లైనమామాటలు వినంగ
నమృతాంధసులు యోగ్యు లనుపమాంగి!

తే. భారతీదేవిముంజేతిపలుకుఁజిలుక
సమదగజయాన! సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్రపురాణాదివిద్య లెల్లఁ
దరుణి! నీయాన ఘంటాపథంబు మాకు. 49

వ. ఒక్కనాఁడు విధాత వినోదార్థంబు వాహ్యాళికిఁ జని మరలి వచ్చునప్పుడు మాకులస్వాము లైనయతనిరథరథ్యంబులు శ్రమంబునన్ డీలుపడి యున్నం జూచి యేను నిమాన దండంబు కంఠంబున ధరియించి విరించిచేతం బారితోషికంబు వడసితి. నేను దివ్యతిర్యగ్జాతిని. మముబోఁట్లు పాశాదికంబులం గట్టువడుదురె గుణపాశంబులం గాక? భూలోకంబున రాజబృందారకులు కొందఱు గలరు, వారితోఁ జెలికారంబు వాటించి యుండుదుఁ, విశేషించి నిషధదేశాధీశ్వరుం డగునలుం డనురాజుమీఁద మిగులం బక్షపాతంబు గలిగి యుందు. 50

తే. కనకశైలంబు డిగ్గి యాకాశసింధు
సలిలములఁ దోఁగి మిగులంగఁ జల్లనైన
చారుహాటకమయగరుచ్చామరముల
వీతు నతనికి వైశాఖవేళలందు. 51

మ. రణకండూభరదుస్సహం బయినయా రాజన్యదేవేంద్ర ద
క్షిణబాహాగ్రమునన్ జనించినమహాకీర్తిప్రవాహంబు గా
రణసంక్రాంతగుణానుషంగమున నో ప్రస్ఫీతదిఙ్మత్తవా
రణగండస్థలకుంభకూలములతో రాయుం దివారాత్రముల్?

తే. ఆతనిబాహాపరాక్రమం బభినుతింప
నలవియే పద్మజునకైన నబ్జవదన?
శాతతద్బాణధారాభుజంగభుక్తి
వైరిరాజప్రజీయాసుమారుతంబు. 53.

చ. వినుకలిఁ గూర్మిఁ జిక్కి పృథివీభువనంబునకుం డిగంగ నే
యనువును లేక రంభ యనునచ్చరలేమ నలుఁగ వరింపఁ బూ
నినతనకోర్కి నొక్కమెయి నిండఁగఁ జేయుటకై భజించెఁ
దాఁ, గొనకొని వేల్పులందు నలకూబరుఁ దచ్ఛుభనామవాస
నన్. 54.

వ. ఆరాజుకడం జనవు గలిగి వర్తింతు మఱియును. 55

మ. స్మరవాత్స్యాయనకూచిమారకృతశాస్త్రగ్రంథసందర్భముల్
పరిశీలించినవాఁడ దంపతుల కుత్పాదింతు సారస్యముల్
మురిపెం బొప్పఁగ మందమందగమనంబుల్ నేర్పుదు న్మేదినీ
శ్వరశుద్ధాంతనితంబినీజనులకుఁ సంపూర్ణచంద్రాననా! 56

వ. భామినీజనంబులకు భావభవనవ్యాజ్ఞావిశ్వాసముద్రానిక్షేప
భూమినై యుండుదు నన్నుఁ దివ్యజ్ఞాతిమాత్రంబుగాఁ
దలంపవలదు, విరించివదనకమలవినిర్గతవివిధశాస్త్రవాసనా
పూర్ణకర్ణుండ నైనయేను సామాన్యుండనే! నన్నుం బని
గొమ్ము, ఈశరీరంబు పరోపకారార్థము గదా! పద్మాసుని
శిల్పప్రయాసంబు లక్ష్మీనారాయణులయెడలను గౌరీవృష
భాంకులపట్టునసుంబోలె మీయెడల బరస్పరయోగ్యసమా
గమంబునకుఁ బొల్పడుంగాక! వేలాతిక్రాంతకాంతగుణాబ్ధి
వేణీభగునీవు నలునిపాణిగ్రహణంబు పరిగ్రహింప నర్హురాలవు,
కోమలంబగు మల్లికాముకుళదామంబు గర్కశం బగుకుశ

సూత్రంబునం గట్టఁ బాత్రంబుగాని తెలుంగుమ నిషధరాజు
దక్క వేఱొక్కండు నిన్ను వరియింపం బాత్రుండు గాఁడు.
మఱియు నొక్కవిశేషంబు. 57

చ. అడిగితి నొక్కనాఁడు కమలాసనుతేరికిఁ [illegible] సడు
చుచు 'సుర్విలో నిషధనాథుని కెవ్వతె యొక్కొ భార్య
య, య్యెడు?' నని చక్రఘోషమున [illegible] గాని
యంత యెఱ్ఱ్పడ †వినఁ గాని నీ వసువుఁ బట్కు [illegible]ము
దోఁచె మానినీ! 58

ఉ. నిర్ణయ మాన్నృపాలునకు నీకును సంగతి గుప్పి నేఁ [illegible]లోఁ
దూర్ణము సేయఁగాఁ గలఁడు తోయజసూత్రి, తపస్య్వథా
వృథా, దుర్ణయవృత్తికిఁ మనసు దూర్చిన నేసి [illegible]నాపహా
దార్ణవ ముత్తరించుటకు నాతని కెయ్యది చెప్పు [illegible]మా?

వ. అనిన విని ముహూర్తమాత్రంబు చింతించి యాయింతి
శకుంతవల్లభున కిట్లనియె. 60

తే. బాల్యమునఁ జేసి యేను జాపలముఁ బూని
నిన్ను నాయాసపెట్టితి నిగ్రహమునఁ
దప్పుఁ జేసితి లోఁగొమ్ము దయ దలిర్ప
బ్రహ్మవాహనకులముఖ్య! పక్షిరాజ! 61

సీ. దర్శనీయంబు నీతనువిలాసం బెప్డు
నీమనం బత్యంతనిర్మలంబు
మధురాక్షరములు నీమహితభాషణములు
కీర్తనీయంబు నీవర్తనంబు

† విశబ్రైతి.

ప్రౌఢి యుక్తంబు నీప్రతిభావిశేషంబు
కమనీయతరము నీకల్కితనము
శ్లాఘనీయంబు నీసౌహార్దగరిమంబు
ప్రార్థనీయంబు నీప్రాభవంబు

ఆ. మత్స్యమూర్తి నైనమధుకైటభారాతి
భాతి నీవు భువనపావనుఁడవు
నిండు నెలయుఁ బోలె నేత్రోత్సవంబ వై
యున్న వాఁడ విట్టియొప్పు గలదె? 62

వ. నామనోరథంబు కంఠపథంబున వర్తించుచున్న యది, ప్రబల
లజ్జాభియోగంబును దుర్లభజనానురాగంబును సమస్తార్థా
స్థ్యంబు నధిష్ఠించి యున్న యవి, యందనిమ్రాఁకులపండ్లు
గోయం దలంచెద, రాజుఁ బాణిగ్రహణంబున వశీకరింపం
గోరెద, బాల్యచాపలంబున జేలనై యున్నదాన నని సాభి
ప్రాయంబుగాఁ బలికె నప్పుడు. 63

తే. రమణి మందాక్షమందహాసంబు గాఁగఁ
బరిమితోక్తుల నిబ్భంగిఁ బలుకుటయును
సంశయంబుఁ బ్రహాసవతంసితంబు
హృదయమున నొయ్యఁ బాటించి యిట్టు లనియె. 64

వ. ఓరాజవదన! రాజపాణిగ్రహణంబు దృష్టాంతీకరించి పలికిన
నీసుభాషితంబులకు నర్థం బెయ్యది? యంతిమవర్ణంబునకు
వేదవర్ణంబునుంబోలె సమ్యగర్థంబు నావీనులు ప్రవేశింప
నర్హంబు గాదె? తిర్యగ్జాత నైయుండియు మాయేలిక
నాళీకభవునియాన, యేను జన్మించినయది యాదిగా నెన్నం
డును మృషాభాషణంబులు పలుక, సత్యంబు పలుకుదుం,

బలికిన ప్రయోజనంబు సాధింతు, లోకాలోకపర్యంతం బైన ధాత్రీమండలంబునందు నీ వెయ్యది యపేక్షించితి వప్పదార్థంబు గొని వచ్చి నీకు సమర్పింపం జాలుదుఁ, గంధర్వాకారు లైన రాకుమారు లెల్లరు నాకు వశవర్తు లై యుండుదురు, విశేషించి యన్నిషధభూవల్లభుండు నన్నుం బ్రాణంబుగా మన్నించి యుండు. 65

సీ. అతఁడు పాణిగ్రహణార్థుండు విను నీకు
నతనిఁ గూర్పఁగ నేర్తు నతివ! యేను
పిన్న పాఁపవు నీవు పితృపరాధీనవు
కార్యనిర్ణయశక్తి గలదె నీకు?
వావల నిషధరా జఖిలలోకేశ్వరుం
డీవలఁ బరమేష్ఠిహితుఁడ నేను
సందేహడోలాధిశాయి యైన ప్రసంగ
మిప్పట్టునందు నే నెట్లొనర్తు?

*తే. మొదల సంఘటియించినఁ బొందు కార్య
మవల విఘటించె నేని గౌరవము దప్పి
ప్రాణమై నన్ను రమ్ము పొమ్మను నృపాలు
వెదురఁ దల వంచికొనియుండ నెట్లు నేర్తు? 66

ఉ. ఇప్పటినీతలంపు తెలియం గిట్టిద యా నిటమీఁద నెవ్వరే
చొప్పున నుండునో నిజము సుద్ది యెఱుంగము గాని

---

* తే. 'మొదల సంఘటియించినపొందు విదప, కార్య, మఘటించె నేనియుం ఘనతదప్పి' అనియుం, 'మొదల సంఘటించినఁ బొందు విదపమన్న, కార్య మఘటించె నేనియుం ఘనతదప్పి' అనియుం బాఠాంతరములు.

యుగ్మలీ!, చెప్పెడి దేమి! కాలికలచిత్తము లంబుతరంగ
లోలముల్, తప్పునా కాఁకుకో కుసుమధన్వునియేటులు
దై వికంబుగన్! 67

వ. కంకాకళంకితం బయినయవ్విషయంబునందుఁ బ్రామాణి
కుండ నై యేను వర్తింప నంగీకరింపం గాని వేఱొక్క
కార్యంబునకు నన్ను నియోగింపుము, దుర్ఘటం బయిన నది
సంఘటించెద, నని పలికిన నాపతత్త్రిపుంగవునకు ధాత్రీపురు
హూతపుత్త్రి యిట్లనియె. 68

— దమయంతి నలునిఁ దక్క నన్యుని వరియింప ననుట —

తే. నిషధభూపాలు నొల్లక నృపతి నొరుని
నభిలషించితి నేని హంసాగ్రగణ్య!
యామవతి చంద్రు నొల్లక యన్యు నొకని
నభిలషింపంగ నోంకార మాచరించు. 69

తే. అబ్జినీమానసానురాగాభివృద్ధి
యర్కసంపర్కమునఁ దక్క నగునె యొంట!
నలుని దక్కంగ నొరుని నేఁ దలఁతు నెట్లు!
విడువు సందేహమోహంబు విహగరాజ! 70

* తే. అనలసంబంధవాంఛ నా కగున యేని
ననలసంబంధవాంఛ నా కగును గావె!
చాలు సందేహవక్త్రభాషణము లింకఁ
దనళ! చక్రాంగ! పాథసపతంగశక్ర! 71

ఉ. దివ్యఖగేంద్ర! నప్పవు మది న్నను నీయెడ నాకు విప్రలం
భవ్యవహారము న్నిలుపఁబట్టఁగ నేమి ఫలం? బళక్యతం

కవ్యభిచార హేతు వనఁ గల్గినమాటయ వేదవాక్యముల్
భవ్యవిచార! కావనిన భావన సేయుము యెవ్వి వేదముల్?
తే. తండ్రి నిషధాధిపతి కీక తక్కు యొరున
కీఁ దలంచిన నే విహగేంద్ర! వినుము
దేహ మనలంబునకు నాహుతిగ నొసర్చి
యతనిఁ బొందంగఁగందు జన్మాంతరమున. 73
శా. తద్దాసీత్వపదంబు గైకొని కృతార్థత్వంబునం బొందుదుం
దద్దివ్యాంఘ్రిసరోజవందనవిధిం దాత్పర్యముం జెందుదుం
దద్దాక్షిణ్య మపేక్ష సేయుదు మదిం దత్సేవకుం జొత్తు నే
దద్దోరంతరపీఠిఁ జేరుతుఁ గుచద్వంద్వంబు నీసత్కృపన్. 74
తే. అతనిఁ గోరుదు నే నంతరంగసీమ
నంత చింతామణికిఁ జింత యాచరింపఁ
పద్మముఖుఁ డైన యతఁడు నాపాలి కనఘ!
పెన్నిధానంబు మాటలు పెక్కు లేల? 75
తే. వింటిఁ దద్గుణనికరంబు వీను లలరఁ
గంటి నాతని మోహాసంక్రాంతి దిశలఁ
బోలఁ దలఁచితి నీరంధ్రబుద్ధిధారఁ
జాల వలచితి నతని కే సత్య మిదియ. 76
సీ. అతనిఁగూర్చి నాప్రాణంబు రక్షింపు
మింతయు నీచేతి దేమి చెప్ప?
నాశ్రితసంరక్షణాభ్యుత్థితం బైన
పరమపుణ్యంబు చేపట్టు మిపుడు
మిథ్యావిశంక యేమిటికిఁ? బాటింపుమీ
యుపలంబనంబు, సేయకు విలంబ

మనురాగజలధివేలాంతర్వినిర్మగ్నఁ
దెప్పవై ననుఁ జేర్పు తీరమునకు

తే. ధర్మపరులు వరాటికాదానమాత్ర
లాభమునకైన మెత్తు రుల్లములలోనఁ
బ్రాణనాథప్రదానతత్పరుఁడ వైన
నిన్ను నేమని మెత్తునో? నిర్మలాత్మ! 77

చ. మనమున లోకపాలు రెనమండ్రును మెచ్చఁ దృణీకరింతుఁ ద
క్కినసురకోటి, రాసుతులఁ గీడ్పడఁ జూచుటఁ జెప్ప నేటికిన్?
గొనకొని యాన్నృపాలునకుఁ గూర్చుటకై శపథంబు చేసెద
న్ననవిలుకానిపాదనలినంబులపై రతిచన్నుదోయిపై. 78

క. కార్యమి దకాలయాపన
స్థైర్యసహము గాదు చను ముదంచితగతి నో
యార్య! భవన్నయఘోరం
ధర్యము చూతము గదా! యుదాత్తస్ఫురణన్. 79

తే. అతఁడు శుద్ధాంతగతుఁ డైనయపుడు నీవు
నాప్రసంగంబుసేత విన్ననువు గాదు
భామినీముఖదాక్షిణ్యబలిమికలిమి
నితరకాంత నిషేధించు నెవ్వఁ డైన. 80

ఉ. నాగతి విన్నవించుట యనర్హము సుమ్ము నిజావరోధసం
భోగనితాంతతృప్తుఁ డగుభూపతికిన్ సలిలంబు దప్పి వోఁ
ద్రాగినవారి కిం పగునె తన్పును దియ్యఁదనంబు వాసనా
యోగముఁ గల్గెనేని విహగోత్తమ! నిర్మలవారిపూరముల్.

తే. అధికరోషకషాయితస్వాంతుఁ డైన
నరపతికి విన్నవింపకు నాయవస్థఁ
జైత్యదోషోదయంబునఁ బరుస నైన
జిహ్వికకుఁ బంచదారయుఁ జేఁదుగాదె! 82

ఆ. కదిసి నాతెఱంగు కార్యాంతరాసక్త
చిత్తుఁ డైనపతికిఁ జెప్పవలవ
దనవబోధనిద్ర యవమానముద్రకుఁ
బ్రథమకారణంబు పక్షిరాజ! 83

వ. కావున నవసరం బెఱింగి యాత్యంతికాసిద్ధి విలంబిసిద్ధుల యందు నీకు నెయ్యది శుభంబై తోఁచు నదియ చూచుకొ నునది యని యప్పైదలి మదనోన్మాదంబునం జేసి లజ్జాభరం బుజ్జగించి కులకన్యాజనంబులకు నుచితంబులు గాని యతి ప్రౌఢవచనంబులం బలికిన. 84

ఉ. ఆపరమేష్ఠివాహనకులాగ్రణి భీమతనూజ మన్మథా
జ్ఞాపరతంత్రతన్ నలవశంవదమానసఁ గా నెఱింగి చం
చూపుటమౌనముద్రఁ దఱిఁ జూచి వినిద్రవివేకశాలి యు
ద్వ్యాపన చేసెఁ గన్నుఁ గొనలందుఁ దొలంకఁగ మందహాస
ముల్. 85

సీ. విను మింతి! యీయర్థమును ఘటింపఁగఁ జేయఁ
బుష్పనారాచుండు పూఁటకాఁపు
సమరూపలావణ్యసౌందర్య మగుమిథు
నంబు గూర్పక పోఁడు నలినభవుఁడు
నినుఁ జేరి నిషధనాథునియింద్రియములకు
నిజదేవభూయంబు నివ్వటిల్లుఁ

గన్నులు చల్లఁగాఁ గనుఁగొందు నేను మి
మ్మిరువుర దేవి దేవరనుఁబోలె

తే. నీవు మారాజుపైఁ గూర్మి నిలుపు గలిగి
చిత్త మలర సేయకున్నట్లు చెప్పి తిపుడు
వినుము నీవును నతనినెమ్మనమునందుఁ
గలుగు నీమీఁదిప్రేమంబు నలినవదన! 86

తే. వెలఁది! సంకల్పసోపానవితతియందు
నతఁడు సూడంగ సంచరిం తహరహంబు
తరణిపుఁడు దీర్ఘనిశ్వాసభరము నించు
నద్భుతము గాదె మీచంద మరసిచూడ? 87

తే. హంసతూలికాతల్పంబునందు మేనుఁ
జేర్చినప్పుడు నేత్రరాజీవయుగముఁ
జేరి చుంబించి మోహింపఁ జేయ నతని
నతివ నిద్రయు నీవు నే మాదురొక్కొ? 88

వ. బాల! యాలేఖ్యమయభవన్మూర్తి సౌందర్యసందర్శనలాలసుం
డును నశ్రుధారాధౌతదీర్ఘలోచనుండును నిశ్వాసపరం
పరాసంపాతపరిమ్లానపాటలాధరుండునుఁ బ్రవాళశయ్యా
శరణకమ్రశరీరుండును మదనదావాజ్వరారంభకంపితస్వాం
తుండునునయి, విప్రలంభవేదనావికారంబున నకాండహాసం
బును నకారణభయంబును ననవసరసముత్థాన సంభ్రమంబును
నలక్ష్యప్రేక్షణంబును నప్రతివచనవాగారంభణంబునుం
గలిగి యార్తిధారాప్రవాహంబున మూర్ఛాంధకారపంకం
బున మునుంగు చున్నవాఁడు. భవత్ప్రాపకం బైనదోషంబు
నకు వెఱవఁడు. దాస్యంబున కైన లజ్జింపఁడు. 89

*చ. మదనుఁడు రెండుచేతులను మార్పడ నేయఁగఁ దూపు లైదునుం, బది యయి వేయువేలుఁ బరిపాటి నవస్థలు సంఘటింపఁగాఁ, దుదిదశ రాజునందు వెడ దోఁచుచు నున్నది యేను వచ్చుచో, నది చిగురాకుఁబోణి యట నంబరపుష్పవికాస మయ్యెడిన్. 90

వ. మదనశరవేదనాదూయమానమానసుం డైన యతండు పుత్తెర నీసమ్ముఖంబునకు వచ్చితి. నీచిత్తంబులోనిభావంబు నెఱింగితి. 91

*తే. తరుణి! వైదర్భి! నీ వెట్టి ధన్యవాక్య-
భావహావవిలాసవిభ్రమనిరూఢిఁ
గౌముదీలక్ష్మి యప్పాలకడలివోలె
నదురఁ జేసితి నిషధరాజంతవాని. 92

వ. చంద్రుఁడునుఁ జంద్రికయుఁబోలెఁ బువ్వునుం దావియుం బోలె రసంబును భావంబునుఁబోలె నవినాభావసంబంధంబున నతండు నీవును నన్యోన్యప్రేమానుబంధంబున ధన్యత్వంబు నొందుండు. వాణిద్వయంబుచేతం బల్లవితంబును మందస్మితంబుచేతం గోరకితంబును శరీరసౌకుమార్యంబుచేతం బుష్పితంబును గుచభరంబుచేత ఫలితంబును నైనభవన్మూర్తికల్పపాదపంబునకు నృపతినందనుండు నందనోద్యానం బయ్యెడుం గాక మఱియును. 93

తే. వుహితబంధాఢ్యరతికేళిమల్లయుద్ధ
సమయములయందు దివి మరుత్సముదయంబు
కుసుమవర్షంబు మీఁదఁ గురియుఁగాక
వనజదళనేత్రి! శృంగారవనములోన. 94

చ. నెలఁతుక! యానృపాలునకు నీకుఁ బరస్పరసంగమంబునం
గలయఁగ డాసి మానసయుగంబు వికాసము నొందుఁగాక
వూ, విలుతునిదేహయష్టిఁ బ్రభవింపఁగఁ జేయ సమర్థ
మైన నిర్మలపరమాణుయుగ్మకముమాడ్కి‌ని దైవమనోను
కూలతన్. 95

శా. గ్రీవాలంకృతిపట్టసూత్రలతికాశ్రీకారరేఖాంకితన్
దేవీ! యవ్రణవంశసంభవగుణాన్విత న్నిసుం గాయజుం
డావిర్ఖ్యాతరతిం ధనుర్లతికఁ గా నంగీకరించుం బలే!
వూవింట న్నిషధాధినాథు గెలువం బూనంగ రాకుండుటన్.

తే. తరుణి! నతనాభిమండలోదంచనాభి
రామరోమావలీజ్యావిరాజమాన
నీదుతను వుండవిలు సేసి నెఱకు లేయు
రతివరుఁడు హారగుళికల రాజహంసు. 97

హంస దమయంతి వీడ్కొని నలునకు దూత్యసిద్ధిం దెల్పుట

వ. అని పలికి వీరె సఖులు వచ్చుచున్నవారు, మంత్రరహస్యం
బులు బయలుపడ కుండవలయు, నన్ను వీడుకొల్పు, పోయి
వచ్చెద నని తదనుమతి వడసి గగనమార్గంబున నిషధాధిప
రాజధానికి నభిముఖుండై చనియె నప్పుడు. 98

మ. మరువాలారుశరంబులం దొరఁగుకమ్మందేనెతోఁ గూడి య
య్యరవిందాక్షికిఁ బక్షిపుంగవగవీహయ్యంగవీనంబు ని
ర్ఝరహస్తంబు నొనర్చె మున్ను రుచిసౌరభ్యంబునం బిమ్మటం
మురియుం ద్రోయుచు నాన్చె నెమ్మనమునన్ మార్గా
సముచ్ఛ్రియమున్.. 99

*తే. ప్రాణబాంధవుఁ డైనయప్పుడు రాజ
నభ్రమార్గంబునం దొయ్య ననుచరింప,
నశ్రుధారాప్రవాహంబు యవధి గాఁగ
దైన్య మందుచు మరలె వైదర్భిచూడ్కి. 100

వ. ఇవ్విధంబునఁ బక్షివిక్షేపభేదసూచితనిజకార్యప్రయోజన పద్భావుం డై యమ్మహానుభావుఁడు దనరాక కెదురుసూచు చుం దటాకప్రాంతకేళీవనాంతరంబున నశోకానోకహ చ్ఛాయాశీతలశిలాతలంబున నుపవిష్టుం డైననిషధరాజుం గనుంగొని తనపోయివచ్చిన వృత్తాంతం బంతయు నెఱిం గించిన ముదితస్వాంతుం డై. 101

మ. పరపత్యంబు నిగూఢకార్యఘటనాచాతుర్యసంపత్తియుం
బరుసారైకపరాయణత్వమును నభ్యుద్గానలీలాధురం
ధరతాప్రౌఢియునుం గృతజ్ఞతయు వాత్సల్యంబు సద్భావ
ముల్, సరసీజాసనవాహనాన్వయవతంసా! హంస! నీకందముల్.

క. పరపతి యగుదమయంతిని
ధరణీధవకన్య నల్పతారుణ్యసఖీ
పరివార మెఱుఁగ కుండఁగఁ
బరిచిత నిమిషమునఁ జేయఁ బరులకు వశమే! 103

వ. అని గారవించి. 104

*శా. ఏమేమీ! యని విన్నమాటయ విన్కు వీక్షించు నెమ్మోము
సాంద్రామోదంబునఁ బక్షముల్ నివురు హస్తాంభోజ
యుగ్మంబునన్, భామారత్నమురూపసంపదఁ దగన్ భావించు

నానందమ్ము(ద్వేమత్తుం డయి చొక్కుఁ జిత్తమునఁ బృథ్వీ
నాయకుం డెంతయున్. 105

హంస నలుని వీడ్కొని బ్రహ్మలోకంబున కేఁగుట

వ. ఇవ్విధంబున నానందరసమగ్నుండై యన్నరేంద్రుం గనుం
గొని విహంగపుంగవుండు కార్యంబు సంఘటితం బయ్యె
నింక నాకుం బంకజాసనునకుం బరిచర్య సేయం బోవలయు
నని పలికి యతనిచేత సముచితప్రకారంబు వీడుకోలు వడసి
యమ్మానసౌకంబు బ్రహ్మలోకంబునకుం జనియె నప్పుడు. 106

తే. నిషధభూవల్లభుం డాత్మ నిండియున్న
కౌతుకంబు ప్రకాశంబు గాకయుండ
వనము వెలువడి పరివారజనులు గొలువ
వచ్చెఁ గ్రమ్మఱ నాత్మనివాసమునకు. 107

వ. వచ్చి విదర్భరాజకన్యావియోగవిహ్వలుం డగుచుఁ గాలంబు
గడపుచుండె నంత నక్కడ. 108

దమయంతీ విరహవర్ణనము

చ. నలవసుధాకళత్రునిగుణంబె గుణంబుగ సారసారథా
కలితతదీయకీర్తికలికామయమైనశరాసనంబునన్
విలసితసౌమనస్యపదవీరుచిరం బగుతద్విలాసముం [డిన్.
ములికిగఁ జేసి మన్మథుఁడు ముద్దియ నేయఁ దొడంగె నవ్వ

తే. అతనుతాపజ్వరంబు మై నమరి యుండఁ
జపలలోచన ప్రియకథాసరసిఁ దేలె
నాయపథ్యంబునన కదా యధికకంత
కలఁగుఁబోఁడికి సంతాప మతిశయిల్లె. 110

**తే.** కమలనేత్రత కవస్థానవిముఖ మైన
చంచలత్వంబు మదిఁ బ్రకాశించుచుండె
బాల యాలీల యభ్యసింపంగఁ బోలు
రమణదూతపతంగళక్రంబుతోడ. 111

**ఉ.** బాలిక చెక్కుటద్దములపజ్జలఁ గోమలమందహాసరే
ఖాలవ మంకురింపదు వికాసము చాలదు నెమ్మనంబునన్
వాలిక మించుఁ గన్గొనలవాకిట నల్లన సంచరింపనుం
జాలక చాల గుంటువడెఁ జారునిరీక్షణఖంజరీటముల్. 112

**సీ.** అతివ సమ్ముఖవస్తు వగువస్తువునుగాన
దాత్మ యంతర్ముఖం బౌటఁజేసి
చెలువ క్రొమ్మించులేఁజెక్కుటద్దం బొయ్యఁ
బాణిపల్లవశయ్యఁ బవ్వళించెఁ
గోమలినిట్టూర్పుక్రొవ్వేఁడి నెత్తావి
మొకరితేంట్లను మూఁతిముట్ట వెఱచెఁ
దరుణిలోచనబాష్పధారాలవంబులు
ముత్యాలసరులతో ముద్దుగురిసెఁ
**తే.** జామ శరకాండపాండిమచ్ఛాయ నొందె
బోటిమది కింపు గాదయ్యె నాటపాట
మృగవిలోచన కంతంత మేను డస్సె
నంతకంతకు సంతాప మతిశయిల్లె. 113

**చ.** ఉదితమనోనురాగదహనోష్ణభరంబున నాలతాంగికిన్
హృదయమునందు జొబ్బిలి వహించినచందనకర్దమంబు బు
ద్బుదముల నీనెఁ గల్పితవిభూషణజాలమృణాళవల్లరీ
వదనములం దమందగతి వారక పిచ్చిలఁ జొచ్చె ఫేనముల్.

మ. దశ లంతంతకు నెక్కుఁగా విరహసంతాపాతిరేకంబునన్
శశిబింబాననకుం దమస్స్వసకుఁ గార్శ్యం బొంది దేహం బహ
ర్నిశమున్ సాంద్రనిరంతరస్మృతిసమున్మేషంబునం గాంతకుం.
దశదిగ్భిత్తులయందుఁ గానఁబడియెం దద్రూపచిత్రావళుల్.

తే. చెలులు శిశిరోపచారముల్ సేయుపొంటెఁ
బ్రోవులిడ్డమృణాళకర్పూరవితతిఁ
గాంచి వైదర్భి మదిలోనఁ గళవళించె
జాలకాయాతచంద్రికాజాల మనుచు. 116

క. బిసపన్నగభూషణుఁడును
బ్రసవరజోభూతిమతియు బాండిమలక్ష్మీ
వసతియు నై చూపెను సతి
యసమాయుధునకుఁ బినాకియాటోపంబున్. 117

తే. మన్మథానలతాపంబు మాన్ప వేఁడి
డెందమునఁ జేర్పఁబూనిన కెందలిరులు
వెలఁది నిట్టూర్పుఁగాడ్పుల వెచ్చదాలి
చెరసి యపత్రపయంద పస్మరము లయ్యె. 118

సీ. చిగురుఁదామరపాకు జివ్వంచుఁ జనుదోయి
మొదలు క్రొవ్వేఁడిని మునుఁగఁబాఱెఁ
దరుణరంభాగర్భదళతాళవృంతంబు
పైగాలి వెక్కన పలుకఁబాఱె
లలితముక్తాహారగుళికాకలాపంబు
ఘ్రాణానిలంబునఁ గందఁబాఱెఁ
గర్ణపూరకలాపకల్హారదళరాజి
యశ్రుధారలనురియంగఁ బాఱె.

తే. దర్ప మొలయ నాలీఢపాదమున నిల్చి
మండలీకృతచాపుఁ డై మన్మథుండు
గవిసి సవ్యాపసవ్యమార్గములఁ దొడిగి
పువ్వుఁదూపులు పుంఖానుపుంఖ మేయ. 119

వ. ఇవ్విధంబునం బ్రతిపచ్చంద్రరేఖయుంబోలెఁ గళామాత్రావశేష యై విషమశరశరాశీవిషవిషవేదనాదూయమానమానస యగుచు శిశిరశైవాలపలాశగుచ్ఛంబులను సరసబిసకిసలయచ్ఛేదంబులను దుషారసలిలధారాసేకంబులను గర్పూరపరాగపాళిసముద్ధూళనంబులను జందనచర్చాచర్చికాక్షాళనంబులను చంద్రకాంతశిలాతల్పంబులను గదళీదళతాళవృంతసంతానంబులను వాసరంబులు గడపుచు నొక్కనాఁడు విభావరీసమయంబునఁ గేళిసౌధమణిచంద్రశాలాప్రదేశంబున సఖీజనులు పరివేష్టించి యుండ నిండుచందురుం జూచి వైదర్భి యుపాలంభగర్భంబుగా నిట్లనియె.

## చంద్రదూషణము

ఉ. హాలహాలద్వయంబు గలశాంబుధిఁ బుట్టె వినీలపాండుర
జ్వాలలతోడి నందొకవిషం బొకవేలుపు మ్రింగె నెందఱో
వేలుపు లోలిమై ననుభవించిన రెండవయీవిషంబు ని
ర్మూలము గాకయున్న యది ముద్దియ! పాంథులపాప మెట్టిదో!

సీ. విరహిణీవధమహాదురితపంకకళంక
కలుషితాత్మకుఁ డైన ఖలుఁడు వీఁడె
కాలకూటకఠోరకల్పాంతవహ్నికిఁ
దోఁబుట్టు వైన ఘాతుకుఁడు వీఁడె

చండదీధితికరజ్వాలమండలములోఁ
గ్రొవ్విఁ బొందినమహోగ్రుండు వీఁడె
బాడబంబును దానుఁ బాథోధికుక్షిలో
పరిపొత్తు మన్నదుర్జాతి వీఁడె
తే. సైంహికేయనిశాతదంష్ట్రావిటంక
విషరసప్రతిపాకభావితుఁడు వీఁడె
గగన మనురుద్రభూమి నేకతము తిరుగు
నదరు లుమిసెడికొఱవిదయ్యంబు వీఁడె. 122.
సీ. జననకాలమునాఁడు జలరాశికుక్షిలోఁ
బరిగొండ పోరివోవఁ డాఁకనేని
గ్రహణవేళలయందు రాహు వాహరించి
తృప్తిమై గ్రక్కునఁ ద్రెంచనేని
విషమనేత్రుఁడు చేతివిష మారగించుచోఁ
బ్రతిపాకముగఁ జేసి త్రావనేని
సహరపక్షము పేరియమృత్యుదేవత
యొకమాటుగ్గా నామ మడిపెనేని
తే. కుంభసంభవుఁ డబ్ధితోఁ గూడఁ గ్రోలి
తజ్జలములోడ వెడలింపఁ దలఁపఁడేని
విరహిజను లింత పడుదురే వీనిచేత?
నక్కటా! దైవ మటుసేయదయ్యెఁ గాక. 123.
తే. ప్రాణసఖులార! వెన్నెల బయలి కిపుడు
మించుచున్నదంబుఁ గోలయుఁ గొంచు రండు
చోసఁ దలచంద్రుఁ డస్తంబు సొచ్చినపుడ
వంచనము లేక ప్రియుఁడీ పొందియుండి. 124.

తే. మనము గారానఁ బోషించి కనకపంజ
రమున నిడ్డకేళీచకోరవ్రజంబు
వీనివెన్నెలఁ దెగఁ గ్రోలుఁగాని విడువుఁ
డొక్కగ్రుక్కన కుంభజుఁ డుదధిఁబోలె. 125

తే. శ్రవణపూరతమాలపల్లవచయంబు
మేపుదము వీనిలో నున్న మృగశిశువున
కది ప్రవర్ధన మొందెనే ముదితలార
మండలం బెల్లఁ దానయై యుండుఁ గాని. 126

క. రాహూగ్రహావదనగుహా
గేహాంతర్ధ్వాంతపటలకేళీరసకౌ
తూహలనవఖద్యోతం
బీహారిణాంకుండు వీని కేటికి వెఱవన్? 127

వ. అని మఱియును. 128

మ. అవతంసంబవు పార్వతీపతికి దుగ్ధాంభోధికిం గూర్మిప
ట్టివి బృందారకధేనుకల్పతరువాటీకౌస్తుభశ్రీసుధా
నవదిగ్వారణసోదరుండవు జగచ్చాక్షుష్యుండ వీ విట్టినీ
కవునే ధర్మువు శోచ్యపాంథజనసంహారంబు తారాధిపా!

క. చేయకుము చంద్ర! సుమన
స్సాయకునిం గూల విరహిజనపీడనముల్
ప్రేయకు మందంద పయ
స్తోయధివంశమున కపయశోడిండిమమున్. 130

వ. అని బహుప్రకారంబుల. 131

తే. ఇవ్విధంబునఁ గ్రథకైశికేంద్రతనయ
మదనవేదనదోదూయమాన యగుచు

బహువిధంబుల విధు దూఱి పలుకుచుండెఁ
దోడఁగి మధురంబుగా విధుంతుదునిఁ బొగడె. 132

వ. అనంతరంబ. 133



తే. అంతరిక్షంబునం దతివ్యవహితుఁ డగు
నిందు నిందింపఁ గారణం బేమి నాకు?
నెమ్మనంబున యందు సన్నిహితుఁ డైన
కంతుఁ బాపాత్ము నిందింతుఁగాక యనుచు. 134

చ. ననవిలుకాఁడ మన్మథ! యనాథ వధూవధపాతకంబు నీ
గొని మునిఁగించెఁ గ్రూరహరకోపకటాక్షశిఖిస్వరూప మై
మనమున నీవు నిర్దయత మానవు చూడఁగ నేముహూర్త వే
ళను జనియించితో యకట! లచ్చికి నమ్మధుకై టభారికిన్. 135

తే. కామ! పరమేష్ఠి నీమనఃక్రౌర్య మెఱిఁగి
పుష్పములు నీకు నాయుధమ్ములుగఁ జేసె
నవియు శరాళంబుగాఁ జేయ కైదె చేసె
నింత కైనను బ్రతుకునె యిజ్జగంబు? 136

ఉ. రాక సుధాంశుమండలమురాకకు మాఱుమొగంబు సేయుచో, డీకొని వచ్చుదారఁదక్షిణదిక్పవమాన మదక్షిణం బవుం
గాక వియోగికిం గుసుమకార్ముకశృంగము వంగఁ జేయు నీ
యాకరపంకజాతము రతీశ్వర! దక్షిణ మైననాఁటికిన్. 137

సీ. భువనమోహనసముద్భవ మైనయఘమున
వశరీరభూతంబ వైతి మదన!
విరహమాలిన్యదుర్విధుఁ గాని సోఁకవు
కలిదోషమువె నీవు కాయజాండ

ప్రాల్గలరతిదేవిభాగ్యసంపదఁ గదా
ప్రసవసాయక! చచ్చి బ్రతికి తీవు
చాలదా! యేలెదు సకలప్రపంచంబు
పంచత్వ మొందియుఁ బంచబాణ!
తే. తమ్మిపూఁజూలి నీయాగ్రహ మ్మెఱింగి
లోక మవ్యాకులతఁ బొందుఁగాక యనుచుఁ
దక్కఁగలకైదువులు మాని దర్పకుండు
విరులు నీకాయుధములు గావించినాఁడు. 138

వ. అని పలికియు వైదర్భి లీలోద్యానంబునందు పరసరసాల
కోమలకిసలయాస్వాదనకషాయకంఠకలకంఠ కామినీకుహూ
కారకోలాహలపంచమంబు వీతెంచిన నప్పల్లవాధరియుల్లంబు
ఝల్లన నొల్లంబోయి మూర్ఛిల్లిన. 139

సఖులు దమయంతికి శిశిరోపచారములు సేయుట

*ఉ. గొజ్జఁగినీరు సల్లె నొకకోమలి ద్రిప్పె లతాంగి యొర్తు తా
మజ్జకతాలవృంత మొకమానిని చందనకర్దమంబునన్
మజ్జన మాచరించెఁ గుచమండలి నొక్కవధూటి యొంతయుం
బుజ్జవ మొప్పఁ బాదములఁ బుష్పాడియొత్తె విదర్భకన్యకున్.

సీ. పద్మిని! కన్నీరు పన్నీటఁ దుడువుము
రంభాదళంబు సారంగి! వీవు
కల్పవల్లి! యొనర్పు కర్పూరతిలకంబు
చక్రవాకి! యలందు చందనంబు
వలిపెంపుఁజెంగావి వలువఁ గప్పు చకోరి!
బిసకాండహారంబు వెట్టు హరిణి!

కలకంఠి! చేర్పు చెంగలువరొత్తు దలాఁక
కలికి! పైఁ జిలికించు కమ్మఁదేనె

తే. బాలశైవాలమంజరీజాలకంబు
ఉంచుమలి! యొత్తు మఱి చేతులందుఁ గదియ
నప్పళింపు మందారిక! యడుగులందు
జల్లఁగాఁ బుండరీకకింజల్కధూళి. 141

దమయంతీస్వయంవరప్రకటనము

వ. అని పలుకుచు సంభ్రమించుసఖీజనంబులకలకలం బాలించి
యిది యేమి కోలాహలంబని భీమభూపాలుండు వేఁడి-
తుండై యడుగఁ దద్వయస్యాజనంబులు దా రెఱింగిన తెఱం-
గెల్లను విన్నవింప నన్నరనాథుండు ముద్దుఁగూఁతుమనోభి-
లాషంబునకు ననుకూలంబుగా జగంబునం దెల్ల స్వయం-
వరంబుఁ జాటింపం బంచిన. 142

తే. సప్తసాగరపరివృత క్ష్మాతలమునఁ
జాటఁబడియెను వాదిత్రసంయుతముగ
ధరణినాథకుమారవ్రాద్ధైర్యహారి
భోజకన్యాస్వయంవరాభ్యుదయమహము. 143

ఆశ్వాసాంతము

మ. నవరత్నోజ్జ్వలదివ్యలింగవరదానప్రీతదాక్షాయణీ
ధవ! కర్పూరవసంతరాయ! యనవద్యద్వాదశీవాసరో
త్సవరుక్మాంగద! వేమభూపతిమహాసామ్రాజ్యరక్షామణీ!
యవనాధీశసఖా! నిరంకుశవచోవ్యాపారపారంగతా! 144

శృంగార—క

క. ఆచక్రవాళశైల
స్థాచక్రమహామహీశకటకాస్థానీ
వాచాటచాటుకవితా
గోచరకీర్తిప్రతాప! కులమణిదీపా! 145

పృథ్వీవృత్తము.—
చతుర్ముఖవిలాసినీ శయవిలాసపంకేరుహ
స్రుతామృతమధూళికాసురభిసారసారస్వతా!
వితీర్ణిమహిమార్ణవా! విభవయోగసంక్రందనా!
ప్రతాపగుణభూషణా! పరిణతార్థసంభాషణా! 146

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యపుత్త్ర సకలవిద్యాసనాథ శ్రీనాథప్రణీతం బయినశృంగారనైషధ కావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు

# శృంగారనైషధము

## తృతీయాశ్వాసము





హర్షసుకవికవితా
వ్యాహారకథాసుధారసాస్వాదసుఖ
శ్రీహర్షోదయ నిత్యస
మాహితమహితాంతరంగ ! మామిడిసింగా! 1

### నారదపర్వతు లింద్రునికడ కేతెంచుట

వ. ఆకర్ణింపు మాసమయంబున నిఖిలభువనవృత్తాంతవేదియు నశేషభాషాకుశలుండును సర్వవిజ్ఞాననిధియును సమస్తశాస్త్ర ప్రవీణుండును సకలపురాణేతిహాససంహితారహస్యవిజ్ఞాన విశారదుండును నగు నారదుండు బాలసఖుండైనపర్వతుం డునుం దానును. 2

ఉ. పంబినవేడ్కతో భిదురపాణి సురాసురమౌళిమాలికా
చుంబితపాదపీఠు బలసూదనుఁ జూడఁగఁ గోరి నాకలో
కంబునకుఁ జనంగ సమ్ముఖకట్టెఁ బితామహుఁ డూర్మిపట్టి వా
ప్తాంబురుహాంగుళీనఖశిఖాంకురకోటి విపంచి మీటుచున్.

చ. భువనగురుత్వవైభవము పూనిన నేనియుఁ బూనఁగాని పొం
దవు చరియింప నారదున కభ్రపదంబునఁ బర్వతుండు దాఁ
దివురుట యెట్లు మింటఁ జనుదేరఁగ? యుక్తమ యవ్విధం
బునుం, బ్రవితతపక్షపాతగతిభంగి మదిం దలఁపంగ వచ్చినన్.

తే. గగనవీథి విమానమెక్కకయ చనిరి
యోగవిద్యాబలంబు చేయూఁత గాఁగఁ;
దపము గల్గంగ సాధనాంతరము లేల
సకలకార్యంబులందును సంయములకు? 5

సీ. అంతరాంతరముల నాకాశచరకోటి
మోడ్పుఁజేతులు మస్తముల ఘటింపఁ
దనకాంతిచంద్రికాధవళ యయ్యును జేర్చి
నాదిత్యదీప్తుల నతకరింపఁ
జడలేఱు వీచిహస్తముల నిర్మలవారి
నంఘ్రుల కర్ఘ్యపాద్యంబు లొసఁగ
నావహాసంవహాద్యనిలఘట్టనముల
శతతంత్రిమూర్ఛనాస్వరము లీన

తే. గహనసంసారఘోరసాగరము దాఁటి
పరమయోగీశ్వరుఁడు మోక్షపదమువోలె
బహుళతర మైనయాకాశపథము దాఁటి
నాకభువనంబు సొత్తెంచె నారదుండు. 6

వ. ఇట్లు నారదపర్వతులు నాకలోకంబునకుం జని సర్వగీర్వా
ణులు గొల్వం బేరోలగం బున్న సుపర్వాధీశ్వరుసన్నిధికి
నేతెంచి యాశీర్వాదంబు చేసిరి. యతండును సుముఖోల్లా
సంబున సముచితాసనవిన్యాసంబు మొదలయినయుపచారంబు

లాచరించి యిష్టగోష్ఠీవినోదంబునఁ గొంతప్రొద్దు నడపి
ప్రసంగవశంబున. 7

తే. అనఘ! జగములఁ గల్గువృత్తాంత మెల్లఁ
దెలియఁగా నీకుఁ గరతలామలక మగుచు
గారణం బేమి నడిమిలోకముననుండి
నరపతులు రారు మునువోలె నాకమునకు? 8

క. రా రిపు డిచ్చోటికి నని
ధారాపూర్వమున ధరణిధవు లెవ్వారున్;
నారద! నృపవంశంబున
వీరశరీరంబు లుద్భవింపవె ధరణిన్? 9

ఉ. ఏలొకొ మాగృహంబునకు నిప్పుడు రారు మునీంద్ర!
భద్రశుం, డాలసమాను లై నరనాథతనూజులు మోముఁ
దమ్ములన్, వాలికపోటుగంట్లు చెలువంబు గవింపఁగఁ బేరు
రంబులం, గ్రాలఁగ లీలనై దివిజకాంతలు వైచినపుష్ప
మాలికల్. 10

చ. అతినిశితాసిధార సమరాంగణభూములఁ ద్రెళ్లి శోణిత
స్రుతిఁ గడుఁ జొల్కనై యెగసి సూర్యపథంబున నేఁగు దెంచు
చోఁ, గతిఁ గయికొంద్రు లాఘవము గాంతురు మాభువ
నంబునందుఁ దా, రతిథిసమర్చనాప్రభవ మైనగురుత్వము
పార్థివోత్తముల్. 11

క. అభిముఖులై యేలొకొ నా
సభ కిప్పుడు రారు నృపతిసత్తము లనఘా!
యభిశాప మొనర్పరుగా
త్రిభువనసంస్తుత్య! నాదు దేస నరనాథుల్? 12

చ. కొలకొలమంచు నుండు సితకోకనదప్రభవప్రసూత! నా
కొలు విది తొంటినాఁ డతిథికోటులసంపడి నిప్పు డెంతయుం
బలపల నయ్యె బందుగులు పల్మఱుఁ గైకొని రాకయున్కి
నా,కలిమి నిజోదరైకభృతికాహ్యకదర్యతఁ జిన్నవోయెడున్.
చ. వదలక పూర్వపుణ్యవిభవవ్యయహేతువు లౌట సంపదల్
మదిఁ దలఁపంగ నాపదలు మాన్యసుహృజ్జనబంధుకోటికిన్
హృదనున మేలు సేత చతురాననసంభవ! శాస్త్రపద్ధతిం
దదుచితమైనశాంతికవిధానము నిక్క మెఱుంగవచ్చినన్.
వ. కావున నఘమర్షణబుక్కులంబోలు నీవాక్కుల మత్సంశ
యాఘం బపనయింపు మని సహస్రాక్షుండు నిజచక్షుస్సహ
స్రంబు తనముఖంబున నిల్పి యూరకున్న నారదుండు పాక
శాసనువినయపరిపాకంబునకు మనంబునం బరితోషంబు
నొందుచు నిట్లనియె. 15

తే. అతిథిబాంధవసంభావనాభిలాష
గర్భ మగునీదువాక్యసందర్భమునకు
సంతసం బయ్యె సురరాజ! సాదు సాదు!
సార్వకాలంబు నీవ యిజ్జగము లేలు. 16
వ. నాకభువనంబునకు రాజలోకంబు భూలోకంబుననుండి
రాకుండుటకుం గారణంబు వినుము. 17

— నారదుఁ డింద్రునకు దమయంతీస్వయంవరము దెల్పుట —

మ. ఒకరత్నంబు విదర్భదేశమునయం దుద్భూతమై పార్థివ
ప్రకరంబుల్ భ్రమియించు చున్నయది సౌభాగ్యప్రభానిత్యల
క్ష్మికి సంకేతనివాసమై మదననిస్త్రింశంబు నా భీమక [లన్.
న్యక నాఁగా దమయంతి నాఁ గలుగుపర్యాయాభిధానంబు

తే. ప్రతిముహూర్తంబుమదనసౌభాగ్యరేఖ
యౌవనముతోడఁబెరుఁగునాయలరుఁబోణి
ధరణియం దొక్కరాజనందనునిమీఁద
నిలిపె నఁట బయల్ వోకుండ నెమ్మనంబు. 19

వ. పురాకృతసంభవం బైనభాగ్యంబునకుఁదానకం బైనయమ్మానవేంద్రుం డెవ్వండొకోయని యడుగం దలంచె దేని. 20

తే. అడుగఁ బూనినమాట యేయెడకు నెక్క
నంతనుండియు మగిడింపు మనురరాజ!
ప్రశ్నమున కుద్గమనపరిశ్రాంతి వలదు
తెలిసి యుత్తర మీ నాకు వలను లేమి. 21

వ. నీవు యోగీశ్వరుండవు, నీహృదయంబు పరమాణుదర్శనసమర్థంబు; మనంబులు నణుపరిమాణంబులు; గావున నక్కాంతారత్నంబు మనం బెఱుంగవే? యని యడిగెదేని. 22

చ. అలయక యోగిబుద్ధి పరమాణువుఁ గాంచినఁగాంచుఁగాక కేవలము దదంతరస్థ మగువస్తువు గానఁగ నెట్లు నేర్చు? నన్నలినదళాయతేక్షణమనగపరమాణువునందు శ్రీదరీనిలయవిహారికృతుం డతఁడు నేరఁగవచ్చునె వానిఁగానఁగాన్?

వ. అన్నీలవేణి కుసుమబాణబాణపరంపరాశరవ్యం బైనతనహృదయంబు విరహపరితాపపాండురంబు లైన యవయవంబులం బ్రకాశించుటం గనుంగొని గురుజనంబు తద్భావ పరిజ్ఞానార్థంబు పంచాశత్కోటివిస్తీర్ణం బైనభూమండలంబున స్వయంవరమహోత్సవంబు చాటింపం బంచిన. 24

ఉ. అంగదఁ దత్స్వయంవరమహామహవైభవహారికేలికిఁ
గ్రంగన ఘంటపైఁ గొడుపు వ్రాలుట యెన్నఁడొ నాఁట

నుండియుఁ, సంగరముం గరంబుగ మనంబున భావన సేయ
రైరి యా, మంగళకార్యనిష్ఠు లయి మధ్యమలోకమున
న్మహీపతుల్. 25

తే. అఖిలమోహిని యైనయయ్యలరుఁబోఁడి
శైశవము వీడుకొన్నది సందుగాఁగ
ననుదినంబును రాజనందనులమీఁద
వేఁటలాడుచు నున్నాఁడు విషమశరుఁడు. 26

వ. అది కారణంబుగా రాజలోకం బీలోకంబునకు రాదు;
భూమండలంబున భండనంబు లేకుండుటం జేసి నావిలోచ
నంబు లుపవసించి యున్నయవి, యే నిప్పుడు వీనికి సుఖ
పారణంబుగా రణక్రీడాడంబరంబు రాజులతో నీవు
సంఘటింతువో యనునాస నిచ్చోటికిఁ జనుదెంచితి నని
పలికిన. 27

ఉ. అమ్మఘవంతుఁ డల్ల నగి యంబురుహాసనసూతి కిట్లనున్
సమ్మద మొప్ప లేదు రణచర్చ దివంబున నాదు నెయ్యపుం
దమ్ముఁడు కైటభాంతకుఁడు దక్షతఁ బెగ్గడమై సమస్తభా
రమ్ము భరింపఁగాఁ ద్రిదశరాజ్యము నెమ్మదిఁ జేయుచుండుదున్.

తే. సాక్షిమాత్రంబుగాఁ గరస్థలమునందు
నెప్పుడు వజ్రాయుధంబు వహింతుఁగాని
యులవియాజ్ఞయ చాలు సంయమివరేణ్య!
త్రిదశలోకాధిరాజ్యంబుఁ దిరము సేయ. 29

వ. అని పలికినం గలహభోజనుండు నిట్టూర్పు నిగిడించి యి
ట్లనియె. 30

శా. పాతాళంబున నున్న యప్పుడు గడుం బ్రార్థింతు భూలోకముం, జేతోవీథి ధరిత్రి నున్నపుడు గాంక్షింతుఁ సురావాసమ్మున్, దైతేయాంతక! యొక్కచోట నిలువం దాత్పర్య మిట్టుంగి నా, కేతోయంబున లేకపోయెను సమిద్వీతాభిలాషంబునన్. 31

వ. నిన్నుం గనుంగొంటి, నారాక కిదియ లాభంబు నన్ను వీడుకొల్పుమా, మధ్యమలోకంబునకుం గ్రమ్మఱం బోయెద, దమయంతీస్వయంవరోత్సవావసరంబున మాత్సర్యంబువుట్టి క్షత్త్రియు లగు రాచపుట్టువులు దమలోనం బ్రతిఘటించి నిల్చి శస్త్రాస్త్రంబులం గదిసి మొత్తులాడి రేని చిత్తంబునం గుతుకబంటిగా సమరసంరంభంబు భజియింతుంగదా! యని పలికి సముచితప్రకారంబున నముచిసూదనుచేత ననుజ్ఞాతుండై పర్వతుండునుం దానును నరిగెఁ దదనంతరంబ. 32

ఇంద్రాదులు దమయంతీస్వయంవరమునకుం దరలుట

తే. దేవముని మాట లమృతంపుఁదేట లగుచు
నధికతర మైనయాహ్లాద మాచరింప
వేడ్కపడి నెమ్మనంబులో విబుధరాజు
భోజకన్యాస్వయంవరంబునకుఁ బోవ. 33

మ. సవిసంగంబునఁ దాను మొందివశచీప్రాణేశు కెంగేలికిం
జివురుంగైదువుజోదు వైద్య ముపదేశించెన్ రహస్యంబుగా
నవనీహారసరోమిళన్మలయజస్నానార్ద్రపర్యంతమై
యివతాళించు విదర్భరాజతనయాహృద్యస్తనద్వంద్వమున్.

వ. అప్పుడు. 35

సీ. రంభవిస్రంభసంరంభంబు డిగనాడె
మానరోషము పూనె మంజుఘోష
దళుకొత్తె మదిఁ దిలోత్తమకు నుత్తలపాటు
ప్రమ్లోచ ప్రమ్లానభావ మొందె
నూర్వశిసౌభాగ్యగర్వంబు వారివోయె
హారిణి సంతాపాగ్ని కరణి యయ్యె
నంతఁ బానుపుమీఁద వైచె మేను ఘృతాచి
మేనకసమ్మాన మూన మయ్యె
తే. నచ్చరలు దక్కుఁగలవార లలసి సొలసి
ప్రాణముక్తియ యుక్తిగా ననుమతించి
రాత్మవల్లభుఁ డింద్రుండ యవనినాథ
తనయ వరియింప ధరకుఁ బోదలఁచు టెఱిఁగి. 36

వ. ఇట్లు జంభారి విశ్వంభరాభువనంబునకుం బోవ సమకట్టి కట్టాయితం బయ్యె నతనితోడం గూడం బావకపరేతరాజపాశపాణులు పైనంబులైరి. యప్పు డప్పురందరాది బృందారక చతుష్టయంబు మున్నాప్రోడలగు వేల్పుఁజేడియలచేత దమయంతికిం గానుకలుగా నిగూఢప్రకారంబున మందారకుసుమదామంబులు మొదలుగా దేవలోకంబునం గలవస్తువులు పంపిరి, యనంతరంబ. 37

శా. ఆదిక్పాలురు దివ్యకాంచనవిమానారూఢులై సమ్మదా
పాదివ్యోమతరంగిణీలహరికాపర్యంతవాతంబు ప్ర
స్వేదాంభఃపృషతంబులం గముపఁగా శీఘ్రంబ యేతెంచి రా
హ్లాదం బొప్ప వసుంధరాస్థలి కమర్త్యవ్రాతముల్ గొల్వఁగన్.

వ. ఇట్లు గగనంబు డిగ్గి యమరులు సజలజలధరధ్వానగంభీరంబై దూరంబుననుండి వీతెంచునొక్క నిస్స్వత యాలకించి యిది యేమి ఘోషంబొకో యని యద్దిక్కు గనుంగొనునప్పుడు నిస్స్వనశ్రుతిసహోపయాతం బైనరథంబునందు. 39

## ఇంద్రాదులు నలుం గాంచుట

ఉ. కాంచిరి నిర్జరేశ్వరు లఖండితరూపవిలాససంపదన్
వంచితపంచబాణుఁ డగువాని సమంచితసారథీరతం
గాంచనభూధరంబునకు గాదిలి నెచ్చెలి యైనవాని ని
ర్వంచితదానశక్తి సురరత్నముఁ బోలెడువాని నైషధున్. 40

వ. కాంచి వరుణం డతనితరుణత్వంబునకు నిబిడం బగుజడభూయంబును లులాయధ్వజుం డతనిరూపధేయంబునకుం ధూమలత్వంబును వైశ్వానరుం డతనిధైర్యైశ్వర్యంబునకుం బరితాపంబును సుత్రాముం డతనికామనీయంబునకుం జూపోపమియును నిక్కంబుగా వహించి. 41

మ. శ్రుతపూర్వం బగువిశ్వమోహనకళాశోభావిశేషంబు సంమతి నూహింపఁగఁ జాయవాఋటయుఁ బ్రేమం బాత్మలోఁ
గీలుకో, నితఁడే నైషధుఁ డంచు నొండొరులతో నేకాంతమొయ్యొయ్య నా, శతమన్యుప్రముఖామరుల్ మును
కుచుఁ జర్చించి రుత్కంఠతోన్. 42

వ. ఇట్లు విమర్శించుచుండ. 43

తే. విమలతరదివ్యగగనయానములమీఁద
ధరణిఁ గొలువున్నయాదిగీశ్వరులఁ జూచి
యద్భుతాక్రాంతచిత్తుఁ డై యధిపసుతుఁడు
చేసఁ జనుదెంచె నంతంతఁ దేరు డిగ్గి. 44

వ. ఇవ్విధంబున రథంబు డిగ్గి మూర్తంబైన రామణీయకగుణా ద్వయవాదంబునుం బోనియమ్మేదినీరమణుండు సుత్రామాది విబుధరాజచయంబునకు నభివాదనం బాచరించి ప్రాంజలియై పార్శ్వంబున నిలిచి యుండె, నయ్యమృతాశులతనిం జూచి దమయంతీనిరాశంబులైన యాశయంబులతోఁ బరస్పర ముఖావలోకనంబులు చేసి, రప్పుడు వంచనాకపటనాటక సూత్రధారుండైన శునాసీరుం డానృపకుమారున కిట్లనియె.

ఇంద్రాదులు దమయంతికడకు నలుని దూతఁగాఁ బంపుట

సీ. అన్న! యెవ్వరివాఁడవయ్య? నేమమె నీకు?
వైషధుం డనుబుద్ధి నాకుఁ బొడమె
గారాపుఁజెలికాఁడు వీరసేనుఁడు మాకు
వాతనిరేఖ నీయందుఁ దోఁచె
నేమికార్యముఁ గోరి యెటు పోవుచున్నాఁడ?
వెప్పుడు నీచారిత్ర మేము వింద
మెఱుఁగుదో నీవు మ మ్మిందఱ లెస్సగా?
నెఱుఁగకుండిన నేమి? యెఱిఁగికొనుము

తే. దండపాణి యితం డనలుం డతండు
వరుణుఁ డితఁ డేను నిర్జరవల్లభుండ;
బిండితార్థంబు విను మేల పెక్కుమాట?
లర్థులై వచ్చితిమి మము నాదరింపు. 46

వ. మువహూర్తమాత్రంబున మార్గఖేదం బపనయించి కార్య నివేదనం బొనర్చెద మని పలికి యభిధాకుశలుం డైనయవ్వి బుధనాయకుం డారకుండిన. 47

తే. అర్థి యనుపేరు చెవిసోఁకినంతమాత్ర
జాదుకోఁ బులకించె నజ్జనవిభుండు
ప్రావృషేణ్యపయోధరప్రభవ మైన
గాలి నసిచిననీపవృక్షంబువోలె. 48

వ. ఇట్లు సంతసిల్లి భూవల్లభుం డంతర్గతంబున. 49

క. త్రిదశాలకును దుర్లభమై
మదధీనం బయిన యట్టిమంచిపదార్థం
బది యొట్టిదో కో! వేగమ
యొదవునొకో యడిగినపుడ యుచితంబునకున్. 50

తే. అడిగినప్పుడ యిత్తు నేఁ బ్రాణమైన
నర్థిమాత్రంబునకు వేడ్క యతిశయిల్ల
నట్టియే నింద్రునంతవాఁ డాసపడిన
నకట! యేమిచ్చి పరితోష మందువాఁడ! 51

క. ప్రాణంబుకంటె భీమ
క్షోణిపతనూజమీఁదఁ గూర్మి గలదు నీ
ర్వాణాదీశ్వరుఁ డయ్యలి
వేణిఁ మదిఁ గోరె నేని వేగమ యిత్తున్. 52

తే. ఎద్దియొకో వీరియభిలాష మెఱుఁగుభంగి?
నడుగకయ మున్న యీవి భాగ్యంబుగాదె?
వాంఛ నెఱిఁగియు నర్థార్థివచనదైన్య
మాత్మ సహియింపఁజాలువాఁ డధమదాత. 53

చ. †కటికతనంబు మాన్చి చటుకాకువిడంబముఁ గూర్చిలజ్జ సం
కటపడఁజేసి యర్థిఁ గడుఁ గాఱియ పెట్టినపాతకంబు న

† 'కటికతనంబుఁ బాని' అని పా

క్కట తలఁగంగఁ జాలునొకో కాలవిలంబము నాచరించి పి
ష్మటఁదదభీప్సితార్థము సమర్పణ సేయుప్రదాతయొక్కయిన్?
చ. కమలము పంకసంకరవిగర్హితమస్మము గాదు నిల్వఁగాఁ
గమలకు నంచు నెంతయును గౌతుక మింపెసలార నర్థిదోః
కమలము నిర్మలంబు నతిగాఢవివేకులు తద్వివాహరస
ద్మముగ నొనర్తు రప్రతిమదానకళాకలనాధురీణతన్. 55
ఉ. దానకళాకలాపసముదంచితసారవివేకసంపదన్
మానితయాచమానజనమానసవృత్త్యభిపూర్తిబుద్ధి యె
వ్వానికిలేదొకింతయును వాఁడొకరుండు భరంబుధాత్రికిం
గానలు గావు శైలములుగావు పయోధులుగావుభారముల్.
తే. *తలఁప నథమర్ణుఁ డొకఁడు ప్రదానపాత్ర
మిచట నొక్కటి గొని మీఁద నిచ్చు. గోటి,
సుకృతసంపదఁ బారలౌకికకుసీద
మాసపడువారి కిదియ బేహార మరయ. 57
వ. అని ముహూర్తమాత్రంబు చింతించి యానిషధరాజు
ప్రసన్నముఖుండై యాబర్హిర్ముఖుల కిట్లనియె. 58
తే. జన్యజనకంబులకు భేదశంక లేదు
దేహ మన్నజ మిందు సందేహ మెద్ది?
మీర లమృతాశు లమృతంబు మిమ్ముఁ జూడఁ
దృప్తిసంపదనొందె మదీక్షణములు. 59
తే. ఏను చేసినపుణ్యంబు లెట్టివొక్కొ?
ఫలిత మయ్యెను మత్పూర్వపరమతపము

* 'తలఁప నథమర్ణుఁ డొక్కప్రధానమాత్ర, మిచట నొక్కటి గొని' అని

లింతకల్యాణకర మానె యీదినంబు!
కౌతుకం బార దర్శింపఁ గంటి మిమ్ము. 60

చ. నలువు దలిర్ప సర్వసహానవ్రతజన్మము లైనకర్మముల్
ఫలితము లయ్యెఁ గావలయు భాగ్యముపెంపున భూతధా
త్రికిన్!, లలితము లైనపాదకమలంబుల నర్చన మాచరింపఁ
గాఁ, దలఁతురె వేల్పులార! ప్రమదంబున మీ రటు గాక
తక్కినన్? 61

వ. నాయందు మీ రపేక్షించిన ప్రయోజనం బానతిండు, ప్రాణంబైనను ప్రాణాధికంబైనను నది యెట్టిపదార్థంబైన నిచ్చెద నని నిర్విశంకంబుగాఁ బలికినయుర్వీశ్వరునకు గీర్వాణ వల్లభుం డి ట్లనియె. 62

ఉ. ఓమిహికాంశువంశకలశోదధికౌస్తుభరత్న! భూపతి, గ్రామణి
యస్మదీయ మగుకాంక్షితముల్ విను భీమపుత్త్రిపైఁ, గామన
నేసి వచ్చితిమి గమ్ము సహాయము మాకు నిక్కపుం,
బ్రేమయు భక్తియుం గృపయుఁ బెంపుగఁ జేయుము
దూతకృత్యమున్. 63

వ. భూమండలంబున రాజనందను లెందఱు లేరు? వారివలనం బ్రయోజనం బేమి? దక్కినగ్రహంబులు గ్రహరాజుం బోల నేర్చునె? యగాధగుణాంభోధి వగునీవు సహాయంబుగా మాకు సాధింపరానికార్యంబుం గలదే? యని పలికిన. 64

తే. బలనిషూదను కపటంపుభాషణములు
విని నృపాలుండు పలికెఁ దద్విధమ కాఁగఁ
గుటిలబుద్ధుల గెలువంగఁగుటిలమతియ
యర్హ మగుఁగాని నీతి గా దార్జవంబు. 65

వ. అఖిలభూకాంతర్వర్తనంబుల నెఱింగెదుమీరు నెఱుంగం బడనియర్థంబునుం గలదె! యట్టిమీ రివ్విధంబు నానతిచ్చిన నేమి యనంగలదు! ఏ నయ్యంగనం గోరి వరియింపం జూచు చున్నాఁడ, నమ్మచ్చకంటికిం గుంటెనతనం బెట్లు సేయనేర్తు? విరహవేదనాదోదూయమానమానసుండ నైనయేను విచారవాహ్యం బెట్లు రక్షింపనోపుదు? మనోరథపరంపరాసుధారసంబునఁ బరవశుండ నైననాకు భావగోపనం బెట్లు సిద్ధించు? వివిధరక్షాధికృతపాలితంబు లైన రాజశుద్ధాంతభవనకక్ష్యాంతరంబు లేప్రకారంబునం బ్రవేశింతుఁ? బెద్దకాలంబున నుండియు నాయందు నిసుకలి వద్దయుం గలిగియున్న యమ్ముద్దియతో మీప్రసంగం బెట్టుంగిఁ జేయుదుఁ? గావున వాస్యకారణంబగు నిక్కార్యంబునకు నన్ను భారకుం జేయకుం డని పలికిన. 66

క. మేలపుమైవడి నగవున
వేలుపులం దోడివారి వీక్షించి మహీ
పాలునితో నిట్లనియెను
జాలోవిమావల్లభుండు ప్రస్ఫుటఫణితిన్. 67

సీ. ఈమాట లాడకు మిందువంశవతంస!
యాడి తప్పఁగవచ్చు నయ్య నీకు?
క్షణభంగురం బైనసంసారమునకుఁ గా
ధర్మంబుఁ గీర్తియుఁ దగునె విడువ?
నన్వయంబున కాది యగుచందురుఁడువోలె
నకట కళంకి వేలయ్యె దీవు?

చిరకాలమున నుపార్జింపఁబడ్డ ప్రసిద్ధి
సేగిఁ బొందఁ గ నుపేక్షింపవలదు

తే. పరుస నైనచింతామణిఁ బసర మైన
కామధేనువు మ్రా నైనకల్పకంబు
నడిగి వైఫల్యమును బొంద రర్థిజనులు
మిన్నకయ పోదుమే యేము మిమ్ము నడిగి? 68

చ. అసదృశదానవైభవమహాగుణధన్యుని నిన్ను దేవతా
విసరము యాచకత్వమున వేఁడఁగ వచ్చుట కారణంబుగాఁ
బ్రసవవికాసమాత్రమునఁ బాండురభావము నొందుఁగాక
యా,కసము యశోవిహీన మగుఁ గల్పమహీరుహపంచ
కంబుచేన్. 69

ఉ. 'అక్షరముల్ పఠించుసమయంబునఁ బాఠము సేయఁ డయ్యె
నో?,వీక్షితవర్ణమధ్యమున విస్మృతిఁ బొందెనొ' యంచు నర్థు
లు, త్వ్రితః యొనర్తు రీక్రియ నభీష్టఫలప్రతిపాదనక్రియా
దక్షుని నిన్నుఁగూర్చిసయధర్మవికారమున న్న కారమున్.

శా. ఈయుద్ధంబు ఘటింపవన్న ! నృప! నీకెంతేని మే లయ్యెడున్
మాయాశీర్వచనంబులుం ద్రిజగతీమధ్యంబున న్నీ యశ
శ్ఛాయామండల మింపుకుందకుముదస్వచ్ఛంబు సంధించుసం
ధాయుక్తిన్ సితపీతరోహితహరిద్వర్ణోపసంహారమున్. 71

చ. వసుమతి వేయుపాదములవానికిఁ బుట్టినచాయపట్టికిన్
విసవిసగాడు కాలొకటి నిత్యము తండ్రి సుతుండు వోలఁగాఁ
బొసఁగవె దీని కుత్తరము వో యిది నీ ప్రకటప్రతాపముం
గసమస దాఁటఁబోయియతిఖంజతనొందెసహస్రపాదుఁడున్.

వ. అని యప్పుడు. 73

తే. అధిప! మా కిది పురుషార్థ మనియె వహ్ని
ప్రార్థనము సేకొను మటంచుఁ బలికె జముఁడు
రాజ! యన్యోపకారసంప్రభవ మైన
యశముఁ గైకొనవయ్య నీ వనియెఁ బాశి. 74

నలుండు రాయబారియై దమయంతికడ కేఁగుట

వ. ఇత్తెఱంగునం జాటుగర్భంబు లైనవేల్పులవాక్యసందర్భంబు
లాకర్ణించి వైదర్భికాముకుం డయ్యును నయ్యాదిగర్భశ్రీ
రుండు తద్దూత్యభారంబు భరించె. రాజపుంగవునంగీకారం
బెఱింగి దేవత లతని కంతఃపురప్రవేశంబున కుచితంబుగాఁ
దిరస్కరిణీవిద్య యుపదేశించి పొమ్ము కార్యసిద్ధి యయ్యెడు
నని వీడుకొల్పిన. 75

ఉ. అపరమోపకారనిధి యప్పుడు వేల్పులరాయబార మ
న్మోపు వహించి యాదివిజముఖ్యుల వీడ్కొని చిత్తవృత్తికిఁ
జూపునకుం శతాంగరయశుద్ధికి లక్ష్యముఁ జేసె భూతధా
త్రీపతి రాజధాని జగతీరమణీమణిహారవల్లరిన్. 76

తే. విరహభారంబుతోన యుర్వీధవుండు
ప్రబల మగుదేవకార్యభారము భరించె
నౌర్వశిఖితోన జలరాశియంబుపూర
మౌర్వశేయుండు భరియింపఁ డయ్యె నొక్కొ? 77

*మ. బలభిద్వహ్నిపరేతరాజవరుణుల్ పర్యుత్సుకత్వంబు సం
ధిలఁ గూర్చుండిరి యొండొరుం గదిసి యర్థిం దత్ప్రదేశంబున
న్నలనాళీకమృణాళనాళలతికానవ్యప్రణాళీమిళ
ల్లలనాలాపకథాసుధాసుభవలీలాలోలచేతస్కులై. 78

తే. అస్మహారథు పథము డాయంగ నరిగె
సత్వరమున విదర్భ రాజన్యువీడు
సారమగుభాగ్యవంతుమనోరథంబు
కార్యసంసిద్ధివోలె నస్ఖలితలీల. 79

మ. దమయంతీసుకుమారపాదకమలద్వంద్వార్పణాధన్యకు
ట్టిమహర్మ్యం బగుపట్టణం బపుడు గంటిన్ మంటి నం చెంత
యుం బ్రమదం బందె దిగీశకార్యఘటనాభారంబు చింతించి దీ
ర్ఘము నుష్ణంబునుగా నొనర్చె ధరణీకాంతుండు నిశ్వాసమున్.

వ. ఇట్లు కుండిననగరంబు చేరం జనుదెంచి యప్పురుషప్రకాం
డుండు పరిజనసమాత్యులం దగినవారల నొక్కరమ్యప్రదే
శంబున సైన్యంబు విడియ నియమించి బృందారకసందేశ
కార్యంబు నిర్వర్తింపం దలంచి ససారథికంబగు రథంబు
నచ్చోట నిలిపి యొక్కరుండును బాదచారంబున నప్పురంబు
ప్రవేశించె నప్పుడు. 81

శా. చూడం బాడఁగ దేవతాసరమునం జోద్యంబుగా భూమిభృ
చ్చూడారత్న మదృశ్యుఁ డయ్యె నతఁ డచ్చో నద్భుతం
బౌద న, వ్వాడం బౌరజనంబు లెల్ల నితఁ డెవ్వాఁడో కో!
నేత్రోత్సవం, బై డాయం జనుదెంచె నంతటను మాయం
బయ్యె నం చెంతయున్. 82

వ. ఇట్లంతర్హితుండై రాజమార్గంబున నిరర్గళవేగంబునం జని
యా రాజకుంజరుండు మదకుంజరఘటాసుందరం బగు రాజ
మందిరంబు డాసి. 83

సీ. వంచనమై డాగి వర్తించు టిది యేమి
ప్రాభవం బని సిగ్గుపాటు నొందు

నాయుధహస్తులై యాయితంబై యున్న
రక్షివర్గములతీవ్రతకు నవ్వ్వ
నది యెవ్వరని ప్రతీహారు లెవ్వరి నన్నుఁ
దన్నుఁగాఁ దలఁచి చిత్తమున నొదుగు
నెదురుఁగాఁ జను దెంచునిందీవరాక్షుల
కొయ్యనఁ దెరువిచ్చి యోసరిల్లుఁ

**తే.** దలఁచి తలఁచి యలీకవైదర్భిఁ గాంచుఁ
గాంచి వేల్పులప్రియవాచికంబునొడువు
నొడివి తనమాట కచ్చెరువడుజనంబు
క్రందుసందడిఁ దెలివొందు రాజసుతుఁడు. 84

**వ.** ఇవ్విధంబున నేనుంగు మొగసాల గడచి కక్ష్యాంతరంబులు ప్రవేశించి యంతఃపురంబు సొత్తెంచె నప్పుడు. 85

**చ.** ప్రిదిలిననీవిఁ గేల సవరించుతలోదరి నొక్కతెఁ గాంచి లోఁ
గదిరిన పాపభీతిఁ బడి గన్నులు మోడ్చ నొకళ్లొకళ్లకై
యెదురుగ వచ్చివచ్చి యొకయిద్దఱు ముద్దియ లొత్తిరవ్విభుణ్
మదగజరాజకుంభముల మచ్చరికించు కుచద్వయంబులన్.

**వ.** మఱియు శుద్ధాంతభవనాంతరంబులఁ జరియించువాఁడు హృదయోత్కంఠాతిరేకంబున. 87

**సీ.** సమనుభూతానాదిసర్గపరంపరా
ప్రక్సమాకలితసంసర్గముననొ!
లలితకేళీచిత్రఫలకాభివిలిఖిత
ప్రతిమావిలోకనాభ్యాసముననొ!
యాస్వాదనీయవిహంగపుంగవగవీ
హైయంగవీనపానాభిరతినొ!

భువనైకమోహనాద్భుతశంబరారాతి
శాంబరీలీలావిడంబముననొ!
తే. వివిధసంకల్పకల్పనావేశముననొ!
కన్నెక్రొక్కాఱు మెఱుఁగుదీగెయునుబోలె
బొలిచియప్పుడయడఁగుపూఁబోణిమూర్తి
నక్కుమారుండు నలుదిక్కులందుఁ గాంచు. 88
ఉ. పోరణగండ్లమార్గమునఁ జొచ్చినసన్నని గాలి యొక్కయం
భోరుహపత్రనేత్ర నునుఁబొంకపుఁ జన్నులమీఁదిసన్నపుం
జీరచెఱుంగు వాయగిలఁ విశ్వధరాతలేశ్వరుం [న.
డోర యొనర్చెఁ బాపభయ మొంది నిజాననచంద్రబింబము
* తే. ఇరులు గెలిచినయంతగపు రేండుముఖుల
కురులు మరుఁ డనువేఁటకాఁ డురులు నేసి
మరులు గొలుపంగ లేఁడయ్యె మనుజవిభుని
సరులు లేనిదృక్ఖంజనశాబకముల. 90
ఉ. కష్టపుఁ బ్రత్యవాయ మిదిగల్గుచు నున్నది మీలనక్రియా
స్పష్టవిలోకనంబుల, సపాంగపుఁజూపనురాగవిక్రియా
పుష్టికరం,బబాహ్యగృహభూమిఁ బ్రచారము సేయుచోటనా
దృష్టికిమార్గ మొండుగలదే? యని చింతవహించె రాజేదన్.
తే. రాజశుద్ధాంతభామినీరత్నరాజి
దీము గావించి నలరా జధీశు నేసె
నతనితాల్మికి నది పూజ యయ్యె నట్ల
యతనితూపులు పుష్పంబులౌనొ కావొ?. 92
ఉ. చీటికిమాటికి కేకపథసీమ మెలంగఁగఁ బాటి గామి శృం
గాటకవీథి కేఁగెఁ బతికాంతలసందడికల్కి నైన న

ప్పాటు వసించి యుండుట యుపాయమె చూడఁగ నాల్గు
త్రోవలం, బాటలగంధు లొక్కతఱిఁబైకొనివచ్చినఁ జిక్కుఁ
జిక్కుఁడో? 93

చ. ఉరవడి నేఁగుచోట నొకయుగ్మలి యొల్లెచెఱంగు మేదినీ
శ్వరునిభుజావిభూషణము వజ్రములం దవులంగఁ బాఱినన్
విరిసెను నీవిబంధ మదివిస్మయ మందఁగఁ దోడి భామినుల్
పరిహాసనం బొనర్పఁ బతి పాపభయంబునఁ గంపమొందఁగన్.

చ. ఇరువురు నీలనీరజనిభేక్షణ లించినవేడ్కతోఁ బర
స్పర మెదిరించి కాంచనపుబంతులఁ దచ్చనవాటు లాడఁగా
ధరణిపుఁ డడ్డమై చనుడుఁ దద్భుజదండముఁ దాఁకి మిట్టి బి
ట్టురవడిఁ జెంది గ్రమ్మఱిన నుబ్బురపోయిరి భామినీజనుల్.

సీ. చెలువారుక్రొమ్మించునిలువుటద్దములలోఁ
బ్రతిబింబములు గానఁ బడుటకతన
సికతామయం బైనసీమాంతరంబునఁ
బాదపద్మంబు లేర్పడినకతన
నలవోకయునుఁబోలె నాకస్మికం బైన
యంగాంగసంస్పర్శ మైనకతన
దిక్పాలు రొసఁగినదివ్యపుష్పంబుల
బహుళంబు లగుసౌరభములకతన

తే. విరహవిభ్రాంతి నొక్కొక్కవేళలందుఁ
గళవళపువింతభాషలకతన నప్పు
డెవ్వఁడో యొక్కమాయావి యేఁగుదెంచె
నంతిపురమున కని లోఁగి రబ్జముఖులు. 96

వ. ఇవ్విధంబునం బరస్త్రీపరాఙ్ముఖుండును జగన్మోహనాకారుం డును నగు నారాజకుమారుండు శుద్ధాంతకాంతామధ్యం బున నిర్వికారుండై చరించుచు నుపకారికాభవనంబులు గడచి యెడనెడం జంద్రకాంతవేదికావిటంకంబుల విశ్ర మించుచుం బ్రబోధమోహాశబలితం బగుచిత్తంబుతో విరహ వేదనాభరంబునం దూఁగాడుచుం బాదచారంబున నతి దూరం బరిగి యభ్రంకషంబును బ్రతోళీరత్నవేదికామధ్యా సీనసిద్ధగంధర్వాంగనాప్రవర్తితసంగీతకంబును దారహార గుంభనవ్యాపారపారంగత శంభళీనికాయంబును బంచశర లేఖలేఖనవియాతదూతికానీతకేతకీగర్భపలాశంబును కమల కల్హారబిసకిసలయ ప్రధాననానాశిశిరోపచార ద్రవ్యసమాన సత్వరసంచారికాజనాసారసంకులంబును నగు దమయంతి ప్రాసాదంబు డాయం జనియె నచ్చట. 97

ఉ. లేమ యొకర్తు వేడుక నళీకనళీకరణంబు జాతిగా
బూమియ చాను బన్నుకొని పోకలఁ బోవుచు నుండఁగా
మృషా, భీమభవీభవంతి యయి బింబఫలాధరి యోర్తుపార్థివ
గ్రామణి చూడదాని మెడగ్రుక్కినవై చెమధూకదామమున్.

తే. వ్రాసె నొక్కలతాంగి క్రొవ్వాఁడిగోర
వర్ణములు దోడుతో మషీవర్ణములుగఁ
బసిఁడిగేదంగిఱేకునఁ బ్రస్ఫుటముగ
మదనలేఖంబు నర్మమర్మంబు మెఱయ. 99

తే. చంద్రరజమున నొకపూర్ణచంద్రవదన
చంద్రమండలతిలకంబు సఖికిఁ దీర్చెఁ

జంద్రశాలాశిలాప్రదేశంబునందు
నావహిల్లంగ నపుడు చంద్రానవస్థ. 100

తే. మహితలావణ్యవార్ధిలో మదనుఁ డెక్కు-
కప్పురపుజోగుఁగంటిమి కంటి మనుచు
నర్మగర్భంబుగా నొక్కనలినవదన
పొగడె సఖిచంటిమీఁదియొప్పులనఖంబు. 101

ఉ. భావము పల్లవింప నొకపంకజలోచన వ్రాసెనొక్కల
జ్జావతి మించుగుబ్బవలిచన్నులపై మకరీకలాపము
వావిరిఁ గమ్మనీరు మృగనాభిరసంబున మేళవించి యే
కావళి నాకసింధువున కన్వయలీల ఘటించునట్లుగాన్. 102

క. సారెయదె పాడుపు మని యొక
సారె యొకతె యక్షకేళి సమయంబున ని
చ్ఛారతి నొకతెకుఁ జెప్పిన
సారె కనకపంజరమున సాధ్వస మందెన్. 103

*ఉ. వీఁడె నలుండు విశ్వపృథివీవలయైకవిభుండు వచ్చుచు
న్నాఁ డని భీమభూమిపతినందన యూరడిలంగఁ బల్కుపూఁ
బోఁడులమాట నేర్చికొని ప్రోదిశుకాంగనయట్లు పల్కినన్
జేఁడిది నన్ను నేక్రియ నెఱింగెనొకో యనియుండెనాత్మలోన్.

తే. అంబుజానన కొల్వుకూటంబునందుఁ
గనకకలహంసశాబకాకార మైన
విడియపుంబెట్టెఁ జూచి యుర్వీధవుండు
దలఁచెఁ దనకూర్మి దూతఁ జిత్తంబులోన. 105

వ. ఇట్లు కన్యాంతఃపురంబుఁ బ్రవేశించి దమయంతీ సభాభవన
ద్వారంబు సేరం జనుదెంచి యొక్కపసిండియరుఁగుమీఁదఁ

గూర్చుండె, నప్పు డబ్బాలికారత్నంబు జననీ ప్రయత్నంబునం దత్సమీపంబున కరుగుటయును స్వయంవరకల్యాణమహోత్సవంబు సంపాదింపంబడుటయు శోభనారంభసంభ్రమంబులవలన నెఱింగినవాఁడు గావున నయ్యంభోరుహాక్షీసమాగమనం బపేక్షించుచుండె నప్పుడు. 106

తే. అనుఁగుఁదల్లికి వందనం బాచరించి
వరుస నిలువేల్పులకు మ్రొక్కి వలను మిగుల
బ్రాహ్మణులచేత దీవెనల్ వడసి పుణ్య
భామ లిచ్చు హేమాక్షతప్రతతిఁ దాల్చి. 107

ఉ. తల్లి మనఃప్రసాదసహితంబుగ నిచ్చినపుష్పదామమున్
బల్లవపాటలం బయిన పాణిసరోజమునన్ ధరించి యా
యల్లకతీవ్రసంజ్వరభరాలసకోమలగాత్రవల్లియై
యల్లన నేఁగుదెంచుకమలాననఁ జూచె విభుండు దవ్వులన్.

వ. ఇట్లు వీక్షించి నిషధాధ్యక్షుండు సాక్షాత్కరించినమదనసామ్రాజ్యలక్ష్మియుం బోని యాధవళాక్షీసమక్షంబు చేరం జనియె నప్పుడు. 109

ఉ. ఎంతయు డాయ నేఁగియు మహీశుఁ డెఱుంగఁగ నేరఁ
డయ్యె వి, భ్రాంతివిదర్భరాడ్దుహితృపంక్తులలోనమృగాక్షి
నప్పు డ, య్యంతి యెఱుంగదయ్యె దిగధీశచతుష్టయదత్త
శాంబరీ, ధ్వాంతనిగూఢుఁ డైనవసుధాధవునిన్ నికట
స్థలంబునన్. 110

తే. అతివ విభ్రాంతివీక్షితుం డైన నృపతి
కంఠమున వైచెఁ జేతిచెంగలువదండ

యది నిజంబుగ నికటస్థుఁ డయినవిభుని
యఱుత సంలగ్న మయ్యె నత్యద్భుతముగ. 111

తే. వాసనాదృష్ట యగు కాంతవైచినట్టి
బొందు నిజమయ్యె నన చోద్య మందె రాజు
తాను వైచినకల్హారదామకంబు
మాయ మగుటయుఁ దరుణి విస్మయము నొందె. 112

తే. ఒక్కచో నుండియును బాసి యున్నభంగి
భ్రాంతి నన్యోన్య మీక్షించి పతియు సతియుఁ
జేరి మిథ్యాపరస్పరాశ్లేషకలన
సత్యపరిరంభఖేలనాసక్తులైరి. 113

శా. అంభోజానన భూమిపాలకునిచే నాశ్లిష్ట యయ్యున్మదిన్
సంభావింప నతం డదృశ్యుఁ డగుటన్ సత్యోపగూహంబుగా
స్తంభావిష్కృతి వైరసేనియును వైదర్భిన్ గ్రహింపంగ భ్రా
రంభంబుం దగఁ జేయ నించుకయు నేరం డయ్యె నీక్షించియున్.

చ. మొదల శరీరసంగమసముద్గతసత్యమతిప్రకాశతన్
బిదప నలీకసంవిదుపబృంహితబాధతఁ బొంది యిద్దఱుం
బదపడి యంతరంగములఁ బ్రత్యయ మొందర యించుకేని
యున్, గదిసి యొకళ్లొకళ్ల నిఱికౌఁగిటఁ జేర్చియుసుం
బ్రముగ్ధతన్. 115

ఉ. ఆరతిబోటికిన్ విభున కప్డు మనంబున విప్రలంభశృం
గార మొకళ్లొకళ్లయిఱికౌఁగిటఁ బుట్టిననిండువేడ్కచే
*బోరన నారఁగూరి మదిఁ బొంగె ఘృతంబతిమాత్ర బోసినన్
గూరికి కూర్కి యాక్షణము గొబ్బున మండినదీపమో యనన్.

* 'బోరన నాఱియాఱి మఱి పొంగె' అని పా.

వ. ఇవ్విధంబున సంయోగవియోగంబులవలన బోధమోహంబులు వహించుచు నవ్వరారోహ హృదయనిర్వేశేషం బగు. సఖీజనంబు మెత్తమెత్తనఁ దోడ్కొని పోవ నిజసభాభవనంబునకు నెట్టకేలకుం జనియె. ధరాధీశ్వరుండును ధారావాహికజ్ఞానప్రవాహంబునఁ దేలియాడుచు నంత నంతఁ గాంతారత్నంబుఁ గదియ నేతెంచె, నట్లుకొలువుకూటంబుఁ జొచ్చి యబ్బోటి హాటకపీఠం బలంకరించి సఖీపరివారపరివృతయై యక్కన్య తారకాగణపరివృత యగుచంద్రరేఖ యుంబోలెఁ బొలుపారె నాసమయంబున. 117

ఉ. భావముఁజూడఁగోరి యొకపార్శ్వమునన్ దమయంతిఁ జేరిధాత్రీపుఁ డుండె శాంబరి ధరించియ భీమసుతావినోదసంభావనకై సఖీజనులు పన్నినయాత్మమనోజ్ఞపుం స్వరూపావళిలో నిజాకృతి బయల్పడకుండఁగ రత్నవేదికన్. 118

## దమయంతికడ కింద్రాదులదూతికలు వచ్చుట

వ. ఇవ్విధంబున నబ్బాల పేరోలగం బున్నసమయంబునఁ బ్రతీహారిణి యేతెంచి యింద్రాగ్నియమవరుణులు పుత్తెంచిన దూతికలు మందిరద్వారంబున నున్నవా రని విన్నపంబుచేసి తదనుమతి వడసి ప్రవేశింపఁ జేయుటయు, నాసందేశహారిణులు మందమందగమనంబున నాత్రైలోక్యసుందరిం జేరంజను దెంచి సముచితసత్కారంబులు వడసి సఖీనిర్దిష్టంబు లగుమణిమయాసనంబులం గూర్చుండి, రాసంచారికాచతుష్టయంబునందు విస్పష్టమధురాలాపయు నర్మోక్తినిపుణయు నింగితాకారచేష్టావివేక విశారదయునుంబుంవత్ప్రగల్భయు

నగుజంభారిగారాపుశంభలి హస్తాంభోరుహంబులు మోడ్చి
యి ట్లనియె. 119

సీ. అవధారు దేవి! దివ్యకిరీటకోటిసం
 దానితవికచమందారదామ
సందోహమకరందబిందుధారాధౌత
 సందీప్తచరణారవిందుఁ డైన
సంక్రందనుండు నాస్వామి న న్నాయింద్ర
 గారాబుసంచారిఁగా నెఱుంగు
పాలిండ్ల కొత్తుగాఁ బరిరంభణము సేసి
 యడిగె నీసేమ మయ్యమరవిభుఁడు

తే. పారిజాతకమాల్యం బుపాయనమున
నముచిదమనుండు పుత్తెంచినాఁడు నీకుఁ
గైకొనుము దీని నని యిచ్చె నాకవనిత
పూర్ణచంద్రనిభాస్య కప్పూవుదండ. 120

వ. ఇట్లు కనకకదళీపలాశగర్భగతం బై నిర్భరామోదమధురం
బగుదివ్యదామం బయ్యాదిగర్భేశ్వరికి సమర్పించియిట్లనియె.

ఉ. చంచలనేత్ర! దివ్యలిపిసంతతి భూజనముల్ పఠింపలే
రంచును మానెఁగాని నఖరాగ్రమునన్ లిఖియించి నీకుఁ బు
త్తెంచుఁ జుమీ మహేంద్రుఁడుమదీయకరంబున దేవతావనీ
కాంచనకేతకీకుసుమగర్భదళంబునఁ గార్యపద్ధతుల్. 122

తే. తెఱవ యిన్నాళ్లు నడుగఁ బుత్తేఁడు నిన్ను
నరయ నిది తప్పుగాదె? సంవరణవేళఁ
గట్టు మమరేంద్రుకంఠంబుఁ గప్పురంపు
పలుకు లెడఁబెట్టి కట్టినయలరుదండ. 123

చ. భువనములందు నెల్లఁగడుపూజ్యము నాకమునాకభూమిలో
దివిజులు ప్రాభవాధికులు దివ్యకదంబములోఁ బులోమజా
ధవుఁడు వరేణ్యుఁ డానముచిదర్పహరుండు దృఢానురాగుఁ
డై, యువిద! నిను వ్వరింప మది నువ్విళులూరెడు నెట్టి
ధన్యవో! 124

శా. ఏలోకంబునకై మహాక్రతుశతం బేకాగ్రతం జేసి నాఁ
డాలోకంబు నలంకరించుటకు ని న్నర్థించె జంభారి నీ
వాలేఖర్షభు నాజ్ఞ సేయఁదగదే యబ్జాక్షి! మైకోలుమై?
నాలస్యంబునఁ బోలె నైన నొకమా టల్లార్పుభ్రూవల్లరిన్.

* సీ. నందనోద్యానమందారకచ్ఛాయల
విశ్రమింపఁగ నీకు వేడ్కగాదె?
మందాకినీపాండుమహితసైకతములఁ
గ్రీడ సల్పఁగ, నీకుఁ బ్రియముగాదె?
దుగ్ధాబ్ధికన్యకతోడికోడలు గాఁగ
నోరిమమై నుంట నీ కొప్పు గాదె?
మధుకైటభారాతిమఱఁది రమ్మని పిల్చి
పనిగొంట నీకుఁ బ్రాభవముగాదె?
తే. మూఁడుసంధ్యల నీచేత మ్రొక్కు గొందు
రెవ్వ రిటు తొల్లి యా వేల్పులెల్ల నీకు
నర్థి మ్రొక్కంగనునికి భాగ్యంబు గాదె?
యేలసందేహ? మమరేంద్రు నేలికొనుము. 126

ఉ. అద్దివిజాధినాయకునియానతి సేయుము చిత్తవృత్తినొం
డెద్దియునుం దలంపకు మహీనపరాక్రమనీతిశాలి నీ

*ముద్దుమఱందికుఱ్ఱ హరి మోసలఁగార్యభరంబు దీర్పఁగా
గద్దియమీఁదనుండి త్రిజగంబులు నేలికొనంగ నొల్లదే? 127

వ. అనిన విని యక్కన్నియ మిన్నకుండె, నపుడా పేరోలగంబున నున్నబోటికత్తియ 'లిదియుత్తమకార్యం' బనువారును నీప్రయోజనంబునకు విచారింపంబనిలే' దనువారును 'దీనికిం దగినయుత్తరం బంగీకారంబ' యనువారును నై తమలోన గుజగుజలం బోవుచుండిరి. అనంతరంబ మందస్మితసుందరవదనారవింద యగుభీమనందన హస్తారవిందంబులు మోడ్చి సంక్రందనుం దలంచి వందనం బాచరించి తత్సందేశహారిణిం గనుంగొని యిట్లనియె. 128

తే. వేదములునాల్గు వేవేలవిధులఁబొగడ
మనము వొగడెడువారమే యనిమిషేంద్రు?
వేఁడికొనియెదఁ జిగురాకుఁబోణి నిన్ను
హరిగుణస్తుతిసాహసిక్యంబు మాను. 129

సీ. శ్రుతి నుతింపఁగ నీవు నుతియించెదే యింద్రు
నతివ యీసాహసిక్యంబు మాను
సకలాత్మసాక్షికి శతమన్యునకు వేఱ
చెప్పంగ వలయునే చిత్తవృత్తి
హరియాజ్ఞ లక్షించి యక్షరోచ్చారపా
రుష్యభారమున కోరుచునె జిహ్వ
సంక్రందనునిదివ్యసందేశవాక్యంబు
ధరియింతు మౌళిఁ బూదండఁబోలె

తే. రాజు నాఁగ నిజాంశసంప్రభవుఁడైన
జిష్ణునకు నేను బరిచర్య సేయఁగలను

మున్నె నలునకు న న్నిచ్చుకొన్న దాన
నింక నొరునకు నెబ్బంగి నిత్తుఁ జెపుమ! 130

తే. నలుని వరియింపఁ గోరెడునాకు నిప్పు
డింద్రుపలుకు లయుక్తంబు లింపు గావు
కామసుఖములు నిర్వాణకామమతికిఁ
*గరము రుచియింప కునికి యుక్తంబుగాదె? 131

మ. ఇల వర్షంబులలోన భారతము భూయిష్ఠంబు నాల్గాశ్రమం
బులలోనన్ గృహమేధియాశ్రమమునుం బోలెం బరమో
జాతీయి, చ్ఛలఁ గావించెద భర్తృభక్తిగరిమన్ శర్మోర్మికిన్మో
దని, ధర్మలభర్మాగమమర్మనర్మసఖసమ్యక్కర్మకాండంబులన్.

ఉ. శర్మమె కాని యివ్విబుధసద్మమునందుఁ దలంచి చూడఁగా
ధర్మము సేయలే దిచట ధర్మము సేయఁగ నిర్విశంకతన్
శర్మము నొందనుం గలదు శర్మము ధర్మముఁ గాంచు
టొప్పునో, శర్మముఁ గాంచుటొప్పునో? విచారము సేయుము
నెమ్మనంబునన్. 133

క. ఇందుండి యూర్ధ్వగతియును
నందుండి యధోగతియును నవసానమునన్
బొందును సజ్జనుఁ డిందును
నందును గలవాసి చూడుమా డెందమునన్. 134

ఉ. ఆతత మైనకర్మగతి నాయువు వీడ్కొనునప్పు డాత్మలోఁ
గౌతుక మావహించునది గావున నాకసుఖం బపథ్య మా
పాతసుఖోన్ముఖుం డయినపంచజనుండు భజించు దానిఁ గా
మాతురితాతిరేకమున నార్యుల కింపవుఁ దత్ప్రకారముల్.

---

* 'దలఁచ రుచియింప నట్టిచందంబు గాఁగ' అని పా.

వ. అని పలికి యింద్రదూతికావాక్యంబులకు మనసువెట్టినబోటి కత్తియలతలం బెఱింగి వారివదనంబుల వీక్షించి యి ట్లనియె.

తే. మీతలం పే నెఱుంగుదు మిన్న కుండుఁ
డంబుజాననలార! యాయాస ముడిగి
యే ననాదిసంచారిణి నైనయాత్మ
హేతుపంక్తికి విధికి నధీనబుద్ధి. 137

క. నియతి యచేతన మఖిలము
నియతిపరాధీన మిట్టినిజ మెఱిఁగినచో
నియతివశు న్నియమించుట
నియతి గుఱిచి గర్హసేత నిష్ఫల మరయన్. 138

క. లోకంబున నాకీటం
బాకైటభవైరి యెల్లయాత్మలకు నభీ
ష్టాకాంక్ష యొక్కచందమ
యాకీ లెఱుఁగంగవలదె హృదయములోనన్. 139

తే. కొన్ని జీవులు చిదిపి ఱా ల్గొఱికి బ్రతుకుఁ
గొన్ని నునుసోగవెన్నెల గ్రోలిపొదలు
భిన్నరుచు లైనవారికిఁ బ్రీతి సరియ
తగవు గా దిందులోన నేకతరగర్హ. 140

తే. అగ్రమార్గజాగ్రన్నిభృతాపదంధు
బంధుసంరక్షణము పాడి బాంధవులకు
నైనకార్యంబు గానికార్యమును దెలిసి
యాడుఁడా యేను మీమాట కడ్డమాడ. 141

వ. అని సఖుల నెల్ల నివారించి పురుహూతదూతికం గనుంగొని మఱియు నిట్లనియె. 142

ఉ. స్వర్పతిచిత్తవృత్తి గలుషత్వము నొందునొ యన్భయంబునా
కేర్పడలేదు విన్ము దివిజేశ్వరదూతిక! సప్తతంతుభా
గార్పణ మాచరించి కర మాదరణంబున నేను రాజకం
దర్పుఁడునైషధాధిపుఁడు దన్ను నుపాస్తి యొనర్పఁ జాలుటన్.

చ. తనహృదయాధినాయకునిఁ దక్కఁగఁ దక్కొరుసన్నుతింపఁగా
వినుట సతీవ్రతంబునకు విగ్రహ, మిట్టిది ధర్మశాస్త్రవా
సన యటు గాన నోదివిజశుంభళి! యింకిటఁ బట్టి నీవు మా
యనిమిషరాజుపాదములయానసుమీ మఱియేమి వల్కినన్.

వ. అని తెగనాడి యచ్చేడియ సముచితప్రకారంబున బిడౌజసుని దూతికను వీడుకొల్పి నగ్నియమవరుణులసంచారికలునుం దమతమకు నదియ యుత్తరంబుగాఁ గైకొని యయ్యుత్త మాంగనం దగిన తెఱంగున నామంత్రణంబు చేసి చనిరి, యంతర్హితుండై నధరణీకాంతుం డావృత్తాంతం బంతయు నెఱింగి సంతోషభరితాంతఃకరణుం డై యక్కాంతారత్నం బునుం గనుంగొనియె నప్పుడు. 145

నలుఁడు దమయంతీసౌందర్యమును వర్ణించుట

తే. ముదిత క్రొమ్మేనికాంతిలో మునిఁగె మొదల
నంత నానందరసవార్ధి యందుఁ దేలెఁ
బిదప సమ్మోదబాష్పాంబుబిందుధార
యందు నవగాహనము చేసె నధిపుదృష్టి. 146

తే. మానవతిమూర్తి యాపాదమస్తకముగఁ
దిపుట వీక్షించి నిషధపృథ్వీకళత్రుఁ
డపుడు బ్రహ్మోద్భవప్రమోదాతిశాయి
మన్మథాద్వైతసుఖవార్ధిమగ్నుఁ డయ్యె. 147

చ. సుదతిముఖేందుమండలము సొంపున రాగరసాంబురాశి య
భ్యుదయముఁ బొంది యెంతయును సుబ్బిన వేల నతి
క్రమించుచున్, మఱిఁ గడు భీతిఁ బొందినక్రమంబున
భూవరుదృష్టి సేరె నమ్మదగజరాజయానకుచమండలతుంగ
మహీధ్రశృంగమున్. 148

చ. మగువముఖేందువం దమృతమధ్యమునన్ మునుగంగఁ
బాఱెయో, మగువకుచద్వయంబునడుమం బడి రాయిడి
దంచసిల్లెయో, మగువగభీరనాభిబిలమార్గముఁ దూఱి
పరిభ్రమించియో, సొగపున రాజనందనుని చూపులు నిల్చెఁ
దదంతరంబులన్. 149

ఉ. కాంత మెఱుంగుఁజన్నులకుఁ గ్రమ్మఱి క్రమ్మఱివచ్చుచుండెనం
గాంతరసన్నివేశములకై యటు లేఁగియు నేఁగలేక భూ
కాంతునిదృష్టి దిగ్భ్రమము గైకొనఁబోలు బళే! తదీయప
ర్యంతమునం దలందినకురంగమదంబను చిమ్మచీఁకటిన్. 150

క. రమణీనితంబచక్ర
భ్రమణంబున జిఱ్ఱఁదిరిగి పడఁబాఱెయొ భూ
రమణునిచూపు పరిష్వం
గ మొనర్చెఁ దదూరుకదళికాస్తంభములన్. 151

ఉ. నేత్రమ నేను జీరయును నేత్రమ చీరకు నాశ్రయింపఁగాఁ
బాత్రత గల్గె నాకు నిటఁ బాత్రత లేదని నామసామ్యవై
చిత్రికతంబునన్ బలిమిఁ జేకొనినట్టులు రాజుదృష్టి యా
క్షత్రియకన్యచారుకటిచక్రము నూరుయుగంబుదాఁకొనెన్.

వ. ఇత్తెఱంగున సఖీపరివారపరివృత యగునక్కాంతం గనుం
గొని యంతర్గతంబున. 153

క. వితతాప్రతిమాకారా
ద్భుతరూపవిలాసవిభవభూషిత యగుని
రతిఁబోఁటి తేటపఱిచుఁ
జతురాననహస్తశిల్పచాతుర్యంబున్. 154

తే. యౌవనాంభోధరోద్భూతహావభావ
వారిధారాభివృష్టశృంగారసరసి
యబ్జభవసృష్టివిద్యారహస్యభూమి
నిఖిలలావణ్యసీమ యీనీరజాక్షి. 155

తే. సాటి జంబేటి జంబాలజాలమునకుఁ
బోటి సూత్న్యహారిప్రావిభంగమునకు
దరముసౌదామినీదామధామమునకుఁ
గరముఁ బోలుపొందు దీనియంగములకాంతి. 156

ఉ. చంచలనేత్ర మేనినునుఁజాయకు సాటి యొనర్పఁగాఁ దగుం
గాంచనకేతకీకుసుమగర్భదళంబులు ధూళి బ్రుంగవే
నంచితభీతి నీసరసిజాక్షితనుద్యుతి కోడి గాదె నే
వించెను వారిదుర్గ మరవిందవరాటకచక్రవాళముల్. 157

తే. ఇంద్రుఁ డింతికి రక్షగా నిడఁగఁబోలు
నాభరణవజ్రమూర్తివజ్రాయుధంబు
నతఁడ యంతటఁ బోక బాణాసనంబు
నిఖిలమణిదీప్తి యనువేర నిలుపఁబోలు. 158

తే. నెమలిపింఛంబుతోడ నీరమణివేణి
చెలిమి సేయుటఁ బగ గొంటఁ దెలియ నరిది
యందుఁ బువ్వులఁ బూజించివట్టిలెఱఁగు
నర్ధచంద్రప్రహారచిహ్నములకలిమి. 159

తే. అలకతిమిరాభిదృశ్యఫాలార్ధచంద్ర
మెలఁత యిది కృష్ణపక్షాష్టమీత్రియామ
దీని ప్రాపున నేల సాధింపకుండు
విషమబాణుండు త్రిజగతీవిజయసిద్ధి? 160

తే. హరునికోపాగ్నిఁ బొగచూరి మరునిచాప
మసితకేసరపరివేష మైననాఁడు
హృదయమోహనశక్తి నీయిందువదన
యంచితభ్రూలతారేఖ కైనయుపమ. 161

తే. సాయకంబులు మూఁటి ముజ్జగము గెలువఁ
బాలుపెట్టి శేషించినబాణయుగళి
మదనుఁ డేతద్భ్రుగంభోజపదమునందు
గౌరవం బొప్పఁ బట్టంబు గట్టెఁబోలు. 162

తే. అతివ ముష్టిప్రతిగ్రహార్హావలగ్న
సందియము లేదు వలరాజుచాపయష్టి
యట్లు గాకున్నఁ గురియంగ నెట్టు నేర్చెఁ
బ్రకృతిశాతకటాక్షనారాచవృష్టి? 163

క. చలదింద్రనీలగోళా
మలకోమలతారతారమండలములు ప
క్ష్మలములు ప్రాంతశ్వేతం
బులు చపలము లౌర మెఱుఁగుఁబోఁడినయనముల్. 164

మ. దళదిందీవరకాంతిఁ బంచమదళత్వాకాపటనానంతరో,జ్జ్వలరం
భాతరుగర్భసంస్ఫుట లసచ్ఛాయాకలాపంబుతోఁ గలయం
గూర్చి చతుర్ముఖుం డొనరిచెం గాఁబోలు నాకర్ణశ,ష్కులికా
పాంగకమైన యీచిగురుటాకుంబోఁడి నేత్రద్వయిన్. 165

వ. కలువలనుం జకోరములఁ గారుమెఱుంగుల గండుమీల వె
న్నెలలను దమ్మిరేకులను నిర్మలమౌక్తికరత్నశుక్తులం
దలఁచి పయోజగర్భుఁడు సుధారసధారలు రెంటిలో విసం
బులుఁ జిలికించి చేసె నొకొ పోల్పెసలారఁగ దీనినేత్రముల్?

తే. శ్రవణపుటకూపవినిపాతసాధ్వసమున
నిగిడి యవ్వలి కటు పోక నిల్చెఁగాక
యధికచపలస్వభావంబు లైనయట్టి
దీనికన్నులు దలచుట్టుఁ దిరిగి రావె? 167

క. కేదారములో శిశిర
ప్రాదుర్భావమునఁ జచ్చి పడసినయురుపు
ణ్యోదయమున నొకొ యీశా
తోదరికిం గన్నులగుచు నున్నవి దమ్ముల్ 168

తే. త్రిభువనవ్యస్తసాయకత్రితయుఁ డైన
మరునితిలపుష్పతూణ మీముగువముక్కు
మానితశ్వాసనవసారభాను మేయ
పుష్పమయబాణయుగళాభిపూర్ణ మగుట. 169

సీ. నిబిడశైశవయాపనీయసంధ్యావేళ
యాననచంద్రబింబామృతంబు
లపనామృతాంశుబాలప్రభాజాలంబు
బంధుజీవలతాంతబాంధవంబు
పరిపక్వబింబికాఫలవిడంబనముద్ర
విద్రుమద్రుమలతావినియమంబు
మదననారాచకోమలహైంగుళచ్ఛాయ
యస్మన్మనోనురాగాంకురంబు

తే. మహితలావణ్యగుణజాయమానబహుళ
మాధురీచిత్రశోభాసమన్వితంబు
ప్రార్థనాకల్పపాదపప్రాజ్యఫలము
తియ్యపూఁదేనియలకు్రోవి దీనిమోవి. 170

ఉ. భాసురమధ్యరేఖ కిరుపక్కియలందును మోవి కించిదు
చ్ఛ్వాసము నొంది యున్న యది చంద్రనిభాస్యకు నేనొకప్పుని
ద్రాసమయంబులం గలలఁ గాకల నీకలకంఠిఁ గూడి ప
త్త్రాసవ మాని యాని దశనాంకుర మొత్తఁగఁ జారనోద్ధతిన్.

ఉ. *ఈ గజరాజగామిని మదేతదయోగభరప్రభూతిమా
ర్గాగతఖేదరాత్రిసమయావధిభూతవిభాతసంధ్య కా
లాగరుచిత్రకాంధతమసాంశసమన్విత జంభవైరికా
ష్ఠాగతరాగకర్త్రి ప్రకటద్విజసేవిత యౌట చిత్రమే? 172

ఉ. ఈయెలదీఁగఁబోణి కృపయేర్పడఁగాఁ దనలేఁతనవ్వుతో
వేయఁ పాలపాంగములవెంటఁ బ్రసాదము చేసిన న్నిశా
నాయకుఁ డెంతయుం బ్రియమునం గయికోఁడొకో నాల్గు
దిక్కులం, బ్రాయపుచంద్రికల్వాడసి పాఱఁగ వైచుచు న
వ్వుదార్థమున్. 173

తే. దాడిమీపక్వఫలబీజతతుల గెలిచి
దంతకురువిందపంక్తి యీతరుణి కమరు
సాంధ్యశీతాంశుమండలస్యందమాన
నవసుధారసబిందుబృందంబువోలె. 174

---

* ఈపద్యము పూర్వముద్రితపుస్తకములలో లేదు. వ్రాతపుస్తకములలో దొరకినది.

తే. మాటికి నుద్వేగ రాగాదిమార్జనమున
నతివిశుద్ధంబు లయినదంతాంకురములు
విమలముక్తావళీనమానములు దాల్చు
నీసరోజాక్షిముఖపద్మకేసరములు. 175

తే. వరశిరీషప్రసూనకేసరశిఖాగ్ర
పేలవంబుగ మేను గల్పించి ధాత
కలితసుకుమారసర్గప్రకర్షుఁ డగుచు
నిలిపె మార్దవ మీయింతిపలుకులందు. 176

ఉ. పచ్చనివృక్షవాటికలపండులభిక్షు భుజించి నిచ్చలుఁ
వచ్చి పఠింపఁబోలుఁ బ్రతివారము గోయిల బ్రహ్మచారి పెం
పచ్చుపడంగ నీసరసిజాక్షిముఖద్విజరాజునొద్ద వా
విచ్చి లసత్ప్రసూనశరవేదరహస్యము లైనపల్కులన్. 177

తే. దీనికంఠంబునందు వాగ్దేవి యుండి
వీణ మొరయించుచున్నది వీను లలర
నదియ ముఖమున వాగ్భవ మాశ్రయించి
యమృతధారాప్రవాహరూపముగ నిల్చె. 178

తే. అబ్జగర్భుండు సుషమాసమాప్తియందు
నెత్తి చూడంగఁ బోలు నీయింతివదన
మంగుళీయంత్రణక్రియాభంగి నమరెఁ
జిబుకమునయందు నానిమ్నసీమసంధి. 179

క. కమలాధిరాజ్యపదవీ
సమధిష్ఠిత మీవధూటి చారుముఖాంభో
జము మఱి యటు కా దన నే
నిమిత్తమున సేవఁజేయు నేత్రాంబుజముల్. 180

చ. కమలము తండ్రి యైనయుదకంబుఁ గళానిధి మిత్త్రమైనయ
ద్దమును నహర్నిశంబు నుపధావన సేసి వహించెనో సుమీ?
క్రమమున నీవధూమణిముఖప్రతిబింబవిలాససంపదః
సముచితలీల యాచితకచారువిభూషణరాజికై వడిన్. 181

సీ. రాహుదంష్ట్రాంకురక్రకచఘాతంబుల
నొక్కొకపరి నొప్పి నొందకున్నఁ
బరివేషమిష మైనపాశబంధంబున
బహువారములు గట్టువడకయున్నఁ
బ్రతిమాసమును గుహూరాత్రివేళలయందు
నత్యంతనాశంబు నందకున్న
బలవత్కళంకకజ్జలపంకసంకర
స్ఫూర్తి మాలిన్యంబుఁ బొరయకున్నఁ
తే. గాక సరివోలఁ జాలునే కమలవైరి
యనధిగతదోష మైనయీయతివ మొగము
మధురబింబాధరోష్ఠంబు మాఱు గాఁగ
నమృతపూరంబు గలిగినయంతమాత్ర? 182

సీ. సకలశాస్త్రౌఘనిష్యందధారాసార
నవసుధారసవాట్పృరిణాళులొక్కొ
రతిపంచబాణదైవతయుగ్మపూజనా
వసరనైవేద్యరూపంబులొక్కొ
ధన్వరేఖాంచితైతద్భ్రూజ్యకావేణు
శాఖాశిఖత్వగంశంబు లొక్కొ

† బలభేదిముఖచతుష్పర్షిప్రముఖప మన
స్సాసంగబంధపాశంబు లొక్కొ
తే. యధికదీర్ఘకటాక్షబాణాగ్రకషణ
శాణచక్రప్రసారమసారతరళ
భద్రతాటంక నేపథ్యభాసురములు
దీనివీనులు శ్రీకారమానదములు. 183

తే. పదియు నెనిమిదివిద్య లీపద్మనయన
శ్రవణముల రెంటనర్థ మర్థము గ్రహించె
నంతపత్త్రిస్రగంభీరహారిలేఖ
యది గదా వీనులందుఁ దొమ్మిదవ లెక్క? 184

తే. అవటుశోభితమాణవకాభిరామ
మంచితోర్ధ్వగతాలింగ్యతాతిహృద్య
మద్భుతైకనిదానశోభాస్పదంబు
కంబుబిబ్బోకవతి దీనికంఠలక్ష్మి. 185

క. కవితాగానప్రియవా
గ్వివరణసీమావిభాగవిధిరేఖలు నా
ధవళాక్షికంఠసీమం
బ్రవిమలరేఖాత్రయంబు ప్రస్ఫుట మయ్యెన్. 186

క. కాంతాబాహుద్వంద్వా
త్యంతపరాజయసమాశ్రితాంభోదుర్గా
భ్యంతరము లైనబిసముల
కంతర్నిర్వ్యథనకలన మది యెట్లొక్కో? 187

---

† 'బలభేదిముఖచతుర్బర్హిర్ముఖోన్మనః, ప్రతిబంధవాగురాపాశ
మొక్కొ' అని పా.

క. తరుణి యతిలలితపర్వ
స్మరపంచశరీసమానమహనీయనఖాం
కురమృదులాంగుళివిలస
త్కరపంకజయుగళి దీనిఁ దరమె నుతింపన్? 188

తే. జలరుహాననదోర్వల్లిఁ గెలువఁబోలుఁ
గేలిమై నీమృణాళికాకిసలయములఁ
గాక యివి యేల మిన్న కీకరణి మునుఁగు
కీర్తి యనుపేరిబహుళశైవాల్మీకాకార్తియందు? 189

సీ. గంధవారణకుంభగౌరవస్ఫురణంబు
కనకకుంభములకుఁ గల్గెనేని
లికుచకోమలకాంతిలీలావిశేషంబు
చక్రవాకములందు జరిగెనేని
మాలూరసౌభాగ్యమహిమానుభావంబు
దాడిమీఫలములఁ బగిలెనేని
నసకలోస్మీలితప్రసవగుచ్ఛచ్ఛాయ
యబ్జకోరకముల కబ్బెనేని

తే. గాని సరిసేయఁ గాఁ దాదు వానిఁ జార
హారనిర్ఝరసలిలధారావధౌత
కాంచనాచలశృంగభాగంబు లగుచు
రాజితము లైనదీనివక్షోజములకు. 190

తే. నలువ సన్నంబుగా దీనినడుము గీసి
యౌవనమునకు నిచ్చె నాయంశ మెల్ల
నది యుపాదానమునఁ గదా యిది సృజించె
నున్నతము లైనయేతత్పయోధరముల. 191

చ. అరయ ననంగరాజ్యవిభవాభ్యుదయంబు ప్రకార మిట్లుపో
కర మగు నైనయాసుదతికౌను వళిత్రితయంబుచే నిరం
తరమయి యాక్రమింపఁబడె దానికిఁ దోడ్డొకపాత్రునం
బయోధరములు దాయుచున్నయవి దర్పవిజృంభణాలీల
దేర్పడన్. 192

తే. ప్రబలవక్షోజహేమకుంభములు చూచి
లలితరోమావళీరజ్జులతికఁ జూచి
నాభికూపంబుఁ జూచి నాసయనయుగము
తృష్ణ వహియించుచున్నది చేనియందు. 193

తే. నాభి యుత్పాటితాలానసవ్యబిలము
రోమవల్లరి శృంఖలాపాశకంబు
కామమదవారణమున కీకటిబుకంతి
వలుదచనుదోయి గుహనప్రవాస్తుభూమి. 194

తే. ప్రతిఫలించుప్రవేణికాభారరచిత
మల్లికలు రాజతాటకరమాలికలుగ
శంబరారాతివిజయశాసనసువర్ణ
పట్టికయుఁబోలె నొప్పు నిప్పణఁతివీఁపు. 195

క. తనజనకుఁడు శౌరి సుద
ర్శనచక్రమునను జయించె జగ మని మరుఁ డీ
వనిత యదర్శనకటితటి
ఘనచక్రంబున జయింపఁగాఁ దలఁచెఁ జుమీ. 196

శా. ఏదే నొక్కమనోహరాంగకముచే నీయిందుబింబాస్యహే
లాదర్పంబునఁ బిప్పలచ్ఛదము గెల్వంగాఁ దలంచెం జుమీ.

లేదే నన్యమహీజపత్రములువో లెం గాక యేలా భయ
ప్రాదుర్భావమునం జలించు నది నిర్వాతప్రదేశంబునన్? 197

తే. చిగురుఁబోణి భ్రూవల్లరి చిత్రరేఖ
యింతినాస తిలోత్తమ యింత నిజము
చెలువయూరుకాండద్వయియాసృష్టి రంభ
మానినీమణిమధురోక్తి మంజుఘోష. 198

తే. ఊరుకాండద్వయమున నీయుత్పలాక్షి
సమదవారణరాజహస్తంబు గెలిచె
నదియ కారణముగఁ గదా యధికలజ్జఁ
బొంది ముడిఁగించునదియాస్యపుష్కరంబు. 199

తే. వనిత నానారదాష్టాదివదనకమల
నీలకుంతల కుచశైలశీలిభృగువు
చామ శ్రీమహాభారతసర్గయోగ్య
కారణవ్యాసకలితోరుగౌరమహిమ. 200

చ. సుదతి మనంబునం దలఁచి చూడఁ జతుర్దశియా నరుంధతీ
మదనపురంధ్రిదైత్యరిపుమానవతీనవమాతృకాజన
త్రిదశవరేణ్యభామలకు దివ్యమహానుహిమానుభావసం
పద నటు గాక గుల్ఫపరిపాటి కదృశ్యత సంఘటిల్లునే? 201

పల్లవంబులు దీనిపదకాంతిలవములై
పల్లవశబ్దలాభంబు నొందెఁ
బవడంబుమీఁదికోపమునవో యీకాంత
పాదంబు లత్యంతపాటలములు
శుద్ధపార్ష్ణులు గానఁ జూ దీనియంఘ్రులు
గరియూథపతియానగరిమ గెలిచెఁ

దోయజభ్రాంతినో యీయింతియడుగుల
నలువొప్పఁ బాయకున్నయది లక్ష్మి
తే. తరుణిపదములయది యలక్తకరసంబొ?
కాక త్రైలోక్యభామాభిరామమహాళి
భాగవిన్యాససంలగ్నబహుళనూత్న
చారుసీమంతసీమసిందూరరజమొ? 202.

తే. శిశిరకాలంబునందు నిశ్శేష మైన
జలజసస్యంబు సృజియింపఁ దలఁచి బ్రహ్మ
యాచరింపఁడె యీకాంతయాస్యహస్త
పాదసౌభాగ్యములయందుఁ బంచభిక్ష. 203.

క. వినుతయశోగపాదాంగు
ష్ఠనఖాస్యము లనెడిపూర్ణచంద్రచతుష్కం
బును ధరియించుట నొకొ యీ
వనిత చతుష్షష్టికళల వాసన కెక్కెన్. 204

చ. అని చికురాదియుం బదనఖాంతముగాఁ జిగురాకుఁబోఁడి నె
మ్మనమున సంస్తుతించి యసమానవిలాసకళావినిర్జితా
తనుఁ దను నప్పుడూమణికిఁ దత్ప్రమదయంబునఁజూప వేఁడియె
య్యన దిగడాఁచె భూపతి దిశాధిపకల్పిత నైనశాంబరిన్.

— ఆశ్వాసాంతము —

ఉ. భానుసమాన! మానగుణబంధుర! బంధురమానిదాన! దా
నానుకృతాంబువాహధనదాంబుదవాహనకామధేనుసం
తానకకర్ణ! కర్ణసుఖదాయివచోరచనాధురీణ! రీ
ణానతరాజ! రాజమకుటాంఘ్రిసరోరుహభావితాత్మకా!

క. కమలభవవంశపావన!
విమలాంతఃకరణ! బాహువిక్రమకేళీ
యమళార్జునమదభంజన!
సమరార్జున! నిరభిసంధిసౌజన్యనిధీ! 206

స్రగ్విణి. —
తల్లమాంబాసుతా! ధైర్యరేఖాచలా!
పల్లవాదిత్యసౌభాగ్యభాగోదయా!
పల్లవోష్ఠీకుచప్రాంతభాగద్వయీ
గల్లపాలీలసత్కామముద్రాంకురా! 208

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్య పుత్త్ర సకలవిద్యాసనాథ శ్రీనాథప్రణీతం బైన శృంగార నైషధకావ్యంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీరస్తు

# శృంగారనైషధము

## చతుర్థాశ్వాసము



మచ్చరణాంభోరుహ
చామీకరకటకఘటితసమదారాతి
స్తోమ! దయారఘురామ! ర
మామందిరలసదపాంగ! మామిడిసింగా! 1

### నలునిరాయబారము

వ. అవధరింపు మివ్విధంబునవిబుధమాయాంధకారంబు దూరం బగుటయుం గట్టెదుర నాజగజెట్టి జవనిక వాయందట్టినం జొడసూపుబహురూపు తెఱంగున, జలధరతిరోధానంబు వాసినం బ్రకాశించు నాహిమధాముని పగిది, నవిద్యావరణంబు విరిసినం దోఁచుపరమాత్ముని ప్రకారంబున, దోహదపలాలజాలంబు విరిసినం బ్రేక్షణీయం బగుపుండ్రేక్షుకాండంబుభంగిఁ, బరమాద్భుతాస్తనిమేషముద్రుండును నిర్నిద్రరోమప్రరోహుండును నిశ్చలాంగుండును వైశాఖస్థానకలితుండును నిర్వికారుండును నై భీమభూపాలపుత్త్రికకు నేత్రవిషయీభావంబు భజియించె, నప్పు డప్పుడమితేని గనుం

గాని సంభ్రమంబును భయంబును లజ్జయు మనంబునం బెనం గొనంగ నంగనాజనులు సమయసముత్థానరఘుళిరఘుళాయమానమణితులాకోటి వాచాటీభవత్సభాభవనాళిందంబుగా నందఱుం బ్రత్యుత్థానంబు సేసిరి. ధీరోదాత్త గావున నయ్యాదిగర్భేశ్వరి సమున్నతకనకాసనంబున మున్నున్న యునికిన యుండి యనిర్వాచనీయంబైనయానందంబు డెందంబున ననుభవించుచు 'నెవ్వండ? వెందుండి యేతెంచి, తెట్లు వచ్చితి? వని యడుగనుండి మరలం జంద్రుండో! యుపేంద్రుండో! కంతుండో! జయంతుండో! యని సందియం బందుచు మొదల హంసంబు సరసబిసినీపలాశంబుమీఁదఁ జరణనఖాగ్రంబున లిఖియించి చూపినంజూచిన చిత్రరూపంబుతో రూపంబు సంవదించుటంజేసి యీతండు నిషధరాజని యెఱింగియు శుద్ధాంతసదనప్రవేశంబు దుర్లభంబు గావున మిగులవిశ్వసింపక నిమేషనిస్సవ్రహంబులైనవిలోచనంబుల సాద్భుతంబును సకౌతుకంబును సానురాగంబునుంగా విలోకించుచు. 2

తే. అతివ మిథ్యాపలోకనాభ్యాసకలన
నిజముగా రాజుఁ జూచియు నెమ్మనమునఁ
దాల్పదయ్యెను శాలీనతాభరంబు
తథ్యమిథ్యావివిక్తి ముగ్ధలకుఁ గలదె? 3

ఉ. కేవలసాధ్వసంబున సఖీజను లూరక యుండఁగా మనో
భావపిధానయత్నపరిపాటి ననాదరముద్రచేఁ దిరో
భావము నొందఁజేసి ముఖపద్మ మొకించుక వ్రాల్చి పల్కెనా
నావిధచిత్రవాక్యరచనాచణ భీమతనూజ నేర్పునన్. 4

సీ. ప్రణతమౌళిమణిప్రభానికాయంబుతోఁ
బానీయమున నర్ఘ్యపాద్య మీఁగి
యత్యంతమధురవాక్యప్రపంచములతో
శర్కరాదుల మధుపర్క మీఁగి
ప్రవిమలం బైనసద్భావవైభవముతోఁ
బృథులకాంచనరత్న పీఠ మీఁగి
పరమసేవావిధావిరచితాంజలితోడఁ
బ్రముదితం బగుమనఃసద్మ మీఁగి
తే. యాతిథేయుల కభినవాయాతుఁ డైన
యతిథి తనయింటి కేతెంచునపుడు సేయు
సత్క్రియాచారవిధికలాసరణి యంద్రు
ధర్మశాస్త్రోపనిషదర్థధర్మవిదులు. 5
తే. అనఘ! యిదె హేమరత్న సింహాసనంబు
ఇచ్చగలదేనిఁ గూర్చుండు మిందు వచ్చి
కాక కార్యాంతరాసక్తికారణముగ
నేఁగఁ దలఁచినవాఁడవో యెచటి కైన? 6
తే. నవశిరీషసుమంబులనవకమునకు
నన్నదమ్ములు నీయడుగుఁదమ్ము
లెంతదూరంబు నడపింప నిచ్చగించె
నొక్కొ నిర్దయ మైననీయుల్ల మిపుడు? 7
సీ. ఏదేశమున నుండి యెచ్చోటి కేఁగెదు?
సంకేత మెయ్యది సంజ్ఞ నీకు?
రక్షాధికృతజనవ్రాతపాలిత మైన
శుద్ధాంత మెబ్భంగిఁజొచ్చి తిపుడు?

ఫలమేమియొక్కొ యీపటుసాహసమునకు
మముఁ గృతార్థలఁ జేయుక్రమముదక్క
నాఖీలదౌవారికాంధంకరణి యైన
శక్తినీ కేవిద్య సంభవించె?

తే. నైలుఁడవొ! యైలబిలుహర్మ్మి యాత్మజుఁడవొ!
పంచబాణుండవో! దేవపతిసుతుఁడవో!
చంద్రుఁడవొ! యింకఁ బెక్కుభాషణము లేల!
నిజము దప్పక చెప్పుము నిషధపతివొ! 8

క. ఆరము నీయుదయమునకుఁ
గారణమై యేకులంబు గాంభీర్యమునన్
దారాపతిఁ గన్న పయః
పారావారంబుతోడఁ బ్రతిఘటియించెన్? 9

తే. మానవుఁడ వైతివేని యిమ్మహి కృతార్థ
విబుధలోకంబ లోకంబు వేల్పువేని
భువనముల కెల్ల మీఁ దధోభువన మీవు
భుజగ రాజాన్వయము నందుఁ బుట్టితేని. 10

ఉ వానిఁ బ్రశంససేయఁ దగు వాఁడు కృతార్థతముండు వానిచే
నీనిఖిలంబు పావన మహీనకృపావిభవం బెలర్ప నె
వ్వానిగృహాంగణంబునకు వచ్చెడిత్రో వరజంబులందు నీ
మానితపాదయుగ్మక మమర్చుఁ బ్రఫుల్ల సరోజదామమున్.

వ. గుణాద్భుతం బైనపదార్థంబు వర్ణింప కునికియసహ్యాశల్యం
బైనవాగ్జన్మవైఫల్యంబు ధూర్జటిజటాకిరీటాలంకారం బైన
శశాంకునిసౌకుమార్యంబును నమృతంబునకు నుత్పత్తిస్థానసం
బగుపయోనిధానంబుగాంభీర్యంబును విశ్వావిశ్వంభరాం

భోజకర్ణికాయమానం బగుసువర్ణాహార్యంబుధైర్యంబును
విభ్రమభ్రూలతాభంగలీలావిజితసుమనస్సాయకవిలాసరేఖా
సారం బై నిర్వికారం బైనయాకారం బెవ్వరియందునుం
గలదె? యేము కృతార్థుల మైతిమి. మాజన్మంబులు సఫలంబు
లయ్యె. మావిలోచనంబులు భాగ్యంబులు సేసె. వీనులు
భవదుదంతశ్రవణకుతూహలాధీనంబు లయియున్న యవి.
వాగమృతంబు వానికిం బ్రసాదింపు మనుటయు. 12

ఉ. అంకిలి లేక యప్పు డరుణాధరపల్లవనిర్గతంబు లై
పంకరుహాయతాక్షిసుసుఁబల్కులు తేనియ లొల్కుచుఁ
శ్రవో, లంకృతులై నృపాలుమది లగ్నము లయ్యె వినోద
లీలకై, మంకెనపూవుఁజాపమున మన్మథుఁ డేసినతూపులో
యనన్. 13

వ. అనంతరంబ దమయంతీశాసనంబున సఖీజనంబు కనకాసనంబు
వెట్టిన. 14

ఆ. అవ్వరాసనంబునందు నాసీనుఁడై
యర్కుఁ డుదయశిఖరియందుఁ బోలెఁ
గొనియె నిషధరాజు వనజాతముఖులచే
నాతిథేయ మయినయర్ఘ్యపూజ. 15

వ. ఇట్లు సంభావితుం డై యంభోరుహాక్షులు తన్ను వీక్షిం
చుచు సంజాతకౌతుకంబున వింజమూ కిడినభంగి నూరకుండ
నప్పుణ్యశ్లోకుండు ప్రావృషేణ్యపయోధరధ్వానగంభీరం
బైనయెలుంగున దమయంతి నుద్దేశించి. 16

సీ. ఏను దిక్పతులయాస్థానంబునం దుండి
యరుగు దెంచితి నీకు నతిథి నగుచుఁ

బ్రాణంబులును బోలె నంతరంగమునందుఁ
దత్కార్యభరమును దాల్చినాఁడఁ
జరితార్థముగఁ జేయఁ జను నాదుదూత్యంబు
నాతిథ్యసత్కార మదియ నాకుఁ
గాలయాపన సేయఁ గాదు నిశ్చయముపైఁ
గర్తవ్య మగునట్టికార్యమునను
తే. నుల్ల మిప్పు డేకాగ్రమై యున్న యదియె?
యవసరం బౌనె దేవరహస్యమునకు?
వింతవారలు లేరుగా యింత నంత?
సువిద! మనవార లేకదా యున్నవారు? 17

క. నాకౌకఃప్రవరులు ని
న్నాకాంక్షించిన ప్రయోజనాంశము దిరమై
యాకర్ణింపుము చెప్పెద
నాకర్ణపుటాయతాక్షి! యవధానమునన్. 18

వ. పాకశాసన పావక పరేతరాజ పాశపాణులు పుత్తేరఁ బనిపూని వచ్చితిఁ, జిత్తగించి యక్కార్యంబు విను, మప్పరమపురుషులు పరిషన్మధ్యంబునం బంకజాసను తనూభవునివలనఁ ద్రిభువనమోహనంబు లైననీరూపలావణ్యవిలాసవిభ్రమాది గుణంబులు విని వినుకలి వలవంత నెంతయుఁ జలించి పంచేషులుంఠితధైర్యవిత్తంబు లగు తమచిత్తంబులం గల వృత్తాంతంబు లంతయుం దెలియం జెప్పి, రిప్పు డయ్యాశాపతులాశాపాశంబులఁ గట్టువడినారు. వారియందును సంక్రందనుండు. 19

తే. నందనోద్యానవీథికాంతరములందుఁ
బూర్ణచంద్రాస్య! విహరింపఁ బోవ వెలఁచుఁ
గల్పతరుపల్లవంబులు గమిచి మేసి
కోకిలం బెప్డు గూయునో కొసరి యనుచు. 20

తే. పరమ మగుకోటి కెక్కె నోపద్మనయన!
నవనవం బైననీజవ్వనంబుతోన
యసమబాణునిచాపంబునందు గుణము
భామ! నీయందు సుత్రాముప్రేమగుణము. 21

ఉ. ఆరసి చూచి తాపమునయందునురూపమునందుఁబూర్ణిమా
తారకరాజుగాఁ దలఁచి తన్వి! భవద్విరహాతురుండు జం
భారి నిగుడ్చు భ్రాంతి నుదయావసరంబుల నొద్ద నుండి రో
షారుణ మైనలోచనసహస్రము బాలసహస్రభానుపైన్. 22

తే. మూఁడుకన్నులవేల్పుతో మోహరించి
నేఁడు దేహంబు లేక యున్నాఁడు దాను
వేయికన్నులవేల్పుతో విగ్రహించి
వనిత! యిం కేమి గానున్న వాఁడొ మరుఁడు. 23

చ. *చిలుకలు వల్కునో చెవులు చిల్లులువోవఁగనంచు నెన్నఁడుం
వెలలఁడు నందనోపవనవీథులకై యటు వహ్నిభాగని
ర్మలశశిరేఖమీఁదియపరాధమునన్ గజదైత్యశాసనుం
గొలువఁడు పాకశాసనుఁడు గోమలి! నీపయికూర్మి పెంపునన్.

తే. *స్మరశిలీముఖకుసుమకేసరపరాగ
ధూళిపాళిక చుళుకించెఁ దూర్పుదిక్కు
ఇంతి! వేగన్నులును గానఁ డింద్రుఁ డిపుడు
నీవిలాసంబు పెంపు వర్ణింపఁదరమె. 25

తే. విరహతాపప్రశాంతికై విబుధపతికి
నార్ద్రపర్యంకవిధికిఁ గా నపచయింపఁ
బరుల లేములు వాపంగఁ బొలుపడిన
యమరతరువుల కొదవెఁ బుష్పముల లేమి. 26

మ. విను వైదర్భి! భవద్వియోగదవథూద్వేగంబు వారించుచున్
దినముల్ పుచ్చుచు నున్నవాఁడు విబుధాధీశుండు మందాకినీ
కనకాంభోరుహవాళకల్పితనవాకల్పంబులం జారునం
దనమందారతరుప్రవాళమయచింతారత్నతల్పంబులన్. 27

ఉ. పుష్పధనుర్లతామధుపపుంజగుణక్వణనం బొనర్చి వా
స్తోష్పతికర్ణముల్ మనసిజుండు చెవుడ్పడఁ జేసె నక్కటా!
గీష్పతి యేమి చెప్ప నిటఁ గ్రింద బలారికిఁ గామవిక్రియా
దుష్పథవృత్తికిన్ మనసు దూర్పమికై బహునీతిశాస్త్రముల్.

తే. చెలువ! జంభారియాసకుఁ గొలఁది యేది?
తా సహస్రాక్షుఁడై యుండి దైన్యవృత్తి
నభిలషించుచునున్న వాఁ డాత్మలోనఁ
జంచలం బైననీకటాక్షాంచలంబు. 29

క. ఏవేల్పు సోమపీథులు
సేవింతురు ముఖ్యతనువు శివునకు నేవే
ల్పేవేల్పు వెలుఁగులకు గని
యావేలుపు నిను వరింప నాకాంక్షించెన్. 30

ఉ. స్థాణునిలోచనాంచలము దాపుఁగఁ దీవ్రతరార్చులన్ నిజ
ప్రాణముఁ గొన్ననాఁటిపగ యాత్మఁ దలంచియొ నీకటాక్షదృ
క్కోణము ప్రాపున స్మరుఁడు గోల్కొని పంత మెలర్పఁగాఁ

గొనెఁ, బాణదశాగ్రపాతమునఁ బావకుభూరిమనోభి
మానమున్. 31

తే. ఉవిద! సోమరసం బన్న నోకిలించు
నడిచిపడు నాజ్యహోమమంత్రాహుతులకు
నిచ్చ నేయఁడు మనములో నిధ్మములకుఁ
బావకుండ నేఁడెల్లి నీపై విరాళి. 32

తే. తరుణి! యాత్మప్రతాపసంతప్తుఁ జేసి
పుష్పనారాచుఁ డగ్నికి బుద్ధి సెప్పె
'నాత్మ వత్సర్వభూతాని' యనెడునీతి
నన్యతాపంబు శిఖి మాసునట్లు గాఁగ. 33

క. కుసుమాయుధ బాణంబులఁ
గసుగంది భవద్వియోగకలుషత నర్వా
వసరంబుల నర్చకు లిడు
కుసుమములకు వెఱచు వహ్ని కువలయనేత్రా! 34

ఉ. బాలిక! నీవు హేతువుగ భాసుకులాభరణంబు దక్షిణం
బేలెడురాజు ధర్మముల కెల్లను గందువ ధర్మరాజు లో
దాలి మనోభవాగ్నిఁ దనతాలిమి నాహుతిగాఁగ్రమంబునన్
వేలుచు చున్నవాఁ డభినివిష్టసుఖైకఫలాభికాంక్షియై. 35

క. చండజ్వరజజ్వరమునఁ
బాండురమును నైనమేను బాలిక! తాల్చెన్
దండధరుఁ డిపుడు సుమనగ
కాండౌజగకీర్తిభారకలితుఁడ పోలెన్. 36

క. బిసరుహాలోచన! సంధ్యా
ఘుసృణసమాలంభకర్మకుతుకారంభ

వ్యసనసముజ్జృంభిత యగు
దెస నేలెడురాజు నిను మదిం గావించెన్. 37

క. మదిరాక్షి! జలధి నశ్వా
వదనోత్థత మైనహవ్యవాహను పోలెన్
హృదయస్థానస్థిత మగు
మదనానల మబ్ధిరాజుమద మణఁగించెన్. 38

తే. తరుణి! తద్భుజమధ్యమధ్యంబునందు
నవమృణాళకదండఖండంబు మెఱయుఁ
దన్మనోమగ్నమదనాస్త్రతతులచేత
నక్షణంబ శతచ్ఛిద్రమైనభంగి. 39

వ. ఈచందంబునం ద్రిలోకతిలకులగునాదిశావల్లభులు భవదాయల్లకభరం బను వెల్లిమునుగం బాఱు నెల్లి నీస్వయంవరమహోత్సవంబని విని తపనసంకాశంబులైనవిమానంబు లెక్కియేతదర్థంబున నిజశుద్ధాంతకాంతాజనంబు విరహసంతాపభాజనంబుగా నిశితనిస్త్రింశనీకాశంబగునాకాశంబు డిగ్గి పాదార్పణానుగ్రహంబున మహీమండలంబు గృతార్థంబుగానిప్పుడిప్పురంబున కనతిదూరంబుననున్నవారు. యదృచ్ఛాగతుండైననన్నుం గనుంగొని నామనంబున సందేశాక్షరంబులువ్రాసి జంగమలేఖంబు గావించి నీసకాశంబునకుం బుత్తెంచిరి. కుసుమశరభిల్లశరశల్యవిశల్యౌషధీవల్లివగునిన్నుం బరిష్వంగంబు సేయను, ననంగలీలాలహరీతుషారం బగునీశరీరంబుసోఁకున నంతరంగపరితాపం బపనయింపను, నిష్ఫీతపీతాదర్పంబులగు నీయంగంబులపాంగంబులకు లేపం బొనర్పను, బ్రసవనారాచశరాసనాతివిభ్రమభ్రూవిలాసం బగునీముఖశ్రీసముల్లా

సంబునకు సుల్లసిల్లను, సుమనసికోదండచండాలసంప్రాప్తి దోషదూషితు లగుతమ్ము నీకటాక్షవిక్షేపసాంద్రచంద్రాతపాలోకంబుల నభిషేకింపను, భవచ్చరణకమలసేవాహిత మహత్త్వంబున మదనాపమృత్యుదేవతవలన నిజప్రాణంబులకుఁ బరిత్రాణంబుఁ గావింపనుం దలంచుచున్నవారు. కుశల ప్రశ్నపూర్వకంబుగా నాగీర్వాణులు నీకుం జెప్పు మనినపలుకులు గొన్ని గలవు వాని నాకర్ణింపుము. 40

క. ఆదిత్యుల మగుమాకును
నీదోర్లతికాయుగంబు నిర్భరసుఖవ
ర్షోదయకారణమై సం
పాదించుం గాక తరుణి! పరివేషంబుల్. 41

శా. ఔదాసీన్యము నుజ్జగించి విను వాక్యం బస్మదీయంబు మి
థ్యాదోషం బొకయింత లేమికఖిలాంతర్యామివై త్రైలోక్యమ
ర్యాదాస్థాపకుఁ డంగజుండు గుఱి యీయర్థంబునిక్కంబు నీ
పాదాంభోజరజఃప్రసాదములు మాప్రాణంబు లబ్జాననా!

శా. మాదివ్యత్వము నీకు నెత్తు మని సంభావింప సిగ్గయ్యెడిన్
వైదర్భీ! భవదీయరూపవిభవైశ్వర్యంబు మాభూమియం
దేదీ? దీనికిఁ బ్రత్యయం బిదియ పో యే మెల్లనుం గూడి నీ
పాదాంభోజము లాశ్రయించెదము తాత్పర్యంబు సంధిల్లఁగన్. 43

మహాస్రగ్ధర.—
త్వదరాళభ్రూత్రిలతాద్వం
ద్వమున మదనుఁ డోతన్వి ధన్విత్వ మొందెం

ద్వాదుదంచన్మందహాసో
దయము వనిత! కందర్పు జైత్రాస్త్రఁ జేసెం
ద్వదపాంగాలోకనశ్రీ
తరుణి! మరుని మత్స్యధ్వజుం గా నొనర్చెం
ద్వదధీనం బెల్ల సామ
ర్థ్యము రతిపతికిం బ్రామ్రబింబాధరోష్ఠీ! 44

శా. నీలావణ్యపయోధియందు నలరు న్నేత్రాబ్జముల్ నీమనో
జ్ఞాలాపంబులయందుఁ గర్ణములు నీయాలింగనప్రక్రియా
కేలి న్మేనులు నీముఖాస్వాదనసక్తి న్నాలుకల్ మాకు నో
బాలా! స్వప్నసమాగమంబుల నిశాపర్యంతయామంబులన్.

వ. అని బృందారకచతుష్టయంబు నీతోఁ జెప్పు మనెం గావున.

క. సురసార్థవాచికస్ర
క్పరిపాటీవిశదరసనపత్త్రుఁడ నగు న
న్నరవిందపత్త్రలోచన!
చరితార్థునిఁ జేయు కార్యసాఫల్యమునన్. 47

*చ. అమరపతి న్వరించెదవొ! హవ్యవహుఁ జరణంబు ద్రొక్కెదో!
శమనునిఁ జెట్టవట్టెదవొ! సాగరవల్లభుఁ బెండ్లియాడెదో!
ప్రమదము గౌతుకంబు ననురాగము పెంపును సొంపు
మీఱఁగాఁ, గమలదళాక్షి! యొక్కరునిఁ గైకొనుమా
యనుమాన మేటికిన్? 48

వ. అనిన విని యయ్యంబుజాక్షి యక్షిభ్రువవిక్షేపవిభ్రమంబున
ననాదరంబు దెల్పుచు నలవోకగా దిగీశసందేశం బాకర్ణించి
యారాజకుమారున కి ట్లనియె. 49

తే. ప్రశ్న మొక్కటి యొక్కటి ప్రతివచనము
యుక్తి యనుకూల మై యుండ దుభయమునకు
నేను నీవంశనామంబు లెవ్వి యనిన
నెవ్వరినో ప్రస్తుతించితి వింతతడవు. 50

క. ఒకచోటఁ బ్రకాశించియు
నొకచోట నిగూఢ యగుచు నొదవించెం గౌ
తుకలక్ష్మి నీసరస్వతి
ప్రకటయు గూఢయును నగుసరస్వతి వోలెన్. 51

తే. అధికతరు లైనఁ గాని దిశాధిపతులు
కౌతుకము నాకు నీవంశకథల యందు
దప్పి గొన్నట్టివారి కాదప్పి దీఱ
సలిలపూరంబు హితవొ? యాజ్యంబు హితవొ? 52

వ. ఏను జేసినప్రశ్నంబునకు నుత్తరంబు నీమీఁద నప్పె
యున్న యది యిప్పుడైన నాఋణంబుఁ దీర్చుకొనుము. భవా
దృశం బైననాయకరత్నంబు నేవంశంబు భరించె? నేవర్ణం
బులు నీపుణ్యనామంబునకుం బ్రకాశకంబు లైనయవి? యని
పరిమితంబుగాఁ బలికి కుండినసురేంద్రనందన యూరకుండు
టయు నన్నిషధమండలాధీశ్వరుండు. 53

ఉ. తామరసాక్షి! వంశకథ దప్పుల నుండఁగ నిమ్ము చెప్పఁగా
దేమిటికన్న నైజ మగుహీనత గల్గినఁ జెప్ప బొచ్చె ము
ద్దామత గల్గె నేని నుచితం బయి యుండదు సెప్పికొంట నే
డీమెయిఁ బ్రేష్యభావము వహించి నికృష్టత నేఁగు దెంచుటన్.

తే. ఇంతమాత్రంబు సెప్పెద నెఱిఁగికొనుము
నృపతికన్యవు గడు పూజనీయ వగుట

మైత్రి కలి సేయఁ దగ దేను మనుజవిభుఁడ
రాజవంశకరీరుండ రాజవదన! 55

ఉ. పే రడుగం దలంచెదవొ? భీమతనూభవ! యాచారముం
దూరము సేయు మెవ్వరికి దోషము తాఁదన పేరు సెప్పు టా
చారపరంపరాస్థితికి శాస్త్రము మూలము శాస్త్రచోదితా
చారవివేకహీనుఁ డగు జాల్ముని మెత్తురె పండితోత్తముల్?

వ. అదియునుం గాక 57

క. కువలయనేత్ర! సమక్ష
వ్యవహారంబునకు యుష్మదస్మత్పదముల్
శ్రవణశ్రావణయోగ్యము
లవుచుండఁగఁ బేరు సెప్ప నడుగఁగ నేలా? 58

సీ. అని శారదం బైనవనమయూరము వోలె
నహితాపకారకుం డతఁడు పలుక
రాజహంసియుఁ బోలె రమణీలలామంబు
పదములం దనురాగ మదయ మొంద
సమయోచితంబుగా సారస్య మొప్పారఁ
బలికె నిట్లనిమహీపాలుతోడ
నన్వయం బెఱిఁగించి యభిధాన మెఱిఁగింప
కునికి మ మ్మాదరించిన తెఱంగె?
తే. యనఘ? మము నీవు వంచింప నభిలషించె
దేము నేరమె వంచింప నిపుడు నిన్నుఁ?
బేరు సెప్పిన నీ కనాచార మేని
మాకు నాయంబె నీతోడ మాటలాడ. 59

తే. అన్యపురులతోడ నెయ్యంపుగోష్ఠి
యధిప! మముఁబోటిరాజకన్యకల కగునె?
యది కులాబలాచారసహాసనాస
హాతిసాహాసకౌతూహలావసథము. 60

క. తగవే కులకన్యలకును
మగవారలతోడ రూపమహనీయులతో
మిగులంగఁ దడవు లోపలి
నగళులలో మాటలాడ నయతత్త్వనిధీ. 61

వ. అనిన విని ప్రతిబంధిరచనాచాతుర్యంబునుమనంబునం దభినం
దించుచుఁ బ్రత్యుత్తరంబు వేఱొండు వెదకి పొడగాన లేక
యాలోకోత్తరచరిత్రుండు విదర్భరాజపుత్త్రిం గనుంగొని
నేత్రాంచలంబుల నలంతినవ్వు దొలంకాడ ని ట్లనియె. 62

సీ. వామాక్షి! మాక్షికస్వాదుపేశల మైన
పలు కేల యొరులపైఁ బాఱవైవఁ?
జంచద్రసామృతస్నానపేశల మైన
దృగ్విలాసముఁ జేర్చు దివిజులందు
సఫలంబు సేయు మత్సమధికాయాసంబు
నేను జెప్పినకార్య మిచ్చగించి
దేవతాపతిభక్తిఁ దిరముగా మది నిల్పి
ప్రకటకల్యాణవైభవము నొందు

తే. వెలఁది! నామీఁదఁ గడుఁ గృపావిలసనంబు
నాటి చూచినచూపుమన్ననయచాలు
నాకుఁ గా నుద్ధరింపుము నాకవిభుల
హస్తములు మోడ్చి వేఁడెద నాదరమున. 63

తే. ఇందుబింబాస్య! నారాక కెదురుచూచు
నయనములు వేయు విరియించి నాకభర్త
యుదిలకొనుచున్నవా రాత్రినున్న ముగురుఁ
గాలయాపనసేయఁగాఁ గాదు నీకు. 64

చ. *హరిహయుఁడేమియయ్యెనొకొ డా! మదనానలతాపవేదనన్?
వరుణుఁడు విప్రయోగమున వాడఁడె యింతకు?దండపాణి
ద్వావిరహాభరంబున న్మిగుల వేఁగఁడె? నొవ్వఁడె వీతిహోత్రుఁ
డుం, బరిసరకేళికాననసమాగతమందసమీరణంబులన్. 65

వ. అనిన విదర్భరాజకన్యక యారాజకుమారున కిట్లనియె. 66

తే. †అలఁతినవ్వు ప్రగల్భతాహంకరణము
కాదు కాదంట వాచావిగర్హణంబు
పలుకకుంట తిరస్కారకరణముద్ర
గానఁ బ్రత్యుత్తరం బిచ్చుదాన నీకు. 67

సీ. అమరాంగనాసంగమాభిశోభితుఁడైన
హరి కేల మానుషీపరిచయంబు?
యాదకూటకలాప మర్హమే కలవాని!
కే నర్హనే నిర్జరేశ్వరునకు?
కామింతునే యేను వైమానికాధీశు
హస్తిఁ గామించునే హరిణరమణి?
నఖిలలోకాధీశుఁ డమరేంద్రుఁ డెక్కడ?
నే నెక్కడ వరాటి నెన్నిచూడ?

† 'కలికినవ్వు ప్రగల్భతా కారణంబు' అని పా.

తే. నలపతివ్రతనైనయేఁ దలఁప నొరునిఁ
దివిరి నిందించి యేఁ బ్రస్తుతించి యేని
నలినబిససూత్రమును బురంధ్రులతలంపు
సమము త్రెయ్యును లవచాపలమున నైన.

చ. అటు దగునే సురేశ్వరునియంతటివాఁ డఖిలాప్సరోంగనా
విటుఁ డొకమర్త్యభామినికి వేడుక సేయుచు నున్నవాఁడు!వి
స్ఫుటబహురత్నభూషణవిభూషితు లయ్యెడు రాచవారికిన్
గటకట యారకూటకటకంబు రుచించునొ కాకయొక్కెడన్.

మ. వినుమీ నాదుప్రతిజ్ఞ తత్పరత ,నుర్వీనాథ! యేనైషధేం
ద్రు నవశ్యంబు వరింతు నాధరణినాథుం డాత్మ నన్నొల్లఁడే
ననుమానింపక యిత్తు నవ్విభునకుం బ్రాణంబు సద్భక్తిమై
ననలోద్బంధనవారిమజ్జనవిధావ్యాపారపారీణతన్. 70

తే. అనుచుఁ దీక్ష్ణంబుగా భీమతనయ పలుక
నెలుఁగువిను వేడ్కఁ గోయిల నెగిచినట్లు
విబుధరాజప్రసంగంబు విస్తరించి
మఱియుఁ బలికింపఁ దలఁచి యమ్మనుజవిభుఁడు. 71

వ. వెండియు దమయంతి నుద్దేశించి. 72

క. నిఱుపేదయింటి కేటికిఁ
బఱతెంచు నిధాన? మట్లు పఱతెంచిన యే
నిఱుపేద యభాగ్యతఁ దలు
పిఱియఁగ నిడు కాక చొరఁగ నిచ్చునె దానిన్. 73

సీ. ముగ్ధత్వమునఁ జంద్రముఖి పరాఙ్ముఖి వయ్యె
దేల భాగ్యంబు నిన్నెదురుకొనఁగ ?

నమృతాంధసుల నొల్లనను మానవియుఁ గల్గె
 నీలాగుఁ గంటిమే కాలగతుల?
యాగాదిదుర్లభం బైనదేవత్వంబు
 నీ కొల్లఁబా టయ్యె నేఁడు సూడ
రసయోగమున సువర్ణత్వ మొందుట మేలొ?
 యినుము దాఁ దానగ్గొ యునికి మేలొ?
తే. యకటకట! సర్వగీర్వాణమకుటఘటిత
మణిగణవిభాసమానకోమలపదాబ్జ
సురగణాధీశు నొల్లక నరుని నొకని
నభిలషించెదుని న్నేమి యనఁగఁ గలదు? 74

సీ. రజ్జువల్లరిమీఁదఁ బ్రణయంబు గల దేని
 యంతరిక్షుం బెలువారి వరించు
నగ్ని కాహుతిగాఁగ నాత్మఁ గోరుదువేని
 జాతవేదునియదృష్టము ఫలించు
సలిలప్రవేశంబు సమ్మతించెద వేని
 నంబుధీశ్వరుఁడు పుణ్యంబు సేయు
నెబ్భంగిఁ బ్రాణ ముపేక్షించితేనియు
 వైవస్వతుని కబ్బు వాంఛితంబు
తే. ఘట్టకుటికాప్రభాతంబుక్రమము నంది
దమసహోదరి నీకు నయ్యమరవరుల
నొల్ల ననియును దుదిఁ బొందకుండ రాదు
సమ్మతింపుము నామాటచలము మాని. 75

తే. ఒల్ల ననుమాట కర్థమో యుత్పలాక్షి!
వలతు నను మాటగాదుగా వక్రరీతి?

విధి నిషేధరూపంబు భావించియున్న
విధియయగు వ్యంగ్యవాసనావిలసనమున. 76

వ. ఇవ్విధం బగునేని. 77

సీ. వెలఁది! యైరావతద్విపకుంభకుచకుంభ
సంభారహారిదధీశ్వరుని వలతొ?
జలజాక్షి! నిఖిలతేజస్విలోకములకు
నగ్రగణ్యుండైనయనలు వలతొ?
తరుణి! లోకాలోక ధర్మసంస్థాపన
ప్రాగల్భ్యనిధి ధర్మరాజు వలతొ?
పల్లవాధర! విధిప్రథమసర్గాధ్యక్షు
సప్తపాథోనిధిస్వామివలతొ?
తే. వైభవంబిచ్చగించి పావనతఁ గోరి
ధర్మశీలత యర్థించి నిర్మలత్వ
మాసపడి వీరిసలువురయందు నొకని
వేఁడుమా చూచెదను నీవివేకశక్తి. 78

తే. అని నృపాలుండు వలుక హాస్తాంకసుప్త
కోమలైకకపోలయై యామృగాక్షి
వినియు నొకరీతి నొకభంగి విననిదయ్యె
వలచియును నొల్లకయును దద్వాక్యసరణి. 79

వ. చింతాక్రాంత యయి యొక్కింతతడవు తలవంచికొని విచా
రించి పదంపడి నిట్టూర్పు నిగిడించి యాయిందువదన యా
రాజకందర్పునిం గనుంగొని సవిషాదంబుగా ని ట్లనియె. 80

ఉ. నీచరితంబు చూడ నతినిష్ఠుర మయ్యెడు లోకపాలదు
ర్వాచికసూచికాంకుర పరంపరఁ దూర్చెదు మాటిమాటికిఁ

నా చెవులందు నీకుఁ దగునా యిటు సేయఁగఁ? దప్పనంటి బా
ధాచరణంబు నైజము కదా తలపోయఁ గృతాంతదూతకున్.

సీ. ఇదె యెల్లి కల్యాణ మేతెంచుచున్నది
యీయవాచికవార్త లిపుడు మాను
వర్ణింపు నిషధభూవరుని నోపితి వేని
నీదోష మఖిలంబు నెడలుఁగాని
యుండు నీ విచ్చోటి నూఱట నేఁ డెల్లి
సురల కిప్డేమి వేగిరము వచ్చె?
నలునిరూపచ్ఛాయ దిలకించె నీ యందు
హంస సూపినచిత్ర మాత్రఁ దలఁప

తే. హస్తములు మోడ్చి వేఁడెద ననఘ! నిన్ను
మాను మిటఁబట్టి యే నీకు మాన్య నేని
పాకశాసనముఖ్యదిక్పాలవర్య
పాణిపీడనకార్యసంప్రార్థనంబు. 82

క. ఈరీతి నాతలోదరి
సారతరసుధార్ద్రసారసప్రసవరసా
సారసరసోక్తిసరణి మ
హారాజకుమారునకు నుపాయన మొసఁగెన్. 83

ఉ. మైత్రియుఁ బ్రేమయున్మనసు మచ్చికయున్మెఱయ న్వరాటరా
ట్పుత్రిక వల్కిన న్నిషధభూపతి దైవతకార్యకల్పనా
పాత్రము దప్ప నీ కెలమి సొంపు మదిం దలఁపోల్చి చిత్రవా
క్సూత్రశిఖండినందనుఁడు చేడియ నల్లనఁ జూచి యిట్లనున్. 84

సీ. హరి కల్పవృక్షంబుఁ బ్రార్థించి నిన్నుఁ గోరి
దివికి రావించిన దక్కు గలదె?

సర్వకామద మైన సప్తతంతువున ని
న్నగ్ని గైకొనిన నే మనఁగఁ గలదు?
తనయొద్ద నున్న వాతాపితాపసునిచే
నిను నార్కిచరముగాఁ గొనిన నెట్లు?
కాంక్షించి యడిగినఁ గామధేనువు నిన్నుఁ
ద్యాగంబుగా నీదె యంబుపతికిఁ?
తే. గాన వినుమేను జెప్పినక్రమము లెస్స
యతివ! వరియింపు వేల్పులయందు నొకని
భక్తి దివిజులచిత్తంబు పట్టుకున్న
నంతరాయంబు పుట్టుఁ గార్యముల కెల్ల. 85

వ. అని పలికిన నప్రతివిధానం బైనప్రియావాప్తివిఘాతంబున
హృదయంబు గలంగిన. 86

సీ. ప్రవిమలాక్షినభోనభస్యాంబువములకు
నవవృష్టిధారలై యవతరిల్లి
యాకర్ణదీర్ఘనేత్రాంభోరుహాములకుఁ
గమనీయనాళభావము భజించి
కలితకజ్జలత ముక్తాహారలతలలో
హరినీలరత్ననాయకతఁ దాల్చి
లలితవక్షోజకుట్మలచుంబనంబున
మధుపదంపతులసామ్యంబు వడసి
తే. వేఁడియశ్రులు నిగుడంగ వెక్కివెక్కి
యేడ్వఁ దొడఁగె లతాంగి పృథ్వీశుమ్రోల
మృదులపరివేదనాక్షరోన్మిశ్రమధుర
కంఠకాకువికారకాకలిక యలర. 87

వ. ఇట్లు గద్గదికానిరుద్ధకంఠనాళుండై యబ్బాల యశ్రుకణం బులు గొనగోళ్ల మీటుచుం దల వాల్చి యేడ్చుచున్నం గనుంగొని దివిజోపకారకార్యప్రయోజనసం స్తంభితంబైన విప్రలంభవేదనాభరం బప్పు డుద్దీపితం బై భరింపం గొలంది గాక విశ్వంభరావల్లభుండు మనంబున సంక్షోభించి విభ్రాం తుండై తన్నునుం దనవచ్చినకార్యంబునుం దన్ను బుత్తెంచిన వేల్పులను మఱచి యవస్థావశంబున నుచితానుచితవివేకంబు దప్పుటయు భావనానిరూఢంబు లైన ప్రియావిలాపంబులు వికల్పించుచు ని ట్లనియె. 88

నలుండు దమయంతికిఁ దననామాదుల నెఱిఁగించుట

క. ఏమిటి కేడ్చెద? వానన
తామరసం బెత్తి చూడు తరుణీ! నన్నుం
గోమలకటాక్షవీక్షా
దామకమున వీరసేనుతనయుని నలునిన్. 89

తే. కాంత! యశ్రుబిందుచ్యుతికై తపమునఁ
దివిరి బిందుచ్యుతకకేళిఁ దవిలె దీవు
సారెసారెకు నాదుసంసారమును స
సారముగఁ జేయుచు మసారసారనయన! 90

వ. చెలువ! చెక్కుటద్దంబునం జేయిడి యేల చింతించెద? వేటికిం బల్లవపాటలం బైనయధరంబు బీఁట లెగయ వేఁడినిట్టూర్పుగాడ్పులు నిగిడించెద? వేకతంబున గద్గదిక నొందెద? వేకారణంబున నశ్రుకణంబు లురుల నేడ్చెద? వీసంతాపంబునకు నేది హేతువు? దప్ప నాడం గదా! యాత్మనిహ్నవం బపరాధం బొక్కొ? శుద్ధాంత

ప్రవేశంబు దోసంబో? దేవదూత్యంబు ప్రత్యవాయంబో చెప్పుము. సేవకులకుం దప్పు గలదే? కలదేనియుం గిరీటమాణిక్యమయూఖపుంజంబులఁ జరణకంజంబుల నివాళించెద, ననుగ్రహింపుము. కృపాదృష్టిదానంబునకు బద్ధముష్టివి గాకుము. వదనంబు వికసించుంగాక. హృదయంబు ప్రసన్నంబు గావలయు. సృక్వభాగంబుల మందహాసలవంబులు గందళించుం గావుత. భ్రూలతాంచలంబులు లీలాచంచలంబులయ్యెడు, నపాంగప్రాంగణంబులం దరంగితంబు లగుకలికిచూపులు నాపయిం బొలయింపుము. బాష్పధారావృష్టివ్యపాయంబున దరహసిత చంద్రికాలోకంబు ప్రకాశింపందగు మధురవచోమృతంబు చెవులకుం జవిజూపు, మాలింగనం బపేక్షించెదఁ, జుంబనంబు దయసేయుము. కుచంబులకుం బరిచర్యసేయ నిమ్ము. నఖాంకురనవశశాంకరేఖాభ్యుదయంబు పయోధరోత్సేధశిఖరికూటంబున ఘటియింపం జేయ ననుమతింపు మని మన్మథోన్మాదంబునం బలికె యారాజమన్మథుండు. 91

తే. కొంతదడ విన్వీథంబున భ్రాంతిఁ బొంది
యంత సంప్రాప్తసంస్కారుఁ డగుచు నాతఁ
డమరకార్యంబు విచ్ఛిన్న మగుటఁ దలఁచి
యంతరంగంబులోన ని ట్లనుచు నుండె. 92

దూత్యము సెలవేరమికి నలందు చింతిల్లుట

క. ఏమి యని తలఁతు రొకో సు
త్రామప్రముఖు లగుసుర లెదర్ఁ నిఖిలాంత

ర్యాములు దమకార్యంబే
నీమెయి విభ్రాంతిఁ బొందె-యిటు చెలుచుటకున్? 93

క. పేరు ప్రమాదవశంబునఁ
బేరుకొనుట కల్ల యయ్యె బృందారక కా
ర్యారంభోదయమున కది
యారూఢం బైనవిఘ్న మై ఫలియించెన్. 94

ఉ. ఆదిఁ బరోపకారపరులై చరియించినయట్టి యాంజనే.
యాదులఁ బోల నైతి నిపు డక్కట దైవతకార్యసిద్ధివి
చ్ఛేదము నొందె నేమి యని చెప్పుదు నింక నమర్త్యపం క్తి? కు
న్మాదులు సంఘటింపఁగ సమర్థులె యెందుసురాయబారముల్?

తే. వగవ నేటికి? నే మన వచ్చు నిపుడు?
చేతనాహానిఁ గార్యంబు చిన్నవోయెఁ
జేతనాహాని దైవంబుచేత వచ్చె
దైవగతి దాఁట వచ్చునే దేవతలకు? 96

*తే. అని విచారించుచుండె నయ్యవనినాథుఁ
డంతకును మున్న నలునిఁగా నతని నెఱిఁగి
యెదురుగద్దియ డిగ్గి పృథ్వీశతనయ
యవనికాంతరమున నోలమాసగొనియె. 97

క. ఆనందబాష్పధారల
వానకుఁ బులకములయుద్భవమునకుఁ దగ న
మ్మానిని గదంబలతికకుఁ
దా నెచ్చెలి వోలె నుండెఁ దదవసరమునన్. 98

దమయంతిమాఱుగాఁ జెలియ నలునితో ముచ్చటించుట

వ. ఇత్తెఱంగున నమ్మెఱుంగుఁబోఁణి తెరమఱుంగున నుండియు లజ్జావశంబునఁ బలుక నేరక సమయోచితంబు లగుభాషణంబులు చెలికత్తియకుం గఱపి పుత్తెఱ నబ్బోటి నిషధరాజుం జేరి యి ట్లనియె. 99

తే. అర్థిసాధారణమునకు నభయ మిత్తు
వజ్రపాతంబు ఘోరమై వచ్చినపుడు
నతనుపూఁదూపులకు భయం బందియున్న
నాకు నభయంబుఁ గృప సేయ నీకు బరువె? 100

ఆ. ఆత్మ కాండకారుఁ డగు వసంతునకు నె
య్యంపుఁజుట్ట మైనయంగభవుని
నిండుమదిఁ దలంపు చండాలజాతిగా
వానికై యభీతిదాన మొసఁగు. 101

మ. అనుచున్ సారఘసారసారణికి నెయ్యంపుం జెలిం బోనితి
య్యనివాక్యంబున బోటి భీమసుతమాత్రై యేర్పడం బల్కి
నన్, మన మాహ్లాదముఁ బొందుచుండఁగను భూనాథుండు
గంభీరతన్, వినఁ డయ్యెన్ సురరాజకార్యఘటనావిఘ్నంబు
వాటిల్లుటన్. 102

వ. చెలికత్తెయుం గ్రమ్మఱి దమయంతీసమీపంబునకు వచ్చె నప్పుడు. 103

నలదమయంతులు చింతిల్లుట

ఉ. ‘నిక్కపుమాట గానిధరణీపతిముందట నేమి యంటివో
పెక్కులు మాట? లే’ ననుచు భీమతనూభవ నెమ్మనంబునన్
స్రుక్కుచు నుండె నైషధుఁడునుం గడు జింత వహించె

విన్ననై, 'యక్కటా! దేవకార్య మిటు లాఱడిపోవునె'
యంచు నాత్మలోన్. 104

నలదమయంతులకడకు హంసవచ్చుట

ఉ. ఆసమయంబునం గనకహంసము హంసపథంబు డిగ్గి యు
ద్భాసితకాంతి నల్దెసలఁ బర్వఁగ నచ్చటి కేగుదెంచెఁ జిం
తాసముపేతులై విగతధైర్యత నివ్వెఱఁగంది యున్న యా
రాసుతు రాజకన్య ననురాగ మెలర్పఁగ నుద్ధరింపఁగన్. 105

వ. ఏఁగుదెంచి పూర్వపరిచయంబున నుర్వీకాంతునిచేతను దమ
యంతిచేతను సంతోషసంభ్రమసహితంబుగా నుపలాలనంబు
వడసి యమ్మరాళంబు నలుని కిట్లనియె. 106

హంస సాంత్వనవాక్యములఁ బలుకుట

శా. నీయంతఃకరణంబు నిర్మలము వర్ణింపంగ శక్యంబె నీ
భూయస్త్వంబు? జగత్ప్రసిద్ధములు నీపుణ్యప్రభావంబు లే
లా యీలాగునఁ జింత నొందెదవు? కార్యావాప్తి యౌఁ
గాదటే!, యాయింద్రాదులు నీనిజం బెఱుఁగరే యజ్ఞాతి
వంశాగ్రణీ? 107

వ. అని వైదర్భిం గనుంగొని. 108

తే. అమ్మ! దమయంతి! యంతరంగమ్ములోన
మాను సందియ మీతండు మగఁడు నీకు
నాఁడె దా నానతిచ్చినవాఁడు బ్రహ్మ
తద్వచనమున కన్యథాత్వంబు గలదె? 109

వ. అని యయ్యిద్దఱ నుద్దేశించి దంపతులకు మేలు గావలయు,
నుత్తరకర్మం బవిఘ్నం బగుం గాక, నాకును సరసిజాసను

ప్రసాదంబున సకలభూతాంతర్వర్తనంబులు దెలివి పడి యుండు, నిప్పుడు చింతాభరంబులం గలంగిన మీయంత రంగంబులవిషాదం బపనయింప వచ్చితిఁ బోయి వచ్చెద నని సముచితప్రకారంబున నయ్యిరువురిచేత ననుజ్ఞాతుండై పతంగపుంగవుం డరిగెఁ దదనంతరంబ. 110

క. కనకమరాళం బీ క్రియ
ననుకంపను బుద్ధి సెప్పి యరిగినవెనుకన్
మనమునఁ జింతాభరములు
జనపతికి విలాసవతికిఁ జయ్యనఁ బాసెన్. 111

నలుని మనశ్శుద్ధి

వ. అప్పుడు నృపాలుండు హేమమరాళసాంత్వనాలాపబలం బున నెట్టకేలకు మనంబునం జేవ దెచ్చుకొని దిక్పాలురం దలంచి నమస్కరించి యిట్లనియె. 112

ఉ. భావములోన దంభ యగుభక్తికి సంతస మందుఁడొండెనొం
డే విధియింపుఁ డిప్పుడ కడిందిగ దండము దప్పు గల్గె నే
నీవిరహానలంబునకు నింకిట నేమియు నోర్వ లేఁ జూఁడీ
దేవతలార! మన్మథునితీవ్రశరంబులు గాఁడి పాఱఁగన్. 113

వ. అనంతరంబ తిరస్కరిణీతిరోహితగ్రామై యుండి యక్కుండి నేంద్రనందన రాజనందనున కిట్లనియె. 114

ఉ. ఓరజనీక రాన్వయపయోధినిశాకర! యేఁ బతివ్రతన్
గూరిమి మీఱ నొక్కరునిఁ గోరి వరింపఁగ నున్న వారి కె
వ్వారికి నెగ్గుగాఁ దలఁప వచ్చునె? నిన్ను వరింతు నెల్ల బృం
దారకులు న్నృపాలురునుదక్కినవారునుజూచుచుండఁగన్.

తే. ఎల్లలోకధర్మంబులు నెఱింగియుండి
యేల సేయుదు రమరేంద్రు లీసునంబు?
నాడి వారికి వంచనం బాచరించి
తదనుమతి నిన్ను వరియింతుఁ దథ్య మిదియ. 116

నలునిమనశ్శుద్ధికి దేవతలు సంతోషించుట

మ. అను తద్వాక్యము విస్తరింపఁ బడ వేకాంతంబునన్వారువా
యునపోక ల్వీను దంతరిక్షగతులై యింతంతటం గానరా
క నిగూఢాకృతి నున్న దేవతలు తత్కాలంబునన్ రాజనం
దను నంతర్హితుఁ జేసి చేరి రతఁడుం దారు న్నిజస్థానమున్.

తే. నలునిదూతత్వ మిబ్భంగిఁ దెలియఁ జూచి
తన్మనశ్శుద్ధి నొంది రాత్మల ముదంబుఁ
దమ్ము నక్కాంత వరియింపఁ దలఁపు లేమి
ఖేద మందుచు నుండి రింద్రాదిసురలు. 118

స్వయంవరాగతవర్ణనము

వ. అనంతరంబ కామరూపం బగునాసుత్రామాదిచతుష్టయం బుపాయాంతరంబున దమయంతి నయింపం దలంచి వంచ నానైపుణ్యంబున నలరూపంబులు ధరించి స్వయంవర కాలంబు ప్రతీక్షించుచుండిరి. నిషధరాజును భోజరాజాధి కారపురుషనిర్దిష్టంబైన రమ్యస్థలంబున సపరివారుండై బృందారకానుమతి వడసి వసియించె నయ్యవసరంబున. 119

మ. చతురంగధ్వజినీసమేతు లగుచున్ శస్త్రాస్త్రవిద్యానిధుల్
రతిరాజప్రతిమానమూర్తులు శరచ్చంద్రార్కేందుబింబాననుల్
చతురంభోధిపరీతవిశ్వవసుధాచక్రంబునం గల్గురా
సుతులెల్లం జనుదెంచి రవ్వైభవముం జూడంగనొక్కుమ్మడిన్.

తే. రాజవంశజుఁ డై యుండి రానివాఁడు
కామబాణంబులకు గుఱి గానివాఁడు
సప్తసాగరమధ్యభూచక్రమునను
నృపకుమారుండు లేఁడు పన్నిదమునకును. 121

క. కొందఱు తరుణి వరింపం
గొందఱు బలిమిని హరింపఁ గొందఱు సూడ్కిం
గొందఱు భూషింపను నృప
నందను లేతెంచి రుబ్బున స్మహామునకున్. 122

తే. తిలలు సైనెత్తి చల్లిన దిగుపఁబడని
యంతసందడి పెంద్రోవలందుఁ గలిగె
నఖిలదేశంబులం దుండి యవనిపతులు
వైభవాలోకమునకును వచ్చుచుండ. 123

క. తఱచగు పెనుసందడిలో
నిఱుకటమునఁ బడ్డనృపతి యీవగ్రహముం
బోఁ జఱుగుట యభీప్సితార్థం
బఱచేతికి వచ్చినట్లు యని వెత కుడుచున్. 124

తే. వెనుక ముందటిసమ్మర్దమునఁ గరంబు
దందసిలి మధ్యమున నున్న ధరణివిభుఁడు
యంత్రసిద్ధార్థభావంబు నలమికొనియుఁ
దను నసిద్ధార్థుఁగా నాత్మఁ దలఁచుచుండు. 125

ఉ. కోటిభుజంగపుంగవులు గొల్వఁగ వందిజనంబు ముందటం
జాటువు లుగ్గడింప ఫణిసంభృతరత్నదిశావిభాసియై
వీటిజనంబు లెల్లఁ దను విస్మయ మొంది కనుంగొనంగఁ గ
ర్కోటకుఁ డేఁగుదెంచె మదఘూర్ణితపాటలనేత్రపద్ముఁ డై.

మ. ప్రమథాధీశభుజాంతరస్థలఘనప్రాలంబహారం బద
భ్రమనోజ్ఞాకృతి వచ్చె వాసుకి ఫణాపర్యంతమాణిక్యమం
జుమయూఖాంకురపుంజమంజులనభస్కాండై భుజంగాంగనా
సముదాయం బిరువంకఁ బాడఁగ యశస్సంగీతగాథావళుల్.

వ. ఇంద్రాగ్నియమవరుణు లేతెంచిరి తక్కినదిక్పాలురు రారైరి
యది యెట్టి దనిన. 128

సీ. రాజునొజ్జలమంత్రరక్షాబలంబున
రాఁబొందు గా దయ్యె రాక్షసునకు
దమయంతితోడ నేత్రస్పర్ధకతమున
నిజవాహనము రామి నిలిచె గాలి
తనరూపు కైలాసదర్పణంబునఁ జూచి
వ్రీడఁ గుబేరుఁ డివ్వేడలఁ డయ్యె
నర్ధనారీశ్వరుం డగుట నీశానుండు
సామేనియంకిలిఁ జాఁగ కుండెఁ

తే. దాను వహియించుధాత్రి కైవ్వానిఁ బెట్టి
వచ్చునటుగాన శేషుండు వచ్చు టుడిగె
ముదిసి ముప్పునఁ బెండ్లికై మొగము వేల్పు
దగవు గాదని రాఁడయ్యెఁ దాతవేల్పు. 129

తే. ఇట్లు త్రైలోక్యవాసులు నేఁగుదెంచి
రమ్మహోత్సవమునకు నయ్యవసరమునఁ
బ్రసవసాయకనారాచపక్షజాల
మహితవాతూలతూలాయమాను లగుచు. 130

వ. అప్పుడు కనకమయరమ్యహర్మ్యనివేశంబులం గ్రథకైశికా
ధీశ్వరుండు విడియింపనభినవాభ్యాగతు లగుమూఁడులోకం

బులరాజులును విడిసిరి, యారాజసమాజంబు గుండిన నగ రంబునందుఁ బుండరీకాక్షుజఠరంబునందు భువనత్రయంబు గుంభసంభవుహస్తాంభోరుహంబునందు నంభోధిచతుష్టయం బును బంచాక్షరంబునందుఁ బరమేశ్వరుండునుం బోలె నసంబాధంబై యుండె. నానావిచిత్రచిత్రంబు లగుపురభవన భిత్తిభాగంబులతోడి ప్రతిస్పర్ధం బోలె నాకాశభాగంబు మూర్ధాభిషిక్తమకుటరత్నప్రభాభారంబులచేతఁ గిమ్మీరితం బయ్యె, నమ్మహోత్సవాడంబరం బవలోకింప నంబరంబునఁ బీతాంబరత్ర్యంబకులు దేవతాకదంబంబును గొలువఁ గొల్వుండిరి. కందళితహృదయారవిందం బైనసనకసనందనాది యోగీంద్రబృందంబును మందపాలబకదాల్భ్యరైభ్యకభర ద్వాజగౌతమప్రభృతి మహర్షిసందోహంబును దగిన నెల వుల నుండి విలోకించుచుండె. సముత్తుంగమంగళమృదుమృ దంగనినాదభంగీతరంగితసంగంబై విబుధవారాంగనాజనంబు నభోరంగంబునఁ బ్రవర్తించె నెండియు. 131

చ. మగువలు భూమిపాలురకు మాటికిమాటికి వైచుకుంచెల
న్నెగసినమారుతౌఘములు నిర్భరసౌరభసంప్రదాయ మిం
పుగ నధివాసధూపములఁ బ్రోది యొనర్చుచు నిచ్చె నర్చనల్
గగనమున న్మహోత్సవముఁ గన్గొన వచ్చినదేవపంక్తికిన్.

తే. అల్లనల్లన వీచె మంచాంతరములఁ
జంచదవనీంద్రచయచంద్రచందనామ
లేపవై పథ్యకుసుమమాలాపరాగ
గంధవహ మైన చల్లనిగంధవహము. 133

సీ. పైపై మహోత్సవప్రత్యుత్సుకంబులై
తమమీఁద నృపులనేత్రములు వ్రాల
నలినాప్తుసన్నిధి నక్షత్రములువోలె
రాజులు దనమ్రోలఁ బ్రభలఁ దొఱఁగ
నఖిలలోకమనోజ్ఞమై యొప్పుతనమూర్తి
చిత్తసంభవు నైన సిగ్గునఁబఱుపఁ
దనప్రాభవము దేవతాకోటి నైనను
బాణిపద్మములు మోడ్పంగఁ జేయ

తె. వలపు మిగులఁ బరంపరానవరణయోగ్య
రమ్యశృంగారకలితుఁడై రాజవీథి
నల్ల నేతెంచి యొక్కసింహాసనంబు
నధివసించెను నలుఁడు మంచాగ్రభూమి. 134

తే. కదిసి పరిపాటి మణిమంచకములమీఁద
రాకుమారకులై యున్న నాకవిభులు
నలునియమకంబులై యున్కిఁ దెలియఁ జూచి
తారు నవ్వేళ నలరూపధారులైరి. 135

ఉ. ఈసకలంబునం గలమహీపతినర్గము సున్న సుండనీ
యాసభ యొప్పె నప్డు నిషధాధిపుచేతఁ జతుర్దిగీశచే
ఖాసవలోకదివ్యవనవాటికి సర్వనగాఢ్య యయ్యు సు
ద్భాసితలక్ష్మి నొందున కదా యలకల్పకపంచకంబుచేన్. 136

వ. ఇవ్విధంబున సుమేరుభూధరకూటసన్నిభంబు లగుహాటక
మంచకంబులమీఁదఁ గర్కోటక వాసుకి ప్రభృతు లగు
పాతాళభువనవాసులును మేధాతిథిప్రధానులగు వసుధా
లోకవాస్తవ్యులును పాకశాసనపరేత రాజముఖ్యు లగు

త్రివిష్టపనిలయులును సుఖోపవిష్టులై యుండుటం గనుంగొని సంతుష్టాంతరంగుం డై భీమభూపతి తన డెందంబులోన నీయున్నయందఱు బృందారకసంకీర్తనీయచరిత్రులు వీరి కులశీలవృత్తవిభవంబు లెఱింగి వర్ణించి దమయంతికిం జూపి చెప్పం ద్రైలోక్యజనని నిత్యప్రగల్భవాచాల భగవతి భారతీ దేవిదక్కం దక్కినవారు నేర రని విచారించి యమ్మహాదేవి నిట్లని ప్రస్తుతించె. 137

భీమరాజు సరస్వతీదేవిం బ్రార్థించుట

దండకము. జయజయ జనయిత్రి! కల్యాణసంధాత్రి! గాన్ధర్వ విద్యాకళాకర్ణనాళాం, త్రివేదీవళీం సారసాహిత్యసౌహిత్య నిర్వర్తిత ప్రోల్లసద్వృత్తరజ్జా, మనేకాభిచారక్రియాహోమ ధూమావళీమేచకాథర్వణామ్నాయరోమావళిం; కల్ప శిక్షాక్షరాకల్పసాక్షాచ్ఛరిత్రాం నిరుక్తప్రయోక్త్రీం, భుజద్వం ద్వతా మశ్ను వానేనసంశోభితాంఛన్దసా జాతివృత్తప్రభేద ప్రభిన్నేన,విద్యామయీం త్వాం భజే. భగవతి! గుణదీర్ఘ భా వోద్భవాం సంతతిం సందధానం మహాశబ్దనిష్పాదవాక్య క్రియాశాస్త్ర కాఞ్చీకలాపం కటీమణ్డలే బిభ్రతీం, జ్యోతిషా హారదణ్డేన తారోదయస్ఫూర్తి విద్యోతమానేన విభ్రా జితా మాత్మ పక్షానురాగాన్వితాభ్యా ముభాభ్యాం చ పూర్వోత్తరాభ్యాం మహాదర్శనాభ్యాం ప్రతిష్ఠాపితోష్ఠ ప్రవాళాం, పరబ్రహ్మక ర్మార్థభేదా ద్విధాయ ద్విధా స్వం శరీ రం ప్రతిష్ఠాం పరాం ప్రాప్తయా చారుమీమాంసయా మాం సలేనోరుయుగ్మేన సమ్యక్పరాచ్ఛాదనంలాలయన్తీం, ముహుఃరంగ పత్త్రదానే గుణాన్వీత పూగాసకృత్ఖణ్డనప్రౌఢి మాధౌకమా

నేన దన్తాత్మనా తర్కతన్త్రేణ కామవ్యభిఖ్యాంముఖే ఖ్యాప యన్తీం, ధుర్యం దేవి! వన్దేతమాం త్వామహమ్. ప్రవీణా గృహిణి! మత్స్యపద్మాదిసంలక్షితం పాణిపద్మం త్వదీయం పురాణం, శిరస్త్రావకం నిర్మలం ధర్మశాస్త్రం, దలాభ్యాంభ్రువా వాం క్రియామన్త్ర రాజస్య,తద్బిన్దునాచిత్రకం ఫాలభాగేతవ ర్ధన్దునా తే విరిఞ్చిర్విపఞ్చీకలక్వాణనాకోణచాపం ప్రణిన్యే స్వయమ్. భవతు మమ సదా శుభం భారతి! త్వత్ప్రసాదాద సాధారణాత్సత్కృపాధారభూతం ప్రభూతమ్. నమస్సోమ సిద్ధాన్తకాన్తాననాయై, నమశ్శూన్య వాదాత్మ మధ్యాన్వి తాగ్యై! సువిజ్ఞానసామ స్త్యహృత్పఙ్కజాయై, నమస్తేఽస్తు సాకారతాసిద్ధిభూమ్నే, నమస్తేఽస్తు కైవల్యకల్యాణసీమ్నే, నమస్సర్వగీర్వాణచూడామణిశ్రేణిశోణ ప్రభాజాలబాలా తపస్మేరపాదామ్బుజాగ్యై, నమస్తే శరణ్యే, నమస్తే వరేణ్యే, నమశ్శర్మదాయై, నమశ్శాశ్వతాయై, నమో విశ్రుతాగ్యై నమశ్శారదాగ్యై, నమస్తే నమస్తే నమః. 138

వ. అని ప్రస్తుతించిన. 139

సరస్వతీసాక్షాత్కారము

మ. జగతీనాథుని ముందట న్నిలిచెసాక్షాత్కారముంబొందియా
జగదేక స్తవనీయ శారద శరచ్చంద్రాతపాలోకము
న్నగవుం దేటయు దివ్యదేహరుచియుఁ సమ్మేళనం బొంది చె
ల్వగుచుండఁ గరుణాపరాయణతనయ్యాస్థానమధ్యంబునన్.

ఆశ్వాసాంతము

శా. లాటీచిత్తసరోమరాళ! కుకురీలావణ్యలోలాత్మ! క
ర్ణాటీనృత్యకళావిలోకనసమారంభప్రియంభావుకా!

భోటీనేత్రచకోరచంద్ర! మగధీపుష్పాస్త్ర! చోళీకుచా
ఘాటస్థాపితమస్తకాంక! కుహళీగాఢాంకపాళిప్రియా! 141

క. మందారమంజరీమక
రందసుధామాధురీధురాధుర్యవచ
స్సందర్భరూపరేఖా
కందర్పా! పాండ్యరాజగజపంచాస్యా! 142

మాలిని. హరిచరణసరోజధ్యాననిష్ఠాగరిష్ఠా!
ధరణిభరదిధీర్షాధగక్కృత్యావహార్యవర్యా!
తరుణకమలనేత్రా! తల్లమాంబాసుపుత్రా!
విరహితమదశంకా! వీరనారాయణాంకా! 143

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్య పుత్ర సకలవిద్యాసనాథ శ్రీనాథప్రణీతం బయిన శృంగార నైషధకావ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.



శ్రీ రస్తు

# శృంగార నైషధము

## పంచమాశ్వాసము



పాదాంభోరుహవాసం

స్థాపీతమణిమకుటకటకఝళఝళనినదా

టోపవికంపితవిమత

క్ష్మాపాలకులాంతరంగ! క్ష్మామిడిసింగా! 1

వ. ఆకర్ణింపుము. 2

తే. అట్లు సాక్షాత్కరించిన యఖిలజనని

భారతీదేవిఁ జూచి భూపాలకుండు

నమ్మహాస్థానమున నున్న యఖిలజనులు

చేతులెత్తి ప్రణామముల్ చేసిరర్థి.

వ. అప్పుడు భోజరాజు తత్కాలవేద్యంబులగు శకునస్వ

రాదులయానుకూల్యం బెఱింగి నిజతనూజ నమ్మహాదేవిఁ

నప్పగించువాఁడై యంతఃపురపరిచారికాజనంబుల నియో

గించిన.

దమయంతి స్వయంవరాస్థానమున కేతెంచుట

సీ. అఖిలదిగ్దేశరాజాకర్షణక్రియా
మహనీయతరసిద్ధమంత్రవిద్య
యాకారరేఖాసముద్భూతికానన్య
సాధారణైశ్వర్యజలధివేల
నేపథ్యహీరప్రభాపూరనిర్మల
వారిబింబితనిజస్వచ్ఛకాంతి
సంకల్పభవదూతసదృశకర్ణాకల్ప
కల్హారసౌరభాగతమదాలి
తే. బహువిరోధిమణిప్రభాపల్లవాగ్ర
మల్లసంగ్రామఘురళికామండలాయ
మాననానాపరిష్కారమహితగాత్రి
మనుజపతిపుత్రియాస్థానమునకు వచ్చె. 5

తే. అతివపీతావదాతారుణాసితమణి
దీప్తికల్పితదేహోపదేహ యగుచు
సారగోరోచనాగంధసారఘుసృణ
మృగమదాలేపపునరుక్తి మేలుకొలిపె. 6

సీ. కర్పూరకస్తూరికాప్రవాహంబులు
ప్రవహింప లోచనప్రాంగణములఁ
గించిద్దిగంబరీకృతరదద్యుతి పెంపు
పలుకుబోటికి నైన భ్రాంతి గాఁగ
భూషామణివ్యాజమున నంగకంబుల
జనులచూపులు వినిశ్చలత నిలువ

మహనీయలావణ్యమధువు నెమ్మనముల
నాకంఠముగఁ గ్రోల నవనిభుజులు

తే. నలుఁ బ్రసూనచాపంబున గెలువలేని
యంగభవునకు శక్రబాణాసనంబు
బహువిభూషణరత్నశోభామిషమునఁ
దాను గల్పించుచంద మందంబు నొంద. 7

మహాస్రగ్ధర. చతురత్వంబొప్పఁ గాన
ప్సరస లుభయపార్శ్వంబులన్ బాడుచున్ రాఁ
జతురంతస్వైరయాన
స్థ యయి తరుణి యాస్థానముం జొచ్చి వచ్చెన్
శతపత్రాక్షీకరాబ్జో
చ్చలితధవళరుక్చామరాళీమరాళీ
కృతలీలాలాస్యకేలీ
కిసలయితకలాఖేలనం బొప్పు మీఱన్. 8

రాజులు దమయంతిసౌందర్యమున కచ్చెరు వందుట

సీ. దవ్వుదవ్వులఁ గన్ను తనివి పోవఁగఁ జూచి
పరమాద్భుతం బాత్మఁ బాదుకొల్పి
సకలాంగకంబులు జాదుకోఁ బులకించి
చే తొకింతుక యెత్తి చిట్ట మిడిచి
కదియ నాసాశిఖాగ్రమునఁ దర్జని మోపి
మూర్ధంబు గంపితంబుగ నొనర్చి
కడఁతెప్ప లొరయంగఁ గనుదమ్ము లరమోడ్చి
బొమదోయి యొక్కింతపాడవు సేసి

తే. లలనసౌందర్యరేఖావిలాసమునకు
నిచ్చు మెచ్చునిరా జొక్కఁడేని నరిది
యమ్మహాస్థానమున నున్న యఖిలవార్ధి
వలయితాశేషమేదినీశ్వరులయందు. 9

వ. ఇట్లు రాజులు పరమాశ్చర్యంబు నొందుచు నంతర్గతంబున.

తే. తరుణివదనంబు సాక్షాత్సుధాకరుండు
లలి నభంబు శశాంకుండు లాక్షణికుఁడు;
ముఖ్య మగుకామచాపంబు ముదితబొమలు
పువ్వు గుణమాత్రవృత్తి సద్బుద్ధి దలఁప. 11

చ. మడవక ముష్టియోగ్య మగుమధ్యముతో నెలవంక యైన
యప్పుడఁతుక భ్రూలతాధనువు పట్టి మనోభవుఁ డింత నుం
డియుణ్, విడుచున కాని మానఁ డిది నిక్కము షట్పదకీట
జుష్టమై, యుడుగక కమ్మధూళినుసి యొల్కుచు నున్న
పురాణచాపమున్. 12

తే. మగువతాటంకయుగ్మంబు మన్మథునకు
లక్ష్యయుగ్మంబు గాఁబోలు లలిఁ దలంపఁ
గడఁగి సవ్యాపసవ్యమార్గణము లేయ
నైనరంధ్రంబు గాదె తదంతరంబు! 13

క. రతిపంచబాణజాయా
పతికేళీసౌధశిఖరిపర్యంతసమం
చితకాంచనకలశము లీ
శతపత్త్రదళాయతాక్షిచారుస్తనముల్. 14

క. ఈసుదతి శిరీషకుసుమ
కేసరసుకుమార దీనిఁ గృతమతి నెమ్మేఁ

జేసెనొకో నలువ కుశా
ఖ్యాసకఠోరంబు లైనహస్తాగ్రములన్ ! 15

క. చనుఁగవ ఘనమో జఘనము
ఘనమో యని నడిమిచక్కిఁ గమిచి విధి గరం
బునఁ దూఁచె దీనిఁ గాకి
ట్లనువుపడునె వళులపేర నంగుళిరేఖల్? 16

సరస్వతి దమయంతికి వరణీయుల వర్ణించుట

వ. అని ప్రస్తుతించుచుండ ఘంటాపథంబున నేఁగుదెంచి యమ్మ
చ్చెకంటి తండ్రిపంపునఁ జతురంతయానంబు డిగ్గి భారతీ
దేవికిం బ్రణామంబు సేసిన. 17

క. ఆశాస్యము లైనయనే
కాశీర్వాదంబు లొసఁగి యఖిలేశ్వరలో
కైకకుటుంబిని శారద
యాశశిబింబాస్యమౌళి నక్షత లిడియెన్. 18

వ. ఇట్లు దీవించి చతురంతయానం బెక్క ననుజ్ఞ ప్రసాదించి. 19

తే. అవనిపతికన్యచతురంతయానమునకు
దక్షిణపుదిక్కునం దుండి దయ దలిర్పఁ
బలికె సనకాదియోగీంద్రభావ్యమాన
చరణపంకజ యైనయాసరసిజాక్షి. 20

దేవతలు

సీ. తొయ్యలి! వీరె వేలుపులు తూర్పునముప్పదిమూఁడుకోటు
లీ, యయ్యల వేలువేట గొనియాడఁగఁ బట్టుసహస్రవర్త
ముల్, నెయ్య మెలర్ప నిందొకరి నీ వరియింపఁ దలంచి

తేని యా, దయ్యము నెత్తికోలు తుది దాఁకుట గాదె సరో
జలోచనా ! 21

క. సంతానవాటికలును
జింతామణివేదికలును సిద్ధరసధునీ
సంతానంబులు వీరికిఁ
గాంతా ! విశ్రాంతికౌతుకస్థానంబుల్ 22

క. అనిమిషత నిన్నుఁ జూడఁగ
నినుమడి యగు నెట్టు లోకని కి వెల్పులలో
విను మమృతాస్వాదనమును
నినుమడి యగుఁ గాక యధర మీవాసఁగంగన్. 23

వ. అనిన విని యబ్బాల కేలుదోయి మొగిడ్చి ఫాలంబునం గీలు
కొలిపి వేలుపులకు వందనం బాచరించె, నప్పుడు శిబికా
ధరస్థు లగుపురుషులు సమాసన్న నాయకముఖవిషాదాను
మేయం బగుదమయంతిమనోవిరాగం బెఱిఁగి ప్రావృషేణ్య
పయోవాహంబులు రాజహంసావలిం బల్వలాంతరంబుల
వలనం బాపి మానససరోవరంబునుంబోలె మాంజిష్ఠమంజిమ
విగాహిపదోష్ఠలక్ష్మి యగునయ్యంగన భుజంగపుంగవుఁ
గదియం గొనివచ్చిరి. కంజభవుభామయు నప్పద్మదళాక్షికిం
బన్నగాధ్యక్షునిం జూపి యి ట్లనియె. 24



క. పరిరంభలగ్న గిరిజా
సురుచిరకుచఘుసృణపట్టసూత్రాంకముతోఁ
దరలాక్షి ! వీఁడు చంద్రా
భరణునకుత బ్రహ్మసూత్రపదవి భజించెన్. 25

తే. పాణికంకణమై యోగపట్ట మయ్యె
గంధగజయాన కోటీరబంధ మయ్యె
వింటికిని నారియై పెక్కువిధములందు
భూతభర్త భజించు నీభుజగవిభుఁడు. 26

తే. హరజటాజూటచంద్రరేఖామృతంబు
నబల! నీదగుదంతచ్ఛదామృతంబు
సమముగా రెండుజిహ్వలఁ జవులు సూచి
నేర్చెఁబో వీఁడు చవివాసి నిశ్చయింప. 27

ఉ. భావజకేళి వైభవముపట్టున నీచిగురాకుమోవి యా
శీవిషనాయకుం డితఁడు సేవ యొనర్చు టనర్థకారి గా
దో వనజాక్షి! యయ్యమృత మున్నది నీయధరంబులోన నే
లా వెఱవన్ సుధారసమునందు విషంబు పరిస్ఫురించునే?

చ. ఫణఫలకంబు విచ్చి కడుఁ బ్రన్ననిమే నెగయంగఁ జేయుచు
న్మణిమయపీఠమధ్యమున నాల్కలు గ్రోయుచు నున్నవాసు
కిన్, ఫణికులసార్వభౌముఁ గని భామినిమైఁ బులకించు
భావుకుల్, ప్రణయవికారమో భయముభంగియొ యంచు
మదిం దలంపఁగన్. 29

తే. తమ్ము వరియింప కునికి దీర్ఘమురోఁజా
నవాలఁ గ్రేడించి నడచిరి యానధరులు
దీర్ఘనిశ్వాసధారాప్రతీపపవన
వికటహాహానినాదావశకునశంక. 30

తే. ప్రకటమందాక్షసంకుచత్ఫణము లైన
యురగములయొద్దు వాపి యయ్యుత్పలాక్షి

యానధుర్యులు గదియించి రవనిభుజులఁ
గాల మలిఁ దమ్మిఁ బాపి చెంగలువఁబోలె. 31

పుష్కరద్వీపాధిపతి

వ. అప్పుడు పలుకుబోటి వరాటరాజకన్యకం గనుంగొని. 32

ఉ. ధీరతఁ బుష్కరాదు లగుదీవుల నన్నిటనుండి వచ్చియు
న్నారిదె శీతభానుదిననాయకవంశజు లైన రాజబృం
దారకు లిమ్మహారథులఁ దప్పక యిందఱఁ జూడ వమ్మ! శృం
గారరసైకసర్గరసికద్వ్యణుకోదరి! యాదరంబునన్. 33

తే. తరుణి! నిస్తంద్రపుష్కరదళనిభాక్షి!
పుష్కరద్వీప మేలు నీభూభుజుండు
నిర్మలస్వాదుసలిలాంబునిధివిహార
మతివ! యీతండు నీవును నాచరింపు. 34

క. భామ మగునాకభువనము
భామిని! సావర్తభావభవదద్భుతనా
భీమండల! యీనృపసు
త్రాముఁడు పాలించుదీవి ప్రథితవిభూతిన్! 35

శా. అందుండుర్ హిమవారిశీతలతలన్యగ్రోధవీథిన్ శతా
నందుం డంబుజదివ్యమందిరములోనం గర్ణికాపీఠికన్
సందర్శింపఁగ వచ్చి యున్ననిను నాసర్వేశుఁ డీక్షించి యా
నందంబున్మది నొందుఁగాక నిజనానాశిల్పవైచిత్రికిన్. 36

క. ఆవటమహీరుహం బా
దీవికి ఫలపత్త్రచిత్రదీప్తిస్ఫురణన్
భూవల్లభవరనందన
భావింపఁగఁ బించెగొడుగుభంగి భజించున్. 37

వ. అని పలికి భ్రూవల్లరివేల్లనవికారంబు చూచి యప్పల్ల
వాధర యతనినొల్లమి యెఱింగి యద్దివ్యాంగనాతిలకంబు.

తే. లలన! పొమ్మవ్వలికి నంచుఁ బలుకుటయును
బుష్కరద్వీపపతియాస్యపుష్కరమునఁ
దదనవాప్తిజఘనపరితాపవహ్ని
చిహ్న మగుకార్ష్ణ్యధూమ మీక్షింపఁబడియె. 39

శాకద్వీపాధిపతి

క. రాజాంతరాభిముఖ మా
రాజముఖి విమానవాహరయమునఁ జనుదుఁ
రాజీవగర్భగేహిని
భోజకులాభరణ మైన పొలఁతుకతోడన్. 40

వ. ఒక్కరాజుం జూపి యి ట్లనియె. 41

క. ఏకాతపవారణముగ
శాకద్వీపాంతరంబు సర్వముఁ బుణ్య
శ్లోకుఁ డితఁడు పాలించు ని
శాకరముఖి! హవ్యకవ్యడంబరుఁ జనపతి నితనిన్. 42

క. రమణి! రమణీయతనుతా
వమతాతను నతనుకీర్తివై భవు నితనిఁ
గమల గమలాత్ముఁబోలెఁ
బ్రమదం బారఁగ వరింపు పరికించి తగన్. 43

తే. వీనిఁ గులశీలశాలి శాలీనతాన
తంబు నాననచంద్రబింబంబు నెత్తి
బాల! వీక్షింపు మేచకోత్పలపలాశ
మాలికలఁ బోలులలితదృగ్జాలకముల. 44

సీ. అతినిర్జరేశ్వరంబై యనశ్వర మైన
యైశ్వర్యమున రాజ్య మనుభవింపు
చంచచ్ఛుకచ్ఛదచ్ఛాయాశ్రయం బగు
శాకవృక్షమునీడఁ జలుపు క్రీడ
పాలమున్నీటిలో ఫణిరాజశయ్యపైఁ
బవ్వళించినశార్ఙ్గపాణిఁ గొలుపు
పొడుపుగుబ్బలిమీఁదఁ బూర్ణిమారాత్రులం
దొనరింపు చంద్రాతపోత్సవంబు
తే. లలఘుసైనికసంఖ్యసంఖ్యాగ్రవిజిత
దానవానీకుఁ డైనయాధరణివిభుని
లలితసౌభాగ్యరేఖాకళావిలాస
శక్తిభక్తిస్నతమత్స్యలాంఛనునిఁ గూడి. 45.
ఉ. వావిరి దుగ్ధవారిధి యవశ్యము నీవిలసత్కటాక్షవీ
క్షావికటాయితంబు ననిశంబు నొనర్చుచు నుండుఁ గాక వే
లావనవాటికాతరుపలాశతతి ప్రతిబింబచుంబినా
నావిధనిర్మలోర్మినటనస్ఫుటచారిమచాపలంబులన్. 46.
తే. అమృతమధురంబు లగుగాడ్పు లాని యాని
బొజ్జఁ బెంచినపెనుఁబాఁపసెజ్జమీఁదఁ
బద్మలోచన! యీమహీపాలుఁ డేలు
పాలమున్నీటిలో శౌరి పవ్వళించు. 47
తే. లలితకాశ్మీరభవసమాలంభకర్మ
పాటలంబైననీముఖాబ్జంబుతోడ
నొరయుఁగాక భవత్కేళియోగ్యమైన
పొడుపుగుబ్బలిఁ బొడతెంచి పూర్ణవిధుఁడు. 48.

క. లీలాసంక్రమవేళం
బాలా! నీచరణలాక్షఁ బ్రథమాద్రిశిలా
జాలములఁ గృతకగైరిక
బాలాతపశంక లనువుపఱుచుంగాతన్. 49

వ. అని పలికి యప్పుడు గంధవాహులుంబోలె విమాన వాహులు లబ్ధగుణప్రసిద్ధియగు నాలలనాలలామం బరిమళ లక్ష్మినిం బోలెఁ బ్రదేశాంతరంబునకుం దోడ్తేర నవ్వాఙ్మయదేవత హేమోపమేయతనుకాంతియుం గురువింద సకాంతిదంతియు నగునయ్యింతి కిట్లనియె. 50

క్రౌంచద్వీపాధిపతి

క. మహిళాలలామ! బాహా
బహువారనివారితారిపార్థివు నితనిఁ
జహదజహల్లజ్జాసం
గ్రహదృగ్జాలములఁ జూడు క్రౌంచాధిపతిన్. 51

తే. మండలాకారవేష్టనాఖండవితత
పాండుదధిమండపాథోధిమండితంబు
పడఁతి యేతద్భుజాదండపాలితంబు
క్రౌంచ మనుదీవి సుగుణసంఘములనీవి. 52

క. దర్భదళపూజనంబుల
గర్భజనిక్లేశ ముడుపు కరుణాభరణుఁ
నిర్భరమతి సేవింపు వి
దర్భాధిపతనయ! యచటఁ దరుణేందుధరున్. 53

తే. అబల! పాదార్పణానుగ్రహమున నిన్నుఁ
బ్రార్థనముసేయఁ గలదు క్రౌంచాచలంబు

పటుతరస్కందబాణసంపాతవివర
కలితనిర్గమకలహంసకలకలముల. 54

క. ఘటియింపు మచట హాటక
ఘటకోటివతంసకములు గా ధూర్జటికిఁ
గుటిలాలక! కలధౌత
స్ఫటికశిలామయము లయిన ప్రాసాదంబుల్. 55

చ. పొలఁతి! లలి న్మలిమ్లుచులపోలిక నీరతికేళిజన్మని
ర్మలతరఘర్మబిందుమయమౌక్తికమండనముల్ హరించుఁ గా
కలసగతిఁ జలద్దధిరసాంబుధితుంగతరంగమాలికా
వలిపృషతచ్ఛటాచమరవాలకరంబితమారుతౌఘముల్. 56

తే. జాలపాదవేషంబు వేశంతజాల
లంఘనాభ్యాసభవ మైనలాఘవమున
సాగరంబులు దాఁటి దిక్సమితిఁ గడచుఁ
గమలలోచన! యీరాజువిమలయశము. 57

వ. అనిన విని యాగంధగజగామిని నిజహృదయానుబంధం
బవ్వసుంధరాధిపునియందు సంధింప దయ్యె, నది దైవవశం,
బప్పు డంసావతంసశిబికాంశు లగుపురుషు లప్పురుష
ప్రకాండునిసమీపంబువలన రత్నాకరంబువలనం దుషార
మయూఖలేఖలేఖానుజీవి పురుషులుంబోలెఁ గొని చని
గిరీశప్రభావుం డగునోకమహానుభావుం గదియించిరి. తత్స
మయంబున నఖిలజగదంచితపాదపద్మ యగు నప్పద్మసంభవు
గేహిని యవ్వరారోహ కిట్లనియె. 58.

—— కుశద్వీపాధిపతి ——

చ. నవవిదళత్కుశేశయసనాభిశయద్వయ ! యివ్వసుంధరా
ధవుఁడు కుశాంకితం బగుప్రధానపుదీవి కధీశుఁ డీతనిం
దివుటఁ బరిగ్రహించి సముదీర్ణవసంతసమాగమంబులం
దువిద! యనుగ్రహింపుము ఘృతోదధితీరవనీవిహారముల్.

మ. పటువాతూలతరంగడోలనచలత్పత్త్రాసిధారాపరి
త్రుటితాంభోధరగర్భనిస్సృతపయస్స్రోతశ్ఛటాసేచన
స్ఫుటసంవర్ధిత మభ్రచుంబిశిఖరాభోగం బతిస్వచ్ఛ మ
చ్చట నీకుం గనుపండు వయ్యెడుఁ గుశస్తంబంబుబింబాధరా!

శా. ఆనందంబునఁ బొందు మిందునిభవక్త్రా! మందరక్షోణిభృ
న్నానాకందరమందిరాంగణములం దాదోధిమాథానుసం
ధానప్రోత్థితసింధురాడ్దుహితృపాదన్యాససంభావనా
పానగపున్యపవిత్రకాంచనశిలాపర్యంతభాగంబులన్. 61

తే. కనకకేతకదళగోత్రగాత్రయష్టి
వ్యాళతనుఘృష్టికృతవలీవలయ మగుట
మహితసోపానమునుబోని మందరాద్రి
యింపుఁబుట్టించుఁగాత మీయిద్దఱకును. 62

తే. ప్రకటఫణివేష్టిఘృష్టిమార్గములు డిగ్గి
మలఁకలై పాఱు నిర్ఝరామలజలంబు
పాఁపతెరిత్రాఁడు పెనఁగొన్నభావ మొంద
మగువ ! నీకింపుఁ బుట్టించు మందరాద్రి. 63

ఉ. నీవదనంబుచేత రజనీపతి నీచనుదోయిచేత నై
రావణకుంభయుగ్మము సురద్రుమపంచకకోమలప్రవా

ళావళి నీకరాంఘ్రియుగళాధరపల్లవరాగలక్ష్మిచే
భావనసేయుఁ బో మథనపర్వత మింతి? భవత్ప్రసంగతిన్. 64

వ. అనిన విని యక్కలహంసగమన మీమాంస శిశిరకరావతంసునింబోలె నవ్విపులాంసుని భజియింప నాసింప దయ్యె, నవ్వైదర్భితలం పెఱింగి యాచతుర్భుజునికోడలు గనుసన్నసేయ జన్యజనం బక్కన్య నన్యరాజన్యసమీపంబు నొందించె, నప్పుడు భారతీదేవి దమయంతి కిట్లనియె. 65

శాల్మలిద్వీపాధిపతి

తే. చపలలోచన, వైరినిష్కృపకృపాణ
పాణి ప్రత్యగ్రశోణితప్రతిమవాణి
కీఁ డధీశుండు శాల్మలద్వీపమునకు
లలితమధువార్ధికాంచీకలాపమునకు. 66

క. ఆసవజలనిధినాయకు
వాసవసన్నిభు విశుద్ధవంశజు నితనిన్
వాసికి నవతిలసుమనో
నాసికి యెదిరింప వశమె నరనాథులకున్. 67

ఉ. ఈసున నేకహేళన మహీసురుఁ డొక్కరుఁ డొక్కవార్ధి యాపోసన మెత్తుచో దిగులు పుట్టి పయోనిధిపంచకంబు నంత్రాసము నొందునప్డు మొగతప్పని యంబునిధాన మెద్ది యం,దాసవపానకేళిఁ గొనియాడు మితండును నీవు నెమ్మదిన్. 68

క. ఏలాలతాగృహాంబుల
బాలా విహరింపు మీనృపాలునితోడన్

హాలారసమయసాగర
వేలావనముల నిదాఘవేలాదినముల్. 69

వ. శాల్మలిగుల్మవాంఛితం బైనయమ్మహాద్వీపంబునకు దీపంబునుం బోలె నోషధీలతా జ్వాలాకలాపదీపితనభఃక్రోడంబును జూడామిళజ్జలదకజ్జలంబునకు ద్రోణాచలంబు నీకు విహార స్థానం బగుంగాక సరససారసకోశమృద్వి యీతని నుద్వాహముగమ్ము. 70

ప్లక్షద్వీపాధిపతి

ఉ. నావుడు లోచనాంతముల నవ్వై విదర్భతనూజ దాన నుద్భావిత మయ్యె నాన్నృపతిపై ననురాగము లేమి యప్పు వాగ్దేవి విమానవాహకతతిన్ నడపించెను వేఱ యొక్కపృథ్వీవరుఁ డున్నపట్టునకు వేడుక యుల్లమునం దలిర్పఁగన్.

వ. ఇట్లు నడిపించి కాశ్మీరపంకనిభలగ్నజనానురాగుండును శ్రీఖండలేపనైషధ్యమయ దిగ్విజయకీర్తిరాజిరాజద్భుజుండు నగునమ్మహీభుజునిం జూపి. 72

క. వీక్షింపు సరోజేక్షణ!
యిక్షురసాంభోధిజలపరీతం బగునా
ప్లక్షద్వీపంబున క
ధ్యక్షుం డీరాజు చెలి సహస్రాక్షునకున్. 73

ఉ. పాంపిరివోవుభక్తి నిరుపూఁటలు రాత్రులు శీతభాను ద
ర్పింపక యారగింపఁడు విశిష్టత వీఁడు భుజించుఁ గాక వం
చింపక యింతనుండియును జేడియ నీవద నేందుబింబముఁ గ
ప్పింపె సలారఁ గాఁ దనకుఁ జూడఁగ నబ్బుట దర్శరాత్రులన్.

వ. ఇక్షురసోదధివేలావనవిహారంబును బ్లక్షశాఖాప్రేంఖోళన క్రీడావినోదంబును విపాశాపులినవేదికాప్రదేశపర్యటనం బును మనంబున కింపు పుట్టింపంగలయవి, యితనిఁ బరిగ్రహింపు మనిన నాసరోజాక్షి వైరాగ్యరూక్షంబు లగు నీక్షణంబుల నతని వీక్షించె వాణిగుణోదయత్రైణీకృతపాణి వీణానిక్వాణ యగువాణి యన్నీలవేణితలం పెఱింగి యంప స్థలస్థితసమానవిమానదండు లగు పురుషప్రకాండులం బదండు పదం డని నడిపించి జంబూద్వీపభూపాలలోకంబు గదియించి. 75

జంబూద్వీపరాజులు

ఉ. నేరెటిదీవి యేలుధరణీవరముఖ్యులు వీరె కంటె యు
న్నారు మనోరథంబులు మనంబునఁ బాయక సంచరింపఁగా
నీరజపత్త్రనేత్ర! యొకనిన్ వరియింపుము వీరిలోన నై
తాఁరి వరించు నిందిరక్రియన్ బరినందితచిత్తవృత్తివై. 76

క. సుందరి! జంబూద్వీపము
నందలిభూపాలసముదయంబును గంటే!
పొందొప్ప ధరణి వ్రాలిన
కందర్పచయంబువోలెఁ గడునొప్పారున్. 77

తే. దీవు లాఱును తనుఁ జుట్టుఁ దిరిగి కొలువ
దీవులకు రాజు నేరెటిదీవి యొప్పు
మేరుకైలాసగిరులు బంగారుగొడుగు
ధవళతరచామరంబునై తనకు నమరఁ. 78

ఉ. ఓవనితాలలామ! లవణోదధిచక్రపరీత మైన యా
దీవికి రాజజంబువు ప్రదీపితలాంఛన మన్నగంబునా

ఖాఫలిప్రేలియాడెడుమహోఫలముల్ గని వారణంబు లొం
గా వని పందెముల్ సలుపఁ గా గమకింతురు సిద్ధదంపతుల్.

వ. కంబుకంఠి! జగదలంకారం బగుజాంబూనదంబు తనకు జంబా
లజాలంబుగా జాంబవ ద్రవభవంబై సుధామధురాంబు
పూరం బగుజంబూసరిత్ప్రవాహంబు జంబూద్వీపంబునందుఁ
బ్రవహించు నీద్వీపంబున నంతరాంతరంబుల నెంతయుం
బ్రసిద్ధులగువసుధాకాంతులు నిన్నంతరంబులం గోరి వీరె
పభాభ్యంతరంబున నున్నవారు. విమతయశావతమాలిపతం
నతమాలమాలికోన్మీలన్నీలతమగప్రకరతస్కర భాస్కరు
లగువీరియం దొక్కరునియందు నీడెందంబు కందళితానందం
బయ్యెనేని వానిఁ జూపు మాభూపాలకుని కులబలాచార
శూరతావివేకవైభవంబు లభివర్ణించెద, ననిన నబ్బాల శాలీ
నతావశంవదయై వదనారవిందంబు వంచి యూరకుండె.
నట్లున్నఁ గాంచి విరించిపట్టపుదేవి బుజ్జగించి యాలజ్జావతికి
నుజ్జయినీవల్లభుం జూపి యి ట్లనియె. 80

ఉజ్జయినీపతి

తే. సవిధలీలావనీస్థాయిశంభుమౌళి
చంద్రికాధౌతకలధౌతసౌధజాల
యుజ్జయిని రాజధాని యోయుత్పలాక్షి!
భావసంభవనిభున కీభూవిభునకు. 81

ఉ. తామరసాక్షి! శంకరుఁడు తత్పురి నాత్మకిరీటచంద్రరే
ఖామృతవృష్టి మన్మథనవాంకురముల్ సృజియించుఁ గామినీ
కాముకభావసీమముల కందువపట్టుల నిట్టిహాఁ డటే!
యేమిటికిఁక దహించె నిట లేక్షణవహ్నిఁ దదీయదేహమున్?

తే. వెలఁది! వీఁ డేలునుజ్జనివీటియందు
వెఱతు రలుగంగ సతులాత్మవిభులతోడ
బాహ్యవనవీథికాస్థాయిభర్గమౌళి
బాలహరిణాంకకోమలప్రభలయాజ్ఞ. 83

ఉ. యాచకకోటి యీతనియుదారత పేర్మి సమృద్ధి నొంది యా
చ్ఛాదనణంబు వీడుకొన నాత్మల ముచ్చటఁ బొంది, దేవతా
నైచికియుఁ సురద్రుమము నైజగుణవ్యసనంబులం బయ
స్సేచనలీలఁ బల్లవభుజిక్రియఁ దీర్చు మిథఃప్రసంగతిన్. 84

శా. క్షోణీనాథుఁ డితండు దానగుణవిస్ఫూర్తిం బ్రవర్తిల్లఁ గా
మాణిక్యాచల మెట్లు గైకొనియెనో మాకద్భుతంబయ్యెఁ గ
ల్యాణీ! నిర్వ్యయరత్నసంపదుదయోదగ్రత్వముఁ యాచక
శ్రేణీవర్జనదుర్యశోనిబిడితవ్రీడావనమ్రత్వమున్. 85

వ. దమయంతి! శాంతిదాంత్యాదిగుణసంతానంబులకు విశ్రాం
తిధామం బైనయీయవంతిపతియందు నీయంతరంగం బను
రాగవంతంబయ్యెనేని శిప్రానదీసలిలకేళియు మహాకాళస్థిత
వృషభధ్వజభజనంబును విశాలానగరీసౌధసింహాసనాధిరో
హణంబును నీకు సంభవింపఁగలయది, యని పలికి పలుకుం
బొయ్యలి యూరకుండెఁ, గుండినావనిపురందరప్రియనం
దనయును దూష్ణీంభావంబున నవ్విశ్వంభరాభర్తమీఁదఁ
గటాక్షవీక్షణం బావర్తింపదయ్యె నప్పుడు. 86

తే. మాళవాధీశమకుటాగ్రమణులయందు
భీమనందనరూపంబు బెరసి యునికిఁ
దద్విరక్తి పరీక్షించి తారు దార
యరిగి రవలకుఁ జతురంతయానధరులు. 87

తే. గోఁతి గాంగేయపీతవక్షోజకుంభ
యభ్రవాహినియునుబోలె నరుగుదెంచె
యానధరపర్గసగరపౌత్రానువృత్తి
భూవరాంతరమనుమర్త్యభువనమునకు. 88

వ. అప్పుడు మత్స్యలాంఛనచాపరేఖాజితభ్రూవిలాస యగునా
రాజకన్యకతోడ వాగ్దేవి యిట్లనియె. 89

గౌడరాజు

క. వ్రీడావతి! యీభూపతి
గౌడబిడౌజుండు వీఁడు కమనీయరతి
క్రీడారహస్యకోవిద
చూడామణి తెప్పలెత్తి చూడుము వీనిన్. 90

ఉ. పంకజనేత్ర! వీనిపరిపాండురకీర్తిభరంబుచేఁ గురం
గాంకరుచుల్ దృణీకృతము లైనవి నిక్కువ మట్లు గానినాఁ
డంకము డాసియున్నె యమృతాస్పదమైనతదంతరంబునన్
రంకు వసంతుచత్ప్రిణయర్తిఁ దదంకురచర్వణార్థమై? 91

తే. కువలయశ్యాముఁ డైనయీయవనివిభుని
యఱియుకౌఁగిటిలోనుండు హేమగౌరి!
కుసుమబాణాసనునిసేసకొప్పులోనఁ
దవిలి యొప్పారు సంపెంగదండవోలె. 92

చ. లలన! యితండు సమ్ముఖమిళద్రిపుకుంజరకుంభమౌక్తిక
చ్ఛలమున వైరిలక్ష్మివలిచన్నులమీఁదఁ నిజప్రతాపసం
కలనసముత్థితంబు లగుఘర్మకణంబులఁ జూయ మీఁటు ని
ర్మలనిజశాతహేతినఖరంబున నాజివిహారభూములన్. 93

తే. అతివ! యాజానుదీర్ఘబాహాప్రతాప
సమధిగతదిగ్విభాగుఁ డీ జనవిభుండు
సప్తతంతుయశఃపటవ్యాప్తనిఖిల
భువనుఁ డీతనిచరిత మద్భుతకరంబు. 94

వ. అనిన విని యయ్యరవిందాస్య యాదాస్యసంవిదవలంబిత
తూష్ణీమ్ముద్రాముద్రితం బైన చూపునం జూచి యాభూపా
లునిం బ్రతిషేధించె నాక న్నెఱింగి ద్రుహిణాగ్రహిణి
విమానవాహవ్యూహంబునకుం గనుసన్న సేసి వేఱొక్క
రునిం జేరం బోవ నియమించి యారాజన్యుం జూపి విదర్భ
రాజకన్యక కిట్లనియె. 95

మథురాధిపతి

సీ. తెలివ! ప్రత్యర్థిపార్థివసార్థపాథోధి
సమ్మాథమందరక్ష్మాధరంబు
పృథుఁ డనునృపతి యీపృథ్వీశ్వరుం
డేలు మథుర, నాకము జంభమథనుపగిది
నశ్మశ్రువైనయీయాయనముఖాబ్జంబుతో
నంకగర్భం బైనయమృతకరుఁడు
సరిపోవఁ జాలఁడు చారుకాంతిస్ఫూర్తి
నటు సూడు మితనిబాహార్గళములు

తే. వైరిధరణీశవంశసంభారమునకు
క్షాత్రపకళత్రనేత్రాంబుజన్మమునకుఁ
గారణం బైనధూమరేఖయును బోని
ఘనశరాసనగుణకిణాంకము ధరించు. 96

చ. అలికులవేణి! కాళియమహాహ్రదవర్తి కమనీయనాభితో
జలనిధినేమిభామినికిఁ జక్కనిమేచకరోమరాజి నా
నలిఁ బ్రవహించుచున్న యమునానదియందు నితండునీవునుం
జలుపుదుగాక గ్రీష్మదివసంబులయందుఁ బయోవిహారముల్

క. గోవర్ధనాద్రితటములఁ
బ్రావృట్కాలముల విపినబర్హిణనటన
ప్రావీణ్యము వీక్షింపుం
డీవును నీతండు వేడ్క లింపెసలారన్! 9

ఉ. పూవులభూరిసౌరభము పూని భరింపఁగ లేఁగుదెంచు బృం
దావనసంచరిష్ణుఁడు సదాగతిపాంథుఁడు దప్పి పెంపునం
ద్రావఁ గలాఁడు బాలునివిధంబునఁ జిత్రకగంధసారపం
కావిలమైననుం గువలయాక్షి! భవద్రతిఘర్మతోయమున్

క. పాటించి యితని వేఁడిన
చాటుకవీశ్వరులహస్తజలజంబులకుఁ
హాటకదీనారములు వ
రాటకసంఘాతములు వరాటేంద్రసుతా. 10

తే. అనిన వినియును బ్రాల్చెఁ బక్ష్మాంచలములు
బాల తద్భావ మెఱిఁగి వాగ్భామ యపుడు
మఱియు నొకమానవేంద్రసమక్షమునకు
నిందుబింబాస్యఁ దోతెంచి యిట్టు లనియె. 10




వ. మత్తకాశిని! యితండు కాశీరా, జితనిరాజధాని ము
క్తిక్షేత్రం బగువారణాసి, యితని కులదైవతం బఖిలభు
వనస్థుం డగు ధూర్జటి, యితని విహారదీర్ఘిక త్రిలోకసంతా

నిర్వాపణి యగు గీర్వాణతటిని,యితనిసత్త్రశాల విశాలాక్షీ
కేలిభవనం, బితనిభుజా స్తంభ దంభోళి రిపునృపాలబాలా
నయనాంబువృష్టి ధారాసమేధితంబు. 102

చ. సకియ! యితండు నీవలుఁదచన్నులక్రేవల నొత్తుఁ గాతఁ గిం
శుకముకుళాభిరామములుసుంకముపట్టునఖాంకురాంకముల్
ప్రకుపితశాంకరీచరణపంకజకుంకుమపంకసంకర
ప్రకటనిరంకశంకరకపర్దశశాంకకళాంకకారముల్. 103

తే. అతివ! సంగ్రామరంగసంగతవిరోధి
నృపశిరోధిశిరాకాండనివహఖండి
చండభుజదండమండితమండలాగ్ర
జాగ్రదుగ్రప్రతాపుఁ డీజనవిభుండు. 104

క. దశశతదృగర్వగర్వ
ప్రశమనసాహాయ్యధురీణపటువేగనిరం
కుశసైన్యతురగరింఖా
విశకలితదిగంతధరణి వీఁడు లతాంగీ! 105

వ. అని వర్ణించుచుండ దమయంతి నిజమహోత్సవాగతానేక
లోకశోభావలోకనకుతూహలంబునం బరాకు వహించి
యుండె,నవ్విధం బక్కాశీరాజునకుం గ్లేశావహంబయ్యె సర
స్వతీదేవియు వేఱొక్కనరదేవోత్తముం జూపి యి ట్లనియె.

—● అయోధ్యాధిపతి ●—

తే. ఈనృపాలుఁ డయోధ్యాపురీశ్వరుండు
పేరు ఋతుపర్ణుఁ డాకర్ణచారునయన!
వీని వరియింపు సముదీర్ణవిధసువర్ణ
కేతకీగర్భపర్ణాతిపీతవర్ణ. 107

ఉ. వారివిహారవేళఁ జెలువా! చెలువారెడునీదనుంగవ౯
సారపుఁ దారహారములచందముఁ గైకొనుఁ గాపుతం జమ
త్కారము క్రొత్త గైొ మెఱయఁద త్తటసీమపరిత్రుటత్సదా
సారవసారవార్మిభవసారవరాంబుపృషత్కదంబముల్. 108
తే. ఇతనితాత భంగీరథుం డతులమహిమ
నవనిఁ బ్రవహింపఁగాఁ జేసె నభ్రగంగ
నితఁడు త్రైలోక్యమునఁ బ్రవహింపఁజేసెఁ
గీరభాషిణి! వరధర్మ కీర్తిగంగ. 109
చ. కవివచనంబు లీతనియగాధయశఃకలశాంబురాశిలో
లవములు వోలె డిందు విమలం బగువీనిగుణప్రతానముఁ౯
దివిరి దిగంతసంపుటతతి౯ బుధమండలి లెక్కవ్రాయఁ దా
నవము భజించు వైరినరనాథయశఃఖటికాకలాపముల్. 110
శా. అంభోజానన! వీని నెట్లు నుతి సేయ న్వచ్చు? నేత త్తనూ
సంభూతం బగురోమసంఘము మహాసత్త్వాంకురశ్రేణి య
స్తంభాటోపవిజృంభమాణరిపుదో స్తంభోరుకుంభీనసా
రంభ స్తంభనమంత్ర మీతనికఠోర క్ష్వేళ యాలంబునన్.111
శా. గంభీరప్రతిపక్షరాడపయశఃకాళిందియుఁ౯ వీనిదో
స్తంభోద్భూతయశోభ్రగంగయు ననిఁ౯ సంశ్లేషముఁ౯
బొందు నా, సంభేదంబునఁ గ్రుంకి కాంచునుమహోక్షత్రంబు
రంభాపరీ, రంభానందనికేతనందనవిహారప్రౌఢివిస్రంభముల్.
శా. తాదృగ్దీర్ఘవిరించివాసరకరత్వంబుం బ్రతిష్ఠించుచుఁ౯
యాదోర్థి౯ దననీడ బాడబముగా నాకాశసంవ్యాప్యరి
క్తాదారస్థిరకీర్తితారకములఁ౯ మాయించు నేతత్ప్రతా [న్.
పాదిత్యుండు వెలుంగుఁ బద్మముఖి! వాచాగోచరప్రక్రియ

క. అన వినియు విననియ ట్ల
జ్జననాథతనూజ యున్నచందముఁ గని య
మ్మనునంశాగ్రణి యవలకుఁ
జన ననుమతిఁ జేసె నలువసతి వాహతతిన్. 114

వ. ఇ ట్లనుమతించి. 115



ఉ. అక్కడ నొక్కభూపతి ననంగునికం బెను రూపసంపదం
జక్కనివానిఁ జూపి సరసత్వముమై మధురస్వరామృత
న్యక్కృతమత్తకోకిల సనాతని తామరచూలిదేవి యా
చక్కసజవ్వనిం గరము గారవ మొప్పఁగఁ జూచి యిట్లనున్.

తే. పాండ్యభూపాలుఁ డీతండు పద్మనయన!
యితని వీక్షింపు నిజకటాక్షేక్షణముల
మానశాలిని! శాలీనతానత మగు
నాననాంభోజ మెత్తుమిా యత్తరమున. 117

ఉ. ఈసకలావనీతలము నెక్కటిఁ దాన పరిభ్రమించియ
భ్యాసపరంపరాపరత నభ్రమునన్ విహరింపఁ గోరియో!
లాసిక కీర్తి విభ్రమకలాగరిమ న్నటియించుచుండు నీ
రాసుతు వంశరత్నముఁ దిరంబుగఁ జెంది యమందలీలలన్.

తే. ఇతనిరిపురాజరాజి యేఁ కోటివరుస
నడవు లడవులు దక్పక యరిగి యరిగి
యరుగు బహుకాలశూన్యత నడవులైన
యాత్మనగరంబులకు యదృచ్ఛానువృత్తి. 119

స్రగ్ధర. ఆలోకాలోక మేదిన్యమలమలయజోదారవిస్ఫారకీర్తి
ఖేలాకూపారపారాఖిలజనవినుతాక్షీణచాపప్రతాపుల్

బాలా! వీక్షింపు వీనిం బడయుగయుగపల్యాప్తిభూపాలి
భూయ, శ్చ్యుళీరత్నోడుపాళీసులభకరిచయాస్తోకనందన
ఖేదన్. 1

శా. భంగాకీర్తిమషీమలీమసతమక్రత్యర్థి పృథ్వీపతి
త్వంగత్తిందుకకాననాంతరములన్ వర్తిల్లు నత్యుల్లస
ద్భంగిన్ వీనిప్రతాపవహ్ని జగదుత్సంగంబునన్ దత్స్ఫులి
గాంగారంబులు భానుఁడున్ శిఖియు జంభారాతిక
భోళియున్. 1[illegible]

శా. ఏణీలోచన! యేతదుగ్రసమరప్రేక్షోపసమ్రామఁ
శ్రేణీమధ్యచరుండు వైన్యుఁడు గిరిశ్రేష్ఠపార్థమై కైకొనుం
బాణిం జాపము వీనిదంతిబలముల్ పైపై ననిన్ జంగమ
క్షోణీధ్రంబులు వోలె ధాత్రియెడఁ గైకొంచున్ విజృం
భింపఁగన్. 12

శా. ఆద్వైత్యాంతకువక్షమున్ గృహముగా నన్యత్రైకదోషమ్ఫుట
సీదన్మర్కటకీటజాతకృతకశ్వేతాతపత్రీభవ
త్తాదృక్షిర్మలకౌస్తుభాభరణరత్నస్ఫూర్తిగాఁ బాసి యా
హ్లాదంబొప్పవసించు శ్రీ యితనిబాహామధ్యసౌధస్థలిన్. 12[illegible]

మ. ఘనసిందూరవిముగ్ధమూర్ధము ధృతస్కంధావధిశ్యామికం
బును బాధోధరమార్గగామియునునై పూఁబోణి! యీ
రాజనం, దనుగంధద్వీప మాజిలోఁ జరమసంధ్యాకాలముఁ
బోలె నర్థినిరోధించు విరోధిబాహుజభుజాతేజస్సహ
స్రాంశులన్. 124

క. కీర్తిధనుఁడై నయీతని
మార్తురకని కరుగ నరిది మగువ! బెడంగై

మార్తాండమండలంబున
గర్తమయం బైనత్రోవ గానఁగ వచ్చున్. 125

చ. ఎదిరిచిసమ్ముఖం బయినయింతటిలోనన యేమి చిత్రమో?
కదనముఖంబునందు విముఖత్వముఁ గైకొను నర్కదీప్తిచే
నదరులువాఱుచుఁ బెడిదమైనయదగికరవాలధారచే
విదళితమై శిరోధి వడ వీనివిరోధిమహీశుఁ డుద్ధతిన్. 126

వ. అనియె నప్పుడు సమీపంబున డాసి యున్నయంతఃపురదాసి యౌదాసీన్యగర్భంబైన వైదర్భి తలంపెఱింగి వేఱొక్క దెస చూపి, యక్క! యిటు గనుంగొనుము. సౌధాగ్రంబునందు నటియించు కేతనపటాంచలంబునం జలంబు గొని యొక్కకాకిగ్రాహానమునకై కాకారవంబుతోడం గాలూఁదఁ దలంచి యనువుగాక చీకాకుపడుచున్న యది యనుచు నప్రస్తుతభాషణంబులం బరిహాసంబు పుట్టించిన.

తే. దాచేసినయప్పరిహాసమునకు
హాసపరిపాండురం బైనయక్కొలువున
నానృపాలుముఖమ్లాని గానఁబడియె
నలువుగానఁగఁ బడుఁ గదా తెలుపులోన. 128

వ. అప్పుడు. 129

క. ఆరాజుపట్టు వాసి మ
హారాజికసిద్ధసురసమర్చితచరణాం
భోరుహ భారతి యొక్కమ
హారాజుసమీపమ్మునకు నల్లనఁ జనియెన్. 130

కాళింగుఁడు

వ. చని మహేంద్రగిరి యేలునన్నరేంద్రునిం జూపి దమయంతి కిట్లనియె. 131

చ. నరసుతు నిమ్మహేంద్రగిరినాథు వరింపుము రూపసంపద న్దొరయు నితండు నీకు, నొకదోసముసుం గల దప్పురంబునన్ గరిమఁ గళింగజంబు లగుగంధగజంబులకుంభ రాజితోఁ గరకరిపుట్టఁగాఁ గలదు కామిని నీవలిచన్నుదోయికిన్. 132

చ. గజపతి వచ్చెనంచు నొకగంధగజంబుగుఱించియొక్కఁడ క్కఁగజపడి పల్కినన్వెఱచి కాననభూమికి వీటిఁబాఱి దా రి జడతనిద్రలోఁ గలవరింప నిజోక్తియ నేర్చి కీరము ల్గజపతివచ్చెనావిని కలంగుదురు రీతని శత్రులచ్చటన్. 133

తే. వీనిరిపుకాంత పతిఁ బాసి కానలోనఁ
జెంచుఁబూఁబోఁడులును దానుఁ జెలిమిచేసి
చెప్పుఁదమదేశవార్తలుచెప్పుచోటఁ
'జల్లనై యుండు మాభూమిచంద్రుఁ' డనుచు 134

మహాస్రగ్ధర.—
రతిఁ గ్రీడాహంసమోహా
గ్రహిళశిశుభృశప్రార్థితోన్నిద్రదారా
పతినై దుఃఖించు సద్యః
ప్రసృమరనిజదృగ్బాష్పధారాగతేందు
ప్రతిబింబప్రాప్తలాభ
ప్రముదితసుతనై రంజిలున్ రాత్రులేత
త్ప్రతిపక్షక్షోణిపాల
ప్రమదగిరిదరీప్రాంతకాంతారభూమిన్. 135

ఉ. యజ్జలదేవతాస్ఫటికహర్మ్యము శేషుఁడు ముజ్జగంబులుక్
మజ్జన మాచరించుఁ బలుమాఱును నెందు యదీయవాగ్కణం
బజ్జలజారి యట్టివిమలాద్భుతకీర్తిమహాబ్ధిపూర్తముక్
సజ్జనవర్ణనీయము నొనర్చె నితండు వసుంధరాస్థలిన్. 136

శా. ఆమోదాశ్రుభరంబు వెల్లిగొన నెట్లాలించుఁ గర్ణంబులక్?
రోమాంచంబువహించు నేకరణి నీరోమాంకురంబైన మైక్?
భూమీచక్రము పూనియెట్లు దల లూఁపుం బన్నగస్వామి
యుద్దామప్రౌఢిని వీనికీర్తి ఫణభృత్కాంతామణుల్
పాడఁగన్. 137

ఆ. అనిన నల్ల నవ్వి న బ్జాయతాక్షియు
నది విరక్తియగుట నాత్మ నెఱిఁగి
యానవాహసమితి నవలోకసంజ్ఞ న
వ్వలికి నరుగఁ బనిచెఁ వాగ్వధూటి. 138

వ. అచ్చోట నేపాళరాజుం జూపి యారాజవదనకు రాజీవ
భవునిదేవి యి ట్లనియె. 139

నేపాళరాజు

తే. ఇతఁడు నేపాళభూపాలుఁ డిగురుఁబోణి!
వీని వీక్షింపు కడకంటివీక్షణమునఁ
బడఁతి! యేతత్ప్రతాపాగ్నిఁ బడియె నేఁ బ
తంగుఁ డంగీకరించుఁ బతంగవృత్తి. 140

తే. ఉభయపాలస్త్యవాసైకయోగ్యములును
నుభయసంధ్యాప్రభాలంక్రియోజ్జ్వలములు
నైనదిగ్భాగములయందు వీనికీర్తి
పద్మలోచన! నృత్యంబు పరిఢవించు. 141

మ. శరధిప్రోద్ధృతి శింజినీఘటన మాశబ్దగ్రహాకృష్టి యం
బరవీథీగతిలక్ష్యభేద మవనీపాతంబులక్షింపరా
కరివక్షస్స్థలరంధ్రపంక్త్యనుమితం బౌనాజిరంగంబులం
దరవిందానన! వీనిబాణనికరం బత్యద్భుతప్రౌఢిమన్. 142

మహాస్రగ్ధర—

పతితప్రత్యర్థిపృథ్వీ
పతిముఖకమలోపాశ్రయమ్లానిభృంగ
ప్రతిబింబాంకంబు లేత
త్పదనఖవిధుబింబంబు లీరాజు జాల్పుఁ
బ్రతివీరప్రాణవాత
ప్రకరనవసుధాపానపీనంబు నత్య
ద్భుతశౌర్యాడంబరంబుఁ
భుజభుజగయుగంబుఁ మహాసంగరోర్విన్. 143

మ. హరిదంతద్విపదంతకుంతముల కన్వాదేశ మాశీవిషా
భరణోత్తంససుధాంశురేఖకు ననుప్రాసంబు కైలాసభూ
ధరకూటస్ఫటికోపలప్రతతి కధ్యాహార మిమ్మేదినీ
శ్వరదేవేంద్రునిసాంద్రనిర్మలయశోజాలంబు లీలావతీ! 144

సీ. ఇతనిహేతి శతఘ్ని నెబ్భంగి నెదిరించు
నరవీరశతము సంగరములందు?
లక్షభేదనకళాదక్షు నీతని నెట్టు
లహితయోధులలక్ష లాక్రమించు?
నీకుచాజితపద్మ నితని నేక్రమమున
విమతపద్మము లంగవింపఁ జాలు?

సర్వపరచ్ఛిదా శక్తు నీతని నెవ్వి
ధంబున రిపుపరార్ధము జయించుఁ?
తే. గాన సంఖ్యాపగమము నొక్కటియె దిక్కు
వీనిపగఱకు మాటలు వేయు నేల?
కార్తికీతిథియామినీకాలపూర్ణ
చంద్రమండలసంకాశచారువదన? 145

కామరూపాధిపతి

తే. అనుచు నిబ్భంగి నొత్తి చెప్పినను వినియు
నుత్తరము లేక యూరకయున్నఁ జూచి
యన్యరాజన్యు గుఱి సేసి యరిగె వాణి
యానధుర్యవజ్రంబుతో నరుగుదేర. 146
వ. ఇవ్విధంబునం గామరూపాధికుం డైనకామరూపాధిపుం
జేరంజని వాగధిదేవత యవ్వనితావతంసంబున కిట్లనియె.
తే. ఇతఁడు ప్రాగ్జ్యోతిషాధీశుఁ డిందువదన!
వీరచూడావతంసంబు వీనిఁ జూడు
మలసవలితంబు వ్రీడాభరాకులంబుఁ
జంచలము నైననీదు నేత్రాంచలమున. 148
శా. క్రూరాసిత్రుటితారివారణఘటాకుంభాస్థికూటస్థలీ
రారాజన్నవమౌక్తికోత్కరకిరారంభక్రమోజ్జృంభియై
యీరాజన్యుకరంబు పోఁడులఁ గరం బేపారు సత్కీర్తిబీ
జారోపం బొనరించుభంగి హాయరింఖాగ్రక్షతక్షోణులన్.

స్రగ్ధర.—
రాజీవాక్షీ! ప్రహారప్రవదసృగసుహృ
త్ప్రాంశువంశాళి నేత

త్తేజోధూమధ్వజంబుల్ దిరిగి తిరిగి రో
ధించు దుస్సాధలీలన్
రాజావర్తోపలాంశు ప్రతిమత దుదిత
ప్రాజ్యధూమంబుగా రా
రాజన్నాసీరవాజివ్రజఖురజరజో
రాజి ఘోరాజిభూమిన్. 150





వ. అనియె నాసమయంబున సమీపవర్తిని యగుతాంబూల కరంకవాహిని దమపహోదరిభావం బెఱింగి భారతీదేవి నుద్దేశించి యోదేవి! యీవసుధావల్లభునిమీఁద నిష్పల్ల వాధరకు నుల్లంబు పల్లవింపదు వచనపరిశ్రమంబు వలదు. వాఁడె యుత్కలదేశాధీశ్వరుం డమ్మహీశ్వరుగుణకలాపంబు లభివర్ణింపు మనుటయు. 151

క. భారతి రతీశకల్పుని
నారాజకుమారుఁ గదియ నరిగి గభీరో
దారమృదుమధురభాషల
నారమణీమణికి నిట్టు లనియెం బ్రీతిన్. 152

క. ఇతఁ డుత్కలదేశాధిపుఁ
డతివ! విలోకింపు మితని నానమ్రరిపు
క్షితిపతికిరీటకోటీ
శతమఖమణిమధుపచుంబిచరణాంబుజునిన్. 153

మ. చెమరించుం దుహినచ్ఛటాచ్ఛలమునన్ శీతాంశుబింబంబు
రేఁ, గుముదం బెన్నఁడు నిద్రవో దెపుడు నీ కోష్ఠుం బ్రవే

శించుమ,ల్లి మతల్లీనవమాలికాకుసుమముల్ లీలావతీ! వీనిదు
ర్దమదోర్దండయశఃప్రకాండవిభవారంభంబు జృంభించినన్.

స్రగ్ధర—

పైపైఁ దుక్షారధట్టా
ప్రఖరఖురపుటీపాతవిక్షుద్యమాన
క్ష్మాపృష్ఠోత్తిష్ఠదంధం
కరణరణరజస్కాండధారాంధకారం
బాపూర్ణం బైనఘోరా
హవముఖముల నబ్జాక్షి! యీరాజుబాహా
టోపం బీక్షింప రాకుం
డుటకు మఱుఁగుచుండుం దివిఁ దేవపంక్తుల్. 155

మ. అసమానస్థిరదానవైభవకళాహంకారసింహాసనా
గ్రసమాసీనుఁడు వీఁడొకండు కలుగంగా నర్థియాచ్ఞారస
వ్యసనాభావబహూభవత్ఫలభరవ్యాజంబున న్నమ్రమై
యొస సంక్రందనశాఖి డెందమునఁ బెం పెక్కించు మందా
క్షమున్. 156

మ. కలుచం గోశబిలంబు వెల్వడి యదగఖడ్గాహి పైవచ్చుచోఁ
జలనం బించుక లేక యీతనిరిపుక్ష్మాపాలసంఘాత మో
చెల! హస్తాంబురుహాంగుళిమయమహాసిద్ధౌషధీపల్లవాం
చలముల్త్రేసి భజించు జాంగలికతన్ సంగ్రామరంగంబులన్.

కీ క టుఁ డు

వ. అని పలికి పలుకుబోటి వరాటరాజకన్యకం గనుంగొని
యప్పు డయ్యింతి యంతరంగంబు నిరంతరస్మరణసరణి
ధారావాహికజ్ఞానధారాసమారూఢనిషధపరివృఢం బగుట

నెఱింగియు నెఱుంగనిచందంబున భావించుచుం బ్రస్తావో
చితప్రకారంబునం జతురంతయానధరులం బదండు పదం
డని యుత్కళాధీశ్వరుం గడచి యసమసమరవిస్మరచమూ
మదాంధగంధ సింధురఘటావమథుశీకరా సారహారిణీ
హార సమయకంపితారాతిహృదయకమలుండును మదవదరి
మూర్ధాంకురవిందకందళకిరణ సందోహసందీపితచరణారవిం
దుండును గరళకరాళకరవాలధారానికృత్తగళద్రక్తరిపు
సుభట నటారబ్ధనాట్యాద్భుతాలోక హృష్టత్రివిష్టపనివా
సుండును నగునొక్కరాసుతుం జూపి దేవి! యితండు కీక
టాధీశ్వరుం డిమ్మహీపతిపుంగవు నపాంగరంగస్థలలాస్యలం
పటంబు లగుకటాక్షవీక్షణంబుల నిరీక్షింపుము. 158

స్రగ్ధర—

లీలం గట్టించెఁ బెక్కు
లెన్నెలవులఁ జెఱువుల్వీఁడుసాంద్రద్రుమాళీ
వ్యాలీఢోపాంతశాంత
వ్యథపథికజనస్వాంతముల్ కీర్తిలక్ష్మీ
మూలాంబుల్ నీలనీలాం
బుజదళదళనామోదమేదస్విపాథఃక
కేలీలోలద్విజాళీ
కృతమధురకలక్రేంక్రియాసంకులంబుల్. 159

మహాస్రగ్ధర—

మహిళాసీమంతముక్తా
మణి! యితనియశోమండలీపూర్ణరాకా
తుహినాంశుల్ దాడిమైవ

త్తురు వడిఁ దనపై దొమ్మిగా నంచుఁ జొమ్మై
మహిగోళచ్ఛాయమాయా
మయగణితకళామాత్రలక్ష్యాంగకుం డై,
గ్రహవీథిన్ దుర్గవీథిం
బ్రభచెడి యొదుఁగున్ రాహు రాహుత్తుఁ డోటన్.

మహాస్రగ్ధర.—
తరుణీ! దామోదరీయో
దరకుహరదరీస్థాన మీవిశ్వధాత్రీ
శ్వరుకీర్తుల్ ముంచి పాలం
జటులగతి జగజ్జాలముల్ దేలియాడన్
మురజిన్నాభిప్రణాళీ
ముఖమున ధవళాంభోజ మన్ పేరుగాఁ దా
నెరవై తత్పూర మంత
ర్నిబిడ మయి బహిర్నిర్గమంబున్ భజించున్. 162

వ. అనిన వినియు ననాదరముద్రాముద్రితం బైనహృదయం బుతో నవ్విద్రుమాధర గీకటాధీశ్వరుం గటాక్షింప కుండిన.

—వంచనరి—

ఉ. వేసట లేక భీమపృథివీపతినందనయాననాంబుజో
ల్లాసవిరక్తిముద్ర పదిలంబుగఁ గన్గొని యాదినాంతసం
ధ్యాసమయాధిదేవత పితామహుపట్టపుదేవి గీకటుం
బాసి చనన్ దలంచె మఱి పంచసలీమణిమంచవీథికిన్. 163

వ. అప్పుడు సరస్వతీదేవినిర్దేశంబున యానధుర్యులు రాజసమాజంబునలనం బాపి భోజరాజకన్యను నిషధరాజకుంచకం

బునుం గదియించుటఁ బరిమళంబులు నందనోద్యానతరుషం
డంబులవలనఁ బాపి మధుపమాలికం గల్పపాదపంచకం
బునుం గదియించిన చందంబు దోఁచె, ననంతరంబు నలాకృతి
ధరు లయినయాలోకపాలురం జూపి క్రమంబున. 164

తే. వాణి యిట్లను నక్కరవాణి కెలమి
గాఢశబ్దార్థసంశ్లేషరూఢ మెఱయ
నిర్జరాధీశ్వరులకును నిషధపతికి
వర్ణనావాక్యరచన నన్వయము గలుగ. 165

చ. అతివ! యపవ్యపాయుని ననల్పవిలోచనపంకజాతుఁ బ్రీ
ణితనిజవీరసేనుని వినిర్జితసర్వమహీభృదావళీ
హతమదవద్విరోధిబలు నాత్మచమూచరవారణాసన [స్రు
స్రుతమదగంధయుద్ధమహిఁజూడుము వీని మహేంద్రుని

సీ. భాస్వరరూపసంపన్నుఁ డుద్ధతిమంతుఁ
డధికప్రతాపసమన్వితుండు
హేతిసంభూతప్రభూతభూతియుతుండు
శుచి ధనంజయుఁడు విస్ఫూర్తిశాలి
నానామహాసమిన్నద్ధశ్రీప్రదీప్తుండు
సతతంబు విబుధసంతతికి ముఖము
లాలితబాలప్రవాళతామ్రకరుండు
తనకు శాత్రవసముత్కరము తృణము

తే. తామరసపత్త్రనేత్ర! యీతం డనలుఁడు
లావు గలవాఁడు లోకపాలకులలోన
బహుతరస్నేహరుచిమహాబలసహాయ
సంపదుద్దాముఁ డెలమి వీక్షింపు మితని. 167

తే. పరభయంకరపటుగదాప్రహారణుండు
దండనిపుణుండు సమవర్తి ధర్మరాజు
మిత్రనందనుఁ డంభోజనేత్ర! చూడు
మితని దక్షిణనాయకు నింపు మిగుల. 168

క. ధవళాక్షి! చూడు మీతని
భువనాధీశ్వరు నపారభూరిగభీర
త్వవిశేషనిధి నదీనునిఁ
బ్రవిమలతరవారి నధికబలసత్త్వాఢ్యున్. 169

వ. అని యాఖండలు గుఱించియు నగ్ని నుద్దేశించియు నంతకు లక్షించియు నంబుపతిం గూర్చియుఁ ద్రిభువనార్చితచరణారవింద యగునరవిందభవుదేవి తదీయమాయారూపంబులకు ననురూపంబుగాఁ బ్రత్యేకంబ యుభయార్థవచనసామర్థ్యంబు లగువన్నావాక్యంబులం బ్రబోధించిన విదర్భధాత్రీపతి పుత్త్రి నేత్రశ్రోత్రంబులం జూచియు వినియు నితం డితం డని నిర్ణయింప నేరక డెందంబు డోలాందోళనంబునొంద విధి పజ్జను నిషేధంబుత్రోవనుం బోవనితలంపున నిలింపనిషధరాజులను నలువుర విస్మయస్మేరంబు లగువిలోకనంబుల నవలోకించునది క్రమంబున భారతినిర్దేశంబున నైసర్గికవిలాసభాసమానుండును నసమానరూపరేఖావిడంబితశంబరారాతియు నగు నిషధభూపతిం జూచె నప్పుడు. 170

క. శారద మధురాలాపవి
శారద యింద్రాగ్ని శమనసలిలేశనుతి
ద్వారమున నిషధపతిఁ గై
వారం బొనరింపఁ దొడఁగె వాచాప్రౌఢిన్. 171

తే. నలిననేత్ర! ప్రత్యర్థిదానవశతాహి
తాత్మచేష్టాగరిష్ఠత నరసి చూడ
నితఁడు జీమూతవాహనుం డింత నిక్క-
మింపు పొంపిరివోవ వీక్షింపు మితని. 172

వ. మఱియు నితండు హుతవహుండునుంబోలె బహువిగాఢ మఘవదధ్వరాజ్యాభిషేకవికస్వరతేజోవిరాజితుం డీశానమూర్తిభేదంబును దండధరుండునుంబోలెఁ బరప్రాణోత్క్రాంతిదానసమర్థశక్తిసంపన్నుండును సంజ్ఞానందకరుండును వరుణుండునుంబోలె ప్రతికూలవాతప్రచారచటులవాహినీసహస్రసంసేవితుండునుం బ్రచేతసుండు, నితనిం గనుంగొను, మిప్పురుషపంచకంబునందు నీకుం గన్నిచ్చకు వచ్చునతని వరియింపు మని పలికి పలుకుందొయ్యలి యూరకుండె, నప్పుడు మాయానిషధరాజకాయచ్ఛాయాంతర్వర్తు లగువిబుధచక్రవర్తుల నలువుర నతిక్రమించి పంచమకోటి యగునలునియందుఁ బురాకృతపరిపాకవాసనావశంబుననో పరమపాతివ్రత్యగుణగౌరవంబుననో జాత్యంతరసంగతి గ్రహణంబుననో యక్కురంగలోచనచూపు నెలవుకొనియె వెండియు. 173

క. ద్వాపర మపుడు విదర్భ
క్ష్మాపాలతనూజమనసు గలఁగించెఁ గలి
ద్వాపరములు నలదమయం
తీపరిణయమునకు సమ్మతింపనివె కదా! 174

చ. స్ఫురదవలేపతఁ నిషధభూపతు లేవురు కారణంబుగాఁ
బరువడినొయ్యనొయ్య యుగపత్పరిమోహాయమాణబాణుఁ

డై, మరుఁడు విదర్భరాజసుతమానసముం గలఁగింపఁ బూను
చుఁ, శరములసంఖ్యకుఁ ఫలము సమ్మతిఁ గాంచి నటింప
కుండునే? 175

చ. వెలయఁగఁ బంచనైషధి విభేదము నేర్పఱుపంగ లేక యా
కులత వహించి యిట్టితఱిఁ గూరిమినెచ్చెలి యొద్ద నుండెనేఁ
దెలియఁగఁజూచి చెప్పను గదే యని డెందమునం దలంచె నిం
పలర నరాళకేశి యమరాలయహేమమరాళపుంగవున్. 176

వ. శంకాలతావితానం బనేకసలావలంబి యగుచుం బ్రబ్బినం
గడు నిబ్బరం బగువిభ్రమంబున నావిదర్భసుతాసుభ్రూలలా
మంబు నెమ్మనంబున నిట్లని వితర్కించు. 177

సీ. ద్వివిధచంద్రమతిప్రతీతియో? కాకతి
స్వచ్ఛపదార్థోపసర్పణంబో?
యంగుళీముఖపీడితాక్షివిక్రియయొక్కొ?
మకరాంకుశాంబరీమహిమ యొక్కొ?
విరహకాలోద్భ్రాంతివిభవానువృత్తియో?
రూపింప నలువిశ్వరూప మొక్కొ?
గణుతింప వేల్పులకపటనాటక మొక్కొ?
భారతీపరిహాసభంగి యొక్కొ?

తే. కాక యీయేవురందు నొక్కరుఁడు నలుఁడొ?
మారుఁ డొక్కఁడొ? యొకఁడు పురూరవుండొ?
వరుస నున్నయీచక్కనివా రిరువురు
దేవతావైద్యయుగ్మంబొ? తెలియరాదు. 178

తే. విబుధవరు లేనిఁ బ్రణమిల్లి వేఁడుకొందు
నలుని వా రేల యిత్తురు నాకు నతని

మదనశోషణబాణసంపాతపీత
ఘనకృపాసింధుగహ్వరాకారమతులు ? 179

క. మంచకమధ్యస్థితమ
ద్వ్యంచకపంచకమునందు వరుసమెయిఁ బరీ
క్షించెద నే నొక్కించుక
పంచజనసుపర్వలక్ష్యపంచశ్రేణిన్. 180

వ. అనుచు నేవురం గలయం గనుంగొని యందు. 181

దమయంతి నలునిఁ దెలిసికొనుట

మ. ధరణిం బొందనికోమలాంఘ్రికమలద్వంద్వంబులుం ఘర్మశీ
కరసిక్తంబులు గానిఫాలములు వక్షఃక్షోణులం బత్త్రకే
సరముల్ గందనిపూవుదండలు నిమేషవ్యాఖ్యఁ బ్రైకోనిదృ
క్సరసీజంబులు నల్వురందుఁ గనియెం గాంతాలలామంబొగిన్.

వ. కని యైదవవాఁడు నిషధరాజగుట యెఱింగి దేవతాప్రసా
దంబు లేక యేకార్యంబు ఫలింపనేరదు. ప్రదక్షిణప్రక్రమ
ణాలవాలవిలేపధూపావరణాంబుసేకంబుల ననేకంబు లగు
ఫలంబు లీఁజాలుటం జేసి వేల్పులు కల్పద్రుమకాననంబులు
సుపర్వులకుం జేయు నమస్య సర్వార్థసిద్ధిసంధానసమస్య విబుధ
సేవ యఖిలాభీష్టప్రదానసురభి యనుచు సభాజనం బెల్ల
విస్మయం బంది కనుంగొనుచుండ దివిజసభాజనంబునకుం
బ్రారంభించి వైశద్యహృద్యంబు లగు ప్రస్తుతిప్రసూనస్తబ
కంబుల నింద్రాదిదేవచతుష్టయంబు సంతుష్టి నొందించి
తత్ప్రసాదలబ్ధం బైనబుద్ధివిభవంబున నమర్త్యవిలక్షణంబు
లగుధరణీక్షోదసంస్పర్శనంబును బ్రస్వేదబిందునిష్యందనం
బును గుసుమమాల్యమ్లాని యాదిగాఁ గలచిహ్నంబులను

సందేహంబు వాసి మనంబునకుం జూపునకును సంవాదంబు సమకూఱినం గందర్పమంబాశుంబులకు వశంవదయై చంచలం బగుకటాక్షాంచలం బతనిమూర్తిఁ బాయనుం డాయనుం జాలక యట్టాడ ననంతరంబ. 183

ఉ. భావములోనికీలు పరిపాటిఁ బరిస్ఫుటతర్క విలాసమున్
బ్రోవఁగ వేడ్కతో నిషధభూపతికై యొడయాడుదృష్టి ల
జ్జావతి యెట్టకేల కొకచందమున న్మగిడించి చేర్చె వా
గ్దేవిముఖేందుబింబమునఁదియ్యము నెయ్యమునుందలిర్పఁగన్.

వ. భారతీదేవియు నయ్యంగనయింగితం బెఱింగి తదీయ హస్తంబు నిజహస్తంబునం గీలుకొలిపి యుల్లంబు పల్లవింప నిలింపనిషధరాజులం గనుంగొని కనుంగొనల నలంతి నవ్వొలయ ని ట్లను:—నింద్రాగ్ని యమవరుణులు కరుణాతరంగి తంబు లగునంతరంగంబులతో నీయింతి ననుగ్రహింప వలయు. 185

ఉ. ఎట్టు వరించు సాధ్వి మిము నిందఱి? దేవచతుష్టయంబునం
దెట్టొకనిం దగంగ వరియించి తపస్యుల ధిక్కరించి వే
ఱ్వెట్టఁగ నేర్చుఁ? గావున వరించికృతార్థతఁబొందుఁగాక మీ
యట్టిమహానుభావు భవదంశసముద్భవు నైషధాధిపున్. 186

వ. అనిన విని లోకపాలచతుష్టయంబు కమలవిష్టరభామినీనిర్దే శంబును నిషధదేశాధీశచిత్తశుద్ధిపరీక్షణంబునుం దమయంతీ పరమపాతివ్రత్యగుణగౌరవంబునుం గారణంబుగా మనం బులం బ్రసాదంబు వహించి నలాకారమాయాకంచుకంబులు దిగఁద్రోచి భీమోద్భవాన్నృపతిసాత్త్వికభావావలోకనాపేక్ష బోలెఁ జక్షుస్సహస్రంబులో సహస్రాక్షుండును గామాంధ

కారగర్వనిర్వాపణదీపికాచక్రవాళంబునుం బోనికీలాజాలం బుతోం గిలియును సద్యోనిర్వాణమదనాగ్నిధూమంబుం బోనిధూమ్రదేహచ్ఛాయామండలంబుతో దండధరుండును నిరాశం బైనయాశాపాశంబునుం బోనిపాశంబుతోడం బాశపాణియు నిజరూపంబులు గైకొని, రప్పుడు కందర్ప దర్పాపహారపారీణం బైనవీరసేనతనయుమనోహరాకారంబు మాని వైమానికులు దమనిక్కంపురూపులు చేపట్టుట సామ్రాజ్యంబు విడిచి భిక్షాటనంబు పాటించినవిధంబును యౌవనంబుం బరిత్యజించి వార్ధకం బంగీకరించినభంగియుం దోంచెం బేరోలగం బున్న భూపాలపాలవర్గంబు గనుంగొను చుండ రూపాంతరపరిగ్రహంబొనర్చి యింద్రాదు లింద్ర జాలవిద్యావిదులచందంబు నొందిరి యనంతరంబ. 187

తే. క్షీరనీరవిభేదంబు చేసినట్టి
హంసియును బోలె హంసవాహునిదేవి
లీల దిక్పాలనిషధభూపాలవరుల
భేద మేర్పడంజేసి సంప్రీతి యొసంగ. 188

వ. దమయంతి కిట్లనియె. 189

తే. వీరె యాఖండలాదులు విబుధవరులు
వాండె నిషధాధినాథుండు వనజవదన!
భక్తి సొంపార వీరికిం బ్రణతి సేయు
మింపు పెంపారంగా వరియింపు మితని. 190

వ. అని యోంకారభద్రపీఠికాలంకారం బగుపంకజాసనునిరాణి నియోగింపం గంకణ ఝణఝణత్కారం బంకురింప నాళీ శాంకవదన వేల్పులకుం గేలుదోయి యెత్తి నమస్కరించె.

ఆశ్వాసాంతము

శా. సౌందర్యాపరమత్స్యలాంఛన! కళాసర్వజ్ఞ! యర్థార్థిమా
కందారామవసంత! సంతత మహాకారుణ్యపాథోనిధీ!
మందారద్రుమమంజరీమధుఝరీమాధుర్యమాధుర్యవా
క్సందర్భాస్వాదమానమానసకవిగ్రామా! బుధగ్రామణీ! 192

క. వీరావతార! రక్షణ
నారాయణరూప! రాయ నారాయణ! కం
ఠీరవవిక్రమ! వితరణ
పారాయణ! యుభయవంశపావనచరితా! 193

మాలిని. అవనగుణవిహారా! యంగనాచిత్తచోరా!
భువనభరితకీర్తి! పుణ్యకల్యాణమూర్తి!
కవికువలయచంద్రా! గౌరవశ్రీమహేంద్రా!
యవితథపటుకోపా! యప్రతీపప్రతాపా! 194

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్య పుత్త్ర సకలవిద్యాసనాథ శ్రీనాథప్రణీతంబైన శృంగార నైషధకావ్యంబునందుఁ బంచమాశ్వాసము.

శ్రీరస్తు

# శృంగార నైషధము

## షష్ఠాశ్వాసము



గురుశంకరమానిద
యాగౌరవనిత్యవర్ధితాన్వయ! కరుణా
సాగర! విజయరమైకస
మాగమలీలానుషంగ! మామిడిసింగా! 1

### నలమహారాజవరణము

ఉ. చిత్తగింపుము. 2

వ. మానితలీల నల్లన విమానము డిగ్గి వినూత్న రత్నసో
పానపరంపరాసరణి భారతిహస్తము గేల నూఁది పం
చాననమధ్య కాంచనమయం బగుమంచక మెక్కి చేర్చె న
మ్మానవనాథుకంఠమున మంగళనవ్యమధూకదామమున్. 3

వ. ఇట్లు దమయంతీకరార్పితంబై దూర్వాంకురాలంకృతంబును
మకరాంకపాశసంకాశంబును మధుపఝుంకారసంకులంబును
నుదారతారకానికరాకారంబును నై. 4

తే. ధారుణీపతినిద్దంపుఁ బేరురమున
నమరెఁ బ్రతిబింబమును దాను నలరుచుండ

బాహ్యమునఁ గొంత కొంత యభ్యంతరమునఁ
గీలుకొని యున్న మదనబాణాళివోలె. 5.

క. తెఱవ పులకాంకురంబులు
గిఱికొన నవ్వేళఁ జూడ్కికి ముదం బొసఁగెన్
గిఱకుఁబువు మొగ్గతూపులు
గిఱికొన్న మనోజశరధికిం బ్రతినిధి యై. 6.

చ. ధరణిపుచక్కి కట్టెదురఁ దామరసాక్షికిఁ జేష్ట నష్టతం
బొరసె మనోనురాగపరిపూర్తి నొకించుక సేపు నిర్భర
స్మరశరపుంఖసంఘటితషట్చరణప్రమదాగరుచ్ఛటా
స్ఫురదనిలావతారమున బోరనఁ దా మొదలెత్తెనో యనన్. .

ఉ. ఆహరిణాక్షి యిద్దయలరారెడుపువ్వులదండ జాతకౌ, తూ
హాలతన్ స్పృశించునెడఁ దోఁచెఁ కరంబున ఘర్మబిందుసం
దోహము తేని కవ్విధము దోఁపఁగఁజేసె నెఱిన్ భవిష్యదు
ద్వాహమహోత్సవంబునకుదర్పకుఁడిచ్చినహస్తతోయమున్. .

ఉ. చిత్తజుపువ్వుఁదూపుల రచించినతుమ్మెదతెక్కగాలిచే
నత్తఱి నేకువత్తి యగునంగన దూలినఁ దూలెఁ గాక య
త్యుత్తమ ధీరతాగుణసమున్నతి మేరుమహీధరంబు భూ
భృత్తిలకుండు నైషధుఁడు బిట్టు చలించెఁ గదా తదాహతిన్. .

క. బిట్టు ఘన స్తంభంబునఁ
గట్టువడె న్నిషధరాజు కామునిచేతం
బిట్టుఘన స్తంభంబున
గట్టువడం దగును రాజు గజరాజువలెన్. 10

వ. ఇవ్విధంబున. 11

ఇంద్రాదులు నలదమయంతులకు వరంబు లిచ్చుట

తే. పెద్దకాలంబునకు మనోభీప్సితంబు
సఫలమగుటయు నత్యంతసమ్మదమున
సొంపుదళుకొత్త నున్న యాదంపతులకుఁ
గరుణ దీవనలిచ్చె నిర్జరగణంబు. 12

వ. వెండియు నిషధమండలాధీశ్వరుండు దమకుం జేసిన దూతకృత్యంబునం గానంబడిన చిత్తశుద్ధికారణంబుగా నమ్మహీపతికి నమరపతి ప్రత్యక్షం బైనయాకారంబుతో యాగంబులయందు హవిర్భాగంబు భుజియించువాఁడయ్యె. హుతవహుం డిచ్ఛానురూపంబునం బ్రభవింప ననుమతించె. ధర్ముం డక్షయప్రహారణంబులును ధర్మైకనిరతబుద్ధియు నొసంగె. వరుణుండు దలఁచినచోటం జలంబులు సంభవింపను ధరియించినపుష్పంబులు వాడకుండ ననుగ్రహించె. అప్పుడు భారతీదేవి నానాభువనసమాగతానేకభూవరవర్ణనాప్రసంగోచితం బైనమానుషాకారంబు మాని వీణాపుస్తకపాణియు రోహిణీరమణచూడామణియును గుందేందుతుషారహారధవళంబును నగుదివ్యరూపంబు ధరియించె, నందఱు దమయంతి నుద్దేశించి. 13

ఉ. ఆదిమశక్తి వైనతుహినాచలరాజతనూజ వోలె ము
త్తైదువవై నిజేశ్వరునియర్ధశరీరము పాలుగొమ్ము నీ
పాదసరోరుహంబు లతిభక్తి భజింతురు గాక యెప్డు బ్ర
హ్మాదికదేవతాసదృశు లైనమహామహిమండలేశ్వరుల్. 14

మ. అని వైదర్భిఁ బ్రసాదగర్భమధురవ్యాహారసందర్భసం
జనితానందనుఁ జేసి నెయ్యమున నాశక్రాదిబృందారకుల్

వనితారత్నము చేతఁ గైకొనిరి సేవాహస్తపద్మాంజలుల్
ఘనరత్నాంచితహేమకంకణఝణత్కారంబు తోరంబుగాన్.

### సరస్వతి నలునకుఁ జింతామణిమంత్రం బుపదేశించుట

వ. అనంతరంబ నిషధమహీకాంతునిం గనుంగొని సరస్వతీదేవి యిట్లనియె. 16

ఉ. నేమముతోడ విశ్వధరణీభువనాధిప! సంతతంబుఁ జిం
తామణిమంత్రరాజము ప్రధానము మంత్రకదంబకంబులో
మామక మన్మహామనువు మానితభంగి భజింపు మీవు చిం
తామణికామధేనువిబుధద్రుమసన్నిభ మాశ్రితాళికిన్. 17

మ. సకలం బై హిమరుక్కళాభరణ మై సవ్యాపసవ్యార్థయు
గ్మకరూపం బయి శైవమై గతకళంకం బై శివం బై యుపా
సకచింతామణి యై ప్రసిద్ధిభగవచ్ఛబ్దాభిధేయార్థమై
యొకమంత్రంబు మదీయ మొప్పు నది నీ కుర్వీశ! యే నిచ్చితిన్.

వ. ఇది చింతామణిమంత్రం, బేతదుద్ధారప్రకారంబు రహస్యంబుగా నిప్పు డుపదేశించితి. గురుపరంపరాసంప్రదాయక్రమంబున సకీలకంబుగా సిద్ధసారస్వతసుసిద్ధికారణం బై నయిమ్మహావిద్య నెఱింగికొనుము. 19

క. ఆచారపరత వేకువ
లేచి పఠింపుము కుమారలేఖర్షభ! యీ
శ్రీచింతామణిమంత్రము
ప్రాచికి నభిముఖుఁడవై శుభం బొడఁగూడున్. 20

శా. సర్వాంగీణరసామృతస్తిమితవాచావీచివాచస్పతుల్
గర్వోన్నద్ధవిరోధిరాడుదధివాగ్గాంభీర్యకుంభోద్భవుల్

స్వార్వామాసదృశాంగనాజనమనస్సంచారపంచాస్త్ర లం
తర్వాణుల్ నృప! యస్మదీయ మగుచింతారత్నవిద్యాధరుల్.

సీ. కబరికాభరముపైఁ గన్నెగేదఁగిపువ్వు
  రేకుతోఁగూడ రేఖేనిఁ బోదివి
లలితకస్తూరికాతిలకమధ్యంబున
  సొబగొందుముత్యాలచుక్క నిలిపి
కుదురు నిండినమించుగుబ్బచన్నులమీఁద
  జిలుఁగుదువ్వలువ గంచెలయు దొడిఁగి
యచ్చవెన్నెలచాయ నవఘళింపఁగఁ జాలు
  నిద్దంపు వెలిపట్టు నెఱిక గట్టి
తే. యంచకొలఁకులఁ బూన్చినయరద మెక్కి
యుపనిషద్వీథి విహరించుచున్ననన్ను
మహితచింతామణీదివ్యమంత్రమూర్తిఁ
దలఁప సాస్వతం బయత్నమునఁ గలుగు. 22

క. ఎంత జడుఁడైనఁ గానీ
చింతామణిమంత్రరాజసేవాపరుఁ డ
శ్రాంతంబునఁ గవితాసి
ద్ధాంతరహస్యోపనిషదుపాధ్యాయుఁ డగున్. 23

క. వైదర్భిపోలెఁ గవితా
వైదర్భి నరేంద్ర! నీకు వశ మయ్యెడు సూ
ర్యోదయవేళ జపింపు కృ
తాదరమున నస్మదీయ మగుమంత్రంబున్. 24

సీ. కలియుగంబునయందుఁ గాశ్మీరభూమిలో
  మత్ప్రీతమున ధరామరుఁడు పుట్టు

శ్రీహీరుఁ డనఁగ శేషాహియంశంబున
నతఁడు మామల్లదేవ్యాఖ్యయైన
తనభార్యయందుఁ జింతామణీమంత్రచిం
తనఫలంబుగ నొక్కతనయుఁ గాంచుఁ
గల్పించు నతని కాకాశవాగ్దేవి తా
శ్రీహర్షుఁ డనియెడుచిహ్నసంబు
తే. వాని కేరేడువిద్యలు వచ్చియుండు
వాఁడు ఖండనకారుండు వాఁడు సుకవి
కావ్యముఖమున వానిచేఁ గలుగు నీకు
నిర్మలం బైనసత్కీర్తి నిషధరాజ! 25
క. నిను దమయంతిని ఋతుప
ర్ణునిఁ గర్కోటకుని నెవ్వరు దలంతురు మే
ల్కనునప్పు డుషగకాలం
బున నృప! కలికల్మషములు వొందవు వారిన్. 26
వ. హరియునుంబోలెఁ గలికలుషహారిగుణ సంకీర్తనుండవు పుణ్యశ్లోకుండవు నగుము పోయివచ్చెదను. పునర్దర్శనం బయ్యెడు నని పలికి యద్దేవి దమయంతిం జూచి దేవతలుం దానును మఱియును. 27
సీ. సకలపుణ్యాంగనాజనశిరోమణి వైన
నీకు పాతివ్రత్యనియతిఁ జేసి
సాధింపరానియాశాస్యంబు గలుగునే?
దైన దేవతల మైనట్టిమాకుఁ
బ్రత్యక్షమై మనోరథ మీక పోరాదు
మర్త్యుల కటుగాన మగువ! వినుము

నీదుపాతివ్రత్యనియమంబునకుఁ దప్పు
ఖలుఁడు భస్మంబవ్వుఁ గాత యప్పుడ
తే. కామరూపుల మగుమమ్ముఁ గాంచి నీవు
డెందమునఁ జాల నాశ్చర్యమంది తిపుడు
నిక్క మిది యాది గాఁగ నో నీరజాక్షి!
కామరూపిణి వగుము మాకరుణఁజేసి. 28

వ. అని పలికి పలుకుబోటియు హరిక్రీపీటభవశమనశంబరపతు లంబరంబునకు జాంబూనదవిమానారూఢులై యెగసిరి. సమయసముత్థానంబునం గ్రందుకొనురాజనందనుల యంది యలమొరపంబులతోడ గెడబెరసి దేవదుందుభిధ్వానంబు రోదసీకుహరంబునం దీటు కట్టె. విద్యాధరహస్తముక్తం బైనపుష్పవర్షంబు హర్షోత్కర్షంబు నాపాదించె. అప్పుడు కల్యాణవిభవలక్ష్మీప్రతిష్ఠాసమాసుం డగు నిషధరాజు నిజ శిబిరప్రతిష్ఠాసమాసుండయ్యె. దమయంతియుఁ గన్యాసహ స్రంబు గొల్వ నాత్మమందిరంబునకుం జనియె ననంతరంబ.

మ. తమయంశం బగుమేదినీరమణునిర్ధాత్రిఁ విసర్జించియా యమృతాశుల్ గడు విన్ననై చనిరి ముక్తాంశత్వఖేదంబు నన్, మమతాసంపదయెట్టిదో యెడ నెడన్ వక్త్రాననాం భోజన్మై, దమయంతిం గనుగొంచు నేఁగె వినతాంతర్వాణి శ్రీవాణియున్. 30

వలుఁదు విడిది కేఁగుట

ఉ. మంచకవాటికాశిబిరమధ్యమునందు ధనార్థికోటిపైఁ
గాంచనవర్షముల్ గురిసెఁ గంతవిలోలమధూకమాలికో

వంచితుఁ డోషధీపతికులాగ్రణి వందిజనంబులో విశే
షించి విదర్భజాస్తవనశీలుర మిక్కిలి గారవించుచున్. 31

వ. అప్పుడు గొంద అసూయాపరాయణులైన రాజు లారాజ కుమారుం జూచి చూపోపక 'యత్యుచ్ఛ్రియః పతనహేతు' వనెడువారు 'నతి సర్వత్ర గర్హితా' మనెడువారును 'కాము కస్య కుతో లజ్జా' యనువారును 'సంగమో విప్రయోగాంత' యనువారును నై యుండి రప్పుడు. 32

ఉ. నైషధుఁ డంతరంగమున నవ్వుచునుండు విరోధు లాడుదు
ర్భాషణముల్ వినీ విననిభంగి న దట్టిద విద్విషన్నృపా
దోషగుణాధిరోపణ మదోషతఁ దెల్పుచు నుండుఁ గానఁ ద
ద్దూషణ మెప్పు విన్నఁ బరితోషముఁ బొందు మనీషి
యాత్మలోన్. 33

క. క్రించు లగురాజతనయులు
వంచింపక యాడు దురపవాదోక్తులలోఁ
గొంచు నృపాలునిమ్రోలనుఁ
బంచమహాశబ్దములును బహుళము లయ్యెన్. 34

వ. ఇవ్విధంబున నిషధరాజు శిబిరంబు ప్రవేశించె నట విదర్భ మహీవల్లభుండును. 35

సీ. కార్తాంతికులఁ బిల్చి కర్పూరసమ్మిశ్ర
తాంబూలదానపూర్వంబు గాఁగ
జాంబూనదాంబర స్రక్చందనంబులఁ
బూజించి భూపాలపుంగవుండు
'సర్వలక్షణకళాసంపూర్ణమై యుద
యాస్తనిర్దోషమై యతిశయిల్లు

శోభనాంశము మీరు శోధించి చెప్పఁడా'
యని పల్క వారును నట్టిలగ్న

**తే.** మరసి చేపట్టి 'యాసన్న మయ్యె దేవ
శుభముహూర్తంబు గాలసంశుద్ధి లెస్స
పిలువఁ బంపుము వేవేగఁ బెండ్లికొడుకు'
ననిన 'నట్లనె కా' కంచు నాప్తజనుల. 36

## దమయంతీకల్యాణనేపథ్యము

**వ.** అంతఁ గుమారునిం దోడ్తేర నియమించె నట మున్న
కన్యాంతఃపురంబున. 37

**తే.** కువలయాక్షులు ముత్యాలచవికలోన
జలక మార్చిరి నిజకులాచారసరణిఁ
బసిఁడిపీఠంబుపై నుంచి పద్మనయనఁ
జెలువ మగుగన్నెరాకమ్ము నేతి కిచ్చి. 38

**తే.** గంధజలపూరితంబులై కమలముఖుల
కరములం దున్నమణిహేమకలశములకుఁ
జెలువ మగుభీమకన్యచన్నులకు నోడి
దాస్యమున నీళ్లు మోచుచందంబుఁ గలిగె. 39

**తే.** చెలువ నిర్వృత్తసలిలాభిషేచనయును
చంద్రికాపాండుపరిధానశాలినియును
నగుచు వర్షాశరత్తులయంతరమున
నొప్పుసంధ్యాధిదేవత కుద్ది యయ్యె. 40

**క.** సమధికచామరనిర్జయ
సముపార్జితవిమలకీర్తిశౌక్తికముక్తా

సముదయశంక ఘటించెఁ
గమలాసన చికురవారికణకోరకముల్. 41

క. నునుఁదాఁత మెఱుఁగు వెట్టిన
కనకశలాకయునుబోలెఁ గన్నియ యొప్పెన్
దను వగుతడియొత్తుమణుం
గునసొయ్యన మేనితడి యుగుర్పఁగ నొత్తన్. 42

ఉ. వాసనకేతకీదళమువంక గళంకములేని పైఁడి య
భ్యాసము చేసెనేని యగు నప్డు సమానము గంధసారచ
ర్చాసురభీకృతం బగుచుఁ జాఁబెతఁటిల్లతికామతల్లికా
భాసురవర్ణమైననరపాలతనూభవ దేహయష్టితోన్. 43

వ. తదనంతరంబ కనకవేదికాంతరంబునం బసిండిపీఠంబున నునిచి ప్రతిప్రతీకంబును బ్రతికర్మనిర్మాణకర్మఠం బైన సైరంధ్రికాజనం బప్పురంధ్రీరత్నంబుం బ్రయత్నంబున నలంకరింపం దొణంగె, నందొకముద్దియ మదనాంధకార పటారంభణతంతుసంతతియగు కుంతలమంజరికి నధివాస ధూపధూమం బొసంగె, నొక్కయలివేణి పెన్నెఱివేణిపై నెగయుచున్నధూపధూమాంకురంబు గనుంగొని కుటిలకచ చ్ఛటాభ్రాంతిం గొనగోళ్ల దువ్వంబోయినఁ జెలులు నవ్విరి, యొక్కయిందువదన గళింపకన్యకాభంగభంగురం బైననెఱితుఱుమునం జెంగలువలు దురిమె, నొక్కకుటిలా లక లలాటపట్టంబునం గేశాంబుదవిద్యుద్దండంబుగాఁ బసిండి పట్టంబు గట్టె, నొక్కవరవర్ణిని చూర్ణాలకంబులను నీలకజ్జ లంబులకు దీపజ్వాలంబుగా మనశ్శిలాచిత్రకంబు నొసలన్ హత్తించె నొక్కతన్వంగి యనంగలీలావశంబున నపాంగ

ప్రాంగణంబులకు నిగుడుకనీనికానీలమణులకుం గిరణకందళిక లనుసందేహంబు నాపాదింపంజాలునట్లుగా నీలాంజనరేఖలు వాలారుంగలికికన్నులకొలుకుల వెడలం దీర్చె నొక్కబోటి తాటంకమణిమహాగికలాపంబులను మరుపలాశకుసుమచాపంబులకుం దూపులుంబోలె నిందీవరావతంసంబులు చెవులం బొందుపఱిచె, నొక్కవిలాసిని నాసాతిలప్రసూనంబునం బ్రసూనశరగుళికాశరంబునుం బోనిముక్తాఫలకలాపంబుం దాపించె, నొక్కనితంబిని యధరబింబంబున యావకం బమర్చె, నొక్కకలకంఠకంఠి కంఠకందళికయందు గంటసరి దొడిగె, నొక్కయులనాఁగ పట్టో జఘాగంబునం బద్మరాగపతాకంబుం బదిలపఱిచె, నొక్కలేమ హేమమయమేఖలాదామంబు జఘనసీమంబునం గట్టె, నొక్కపూఁబోణి పైఁడియందియలు చరణారవిందంబులం దగిల్చె, నొక్కమత్తకాశిని యడుగునెత్తమ్ములం గ్రొత్తలత్తుక హత్తించె, మఱియు సాంగోపాంగంబుగాఁ బ్రత్యంగంబు సంగనలు ముత్యాలజల్లి చెందిరంపుఁజేరుచుక్క చిన్నిపూఱేకులు బాశికలు, మకరికాపత్రభంగంబులు హారంబులుం గేయూరంబులుం గంకణంబులు మట్టెయలు వీరముద్దియలు పాయవట్టంబులాదిగాఁ గల యలంకారంబుల నలంకరించిరి. ఇవ్విభూషణంబులచేత భాగ్యంబుచేత నీతియు ధర్మంబుచేత విభూతియు వితరణంబుచేత విఖ్యాతియుంబోలె సన్నాతి యతిశయిల్లె నయ్యవసరంబున. 44

ఉ. అంతర మెట్టిదో యని నిజాస్యముతోఁ బ్రతివెట్టి రోహిణీ
కాంతుఁ బరీక్ష సేయుటకుఁ గా సటు పట్టినభంగి లీల న

య్యెంతి ధరించె భూషణము లెల్ల వహించినయంతమీఁదఁ గు
ద్ధాంతవధూటియొక్క తె ప్రియంబుననిచ్చినమించుటద్దమున్.
తే. నవచతుర్విధశృంగార మవధరించి
యమ్మహాదేవి విప్రపుణ్యాంగనలకు
సకలపూజలు వేడ్కతో సరగఁ జేసి
మోడ్పుఁగేలెత్తి ఫాలంబు మోపి మ్రొక్కె. 46
ఉ. అంతర మొప్పశోభనసమాగతబాంధవభూమిపాలశు
ద్ధాంతనితంబినీనివహ మప్డు ప్రణామ మొనర్చె భీమభూ
కాంతునికూర్మికన్యకకుఁ గౌతుకభూషణభూషితాంగి క
త్యంతఘృణాతిక్రియారవణహాటకనూపురపారిహార్యమై. 47

నలునికల్యాణనేపథ్యము

వ. అటఁ గుమారుఁడును మంగళాభిషేకానంతరంబ యాకల్ప
కల్పనాశిల్పపారగ లగు ప్రౌఢాంగనాజనంబులవలన వివా
హోచితం బగుశృంగారం బంగీకరించె నప్పుడు. 48
తే. అభినవోచితతాలవృంతానిలమున
నల్లనల్లనఁ దడి యార్చి యతివ యొర్తు
ధారుణీనాయకునికేశభారమునకు
నగరుధూపాధివాసనం బాచరించె. 49
ఉ. వెన్నెలకుప్పసంబిడిన వింతవిలాసము వాసి కెక్కఁగాఁ
గిన్నరకంఠి యొర్తు మరుకీర్తియుఁ బోనిపటీరపంకము
న్విన్నను వొప్పఁగా నలఁదె నిద్దపుఁజాయ మెఱుంగునం బదా
ర్వన్నెపసిండితోడ నొర వచ్చునృపాలునియంగకంబులన్.
చ. లలితకలాపకోమలకలాపికలాపకలాపనవ్య వే
శలమృదుకేశమంజరులు సన్నపుగోళ్లను జిక్కు వాపి చెం

గలువలు జాజులుం గలయఁ గమ్మనిపువ్వులసేసకొప్పు డా
పలి కొరుగంగఁ బెట్టె నొకభామిని నైషధభూమిభర్తకున్.
ఉ. రాజనిభాస్య యొక్తె నవరత్నకిరీటము సంఘటించె ని
ర్వ్యాజమనోజ్ఞ మైనమహివల్లభమూర్ధమునందు నప్పు డా
రాజనుకల్పశాఖ కది రత్న మయం బగుపువ్వుగుత్తిపే
రోజ వహించి కన్నులకు నుత్సవముం బొనరించె నెంతయున్.
మ. పదియార్వన్నె పసిండిపట్టు మసనీపాలావతంసంబునె [గా
న్నుదుటం గట్టె లతాంగి యొక్తె కడవీను లొప్పంగ నేర్పొప్పఁ
నది లీలాపరివేషచక్రవలయార్ధాకారతం బొందె స
ద్వదనీయాననచంద్రమండలము చంద్రాధిక్యముం బొందుటన్.
శా. భామా యొక్కజితకుండలాభరణము ల్బాభూవలంబంబు లై
భూమీవల్లభసూనుప్రేలుచెవులం బొల్పారె గండస్థలీ
సీమాంతప్రతిబింబమండలయుగశ్రీసంవిభాగంబుతోఁ [న్.
గామస్యందన హేమచక్రయుగయుగ్మంబుల్ విడంబించుచు
ఉ. ఇందునిభాస్య యొక్తె గదియించెఁ గుమారుని పేసపంబునం
గందక యాణి పాణియును గల్గినతోరపుఁబారహారముల్
జెందిలిపాటు లేక యదనీయముఖేందువినిర్గళత్సుధా[యనన్.
తుందిలబిందుబృందములు తోయముఁ గైకొని యుండెనో
తే. తరుణసైరంధ్రికాప్రయత్నమునఁ జేసి
యతనివ్రేళ్లు సముద్రంబు లయ్యె నపుడు
ఘనసమూహంబు కమలాభికాంక్షఁ జేసి
తద్వితీర్ణికి జను టన్వితంబు గాఁగ. ౬6
క. అలవరిచె నృపతికరముల
వలికుంతల యొకతె. కంకణాభరణంబుల్

నలహ_స్తకల్పకములకు
వలయములవి యాలవాలవలయము లయ్యెన్. 57

మ. భుజదండంబున నొక్క_భామ దొడిగెన్ భూభర్తకున్ భూరిది
గ్విజయారంభవిజృంభణార్చితమహాకీర్తిప్రతాపప్రభా
వ్రజశంకావహనూత్నవజ్రమణిరుగ్వ్యాపారదుర్వారముం
ద్రిజగల్లోచనసర్వదానకలనాధీరంబుఁ గేయూరమున్. 58

వ. అట్లు శృంగారం బంగీకరించిన. 59

ఉ. ఔచితి గావున న్నిలువుటద్దమునందు నిజాస్యబింబముం
జూచెనె కాని మున్న యతిశోభనరూపవిలాసవుష్పనా
రాచుఁడు రాజలంకృతివిరామమునందు నిజాభిరామ్యముం
జూచినవాఁడు భూషణపుశుద్ధమహామణిమండలంబునన్. 60

తే. రాజు దొడిగినదివ్యాభరణచయంబు
నెల్లవారును రతిఁ జూచు టేమి చెప్ప
నొరిమ నొండొంటిఁ జూచునాభరణములును
విమలహారినీలమణివిభావీక్షణముల. 61

నలుఁడు కల్యాణమంటపంబున కేతెంచుట

వ. అనంతరంబ వార్ష్ణేయనియంతృకం బైనరథం బెక్కి యమ్మహా
రథుండు జిష్ణుండును గిరీటియును విజయుండును నగుటం జేసి
ధనంజయుం డనం బొలిచి రాజమార్గంబునం జనునప్పుడు
పౌరాంగనలయందు. 62

తే. తమ్ములము సేయుచో నొక్క_తలిరుఁబోణి
రాకుమారునిఁ జూచుపరాకుకతన

మఱచి తాంబూలపత్త్రంబు మాఱుగాఁగఁ
గఱచెఁ గెంగేలినడికేలికమలదళము. 63

మ. జవరా లొక్క ర్తు ప్రియోపనాయకభుజాసంశ్లేషలీలాసుఖ
వ్యసనాయంబు సమాజసంకటమునం బ్రార్థించి కై కొంచు భూ
ధవదేవేంద్రునిఁ జూచె హేమకలశద్వైరాజ్యసంపత్తివై
భవశుంభత్కుచకుంభపీఠిఁ బులకప్రారంభమేపారఁగన్. 64

తే. ఒక్కతరలాక్షి యప్సరోయువతివోలెఁ
జూచెఁ గనుఱెప్ప వెట్టక రాచవాని
రాజసంబున వలరాచరాచవాఁడు
తేఁటిఱెక్కలగఱియమ్ముఁ దీడుకొనఁగ. 65

తే. ఎల్లచిగురాకుఁబోండ్లకు నెంతవేడ్క
యంతవేడుక దనలోన నతిశయిల్ల
నొక్కగుబ్బలకొమరాలు చక్క వచ్చి
కనియె నొడలెల్లఁ గన్నులై మనుజవిభుని. 66

మ. జిలుగుంబయ్యెద జిరువాఱి యెడలన్ శృంగారపత్త్రాంకురం
బులతో నొక్కచకోరలోచనకుచంబుల్ పూర్ణకల్యాణమం
గళకుంభంబులు నూత్నపల్లవవిభంగశ్రీసమేతంబులై
నలలిం జెన్నెసలారె నైషధమహీనాథావలోకంబునన్. 67

సీ. కలికిచూపులు రత్నకలికాకలాపంబు
గుబ్బచన్నులు హేమకుంభవితతి
మెఱుఁగుఁజెక్కులు క్రొత్తమించుటద్దంబులు
పాణియుగ్మంబులు పల్లవములు
వెలఁదిమందస్మితంబులు కమ్మఁబువ్వులు
పలుకులు వల్లకీకలకలములు

పరిపాటలోష్ఠబింబములు జుంటియతేనె
తనుకాంతియోలగందంపుఁబసపు
తే. గాఁగ సౌభాగ్యవివిధమంగళపదార్థ
వర్గములు గ్రంతనడచుభావంబు దోఁచఁ
బౌరకాంతలు రాజకుమారవర్మ
నోత్సవంబున కేతెంచు చున్న యపుడు. 68

స్రగ్ధర.—
ఈతండే పాడిజాణం
డితఁడె మగలరా జీతఁడే ధీరుఁ డంచుం
జేతోమోదంబుసం జూ
చిరి పురయువతుల్ చిత్తసంజాతమూర్తిన్
జ్యోతిష్టోమాదియజ్ఞ
శ్రుతఫలనిఖిలక్షోణిసామ్రాజ్యలక్ష్మీ
పాతివ్రత్యైకదీక్షా
పణితు నిషధభూపాలు దిక్పాలుమిత్రున్. 69

వ. అప్పుడు పౌరాంగనలు దమలోన? 70

మ. తనకుం దాన పురందరాదిదివిజేంద్రవ్రాతముం దెచ్చి ని
ల్చిన సంప్రీతి వరాటకన్యక వరించెం గాపునః ఫాలలో
చనకోపానలదగ్ధమన్మథమహాసామ్రాజ్యకంఠీరవా
సన మెక్కం దగు వీఁడకుంఠితవిలాసప్రౌఢభావంబునన్. 71

సీ. సుద్యుమ్నుఁ డనురాజు సుగతినై యెవ్వానిఁ
బ్రథమసీమంతగర్భమునఁ గాంచె
గ్రహరాజుగారాపురాణివాసంబైన
గంధర్వి యెవ్వారిఁ గన్న తల్లి

యిన్నూఱు మున్నూఱు నేనూఱు కన్నులు
గలవేలు పెవ్వాని గన్నతండ్రి
రజతాచలం బేలురాజుపట్టపుదేవి
గౌరియెవ్వని గాంచె గొడ్డు నీఁగి
తే. యాపురూరవుఁ డావసుఁ డాజయంతుఁ
డాపులస్త్యజామనుమఁ డీయధిపుతోడ
సాటి యగుదురె నిఖిలవిశ్వంబులోన
భావసమ్మోహనాతిసౌభాగ్య రేఖ? 72

మ. సమయోత్కంఠితకంఠలోలవసుధాస్రగ్భూషణుం డైనయీ
దమయంతీవరుఁ జూచి తావిడిని సుత్రాముండు వోకుంట పం
తము, నిర్లజ్జతఁ బోయె నేఁ డసు నిరర్థప్రార్థనుఁడ వోఁటినె
య్యమునం జేపఁగ నేల యిచ్చు శచి యాత్మాంతికపురో
ద్దేశమున్? 73

మ. విబుధేంద్రావరణప్రసాదితశచీవిశ్రాణితాశీస్వచ
స్స్తబకవ్రాతములుఁ దిగీశపురుషార్థప్రక్రమోపార్జిత
ప్రబలఖ్యాతియుఁ బూఁటకాఁపులు సుఁడీ భావించిచూడంగని
య్యబలారత్ననృపాలరత్నములనిత్యైశ్వర్యసంపత్తికిన్. 74

శా. చేసెం గావలయున్ విరించి నిఖిలస్త్రీపుంససంయోజనా
భ్యాసప్రౌఢి ప్రకాశ మొందఁ గడు వియ్యం బైనసంసర్గ మి
ట్లాసంసారపురంధ్రిపూరుషమిథోహర్షోదయప్రేమలన్ [కిన్.
జేసెం గావలసున్ మరుండు హృదయాంభోజంబుల స్వైరి

శా. వైదర్భీబహుజన్మనిష్కలతపోవర్ధిష్ణుతల్లోచన
స్వాదుప్రౌఢవిలాసుఁ డీవసుమతీచక్రేశపుష్పాయుధుం

డాదిత్యాలయసార్వభౌమసుకృతాహంకారదుష్ప్రాపమే
మీదాంపత్యమునం జిరాయువయి నెమ్మింబొందుఁ గా
కెంతయున్. 76

శా. సంబంధం బిటుగూడునే రమణికిన్! త్వాభర్తకున్నే త్రప
ర్వంబై యుండె స్వయంవరం బసితగౌరస్మేరదృగ్రోచులన్
బింబోష్ఠీనివహం బమోఘకుతుకప్రేమంబులన్ వీరి మా
ఘం బాడించెనఘాఽతిఘాతియమునాగం గౌఘయోగంబు
నన్. 77

తే. దివిజపతిఁ బొందెనేని రెండవశచి యగు
ధరణిపతిఁ బొంద దమయంతితనము చెడదు
తివిరి శచి యాట దమయంతి యవుటఁ బోల
దింతి యీతారతమ్య మెఱ్ఱిఁగె నొక్కొ? 78

శా. స్వారాజప్రముఖామరప్రవరులన్ వర్జించి లజ్జాపరీ
హారంబుం బొనరించె రాజులకు సంప్రార్థించి తా దేవస
త్కారంబై యితని న్వరించినవివేకప్రౌఢిఁ దద్దేవతా [యున్.
శ్రీరోపాపయశఃప్రపూర్జన మొనర్చెన్ భైమి మే లెంత

వ. అనుచు నీచందంబునం గ్రందుకొని యిందీవరాక్షులు
డెందంబు లానందజలధిం దేలియాడం గొనియాడుచు
సందర్శనోత్సవం బనుభవింపం గుమారబృందారకుండు
కురువిందకందళితసందోహసుందరకరుం డగుటను సుహృద
యానందుం డగుటనుఁ బొడవుచందురునిం దొరయుచుఁ
బురందరహరిక్రీడామందిరం బగు నుదయగిరికందరంబునుం
బోని కనకస్యందనంబుపై హరిద్రాభంగరంగంబుల భంగింప
నంగలించునఖిలాంగకంబులం దొడిగినమంగళాభరణంబులం

గీలింపంబడినయింద్రనీలంబుల మెఱుంగుల చెఱంగులు పౌరాంగనాపాంగదృక్తరంగంబుల నాలింగనంబు సేయం గంకణఝణఝణత్కారంబు తోరంబుగాఁ బంకజాక్షులు వీచువీచోపులం బొడముసన్నకరువలిపొలపంబుల సున్నంబులై యున్నకురులు పొలుపార మందగమనంబున వందిసందోహసంకీర్తనంబును మాగధమధురగానంబును పాఠకపఠనరవంబును మనంబు రంజింపంజేయ ముందఱం జనుమూర్ధాభిషిక్తులమణికిరీటంబు లనునడదివియలవోడం గస్తూరికాగంధతైలధారాసిక్తప్రదీపితంబు లగుకరదీపికాసహస్రంబులు నాసీరగతతురఙ్గాఖరఖురపుటఘట్టనంబులం బుట్టినధరణీపరాగంబున దట్టంబైనసంధ్యాంధకారంబు దూరంబు సేయంగరిఘటాకంఠగ్రైవేయ ఘంటికా టంకారంబులఁ బ్రోదిసేయుచుఁ బుంఖానుపుంఖంబుగా శంఖకాహళభేరీమృదంగ వేణువీణానినాదంబులు రోదసీకటాహంబు నుద్ఘాటింపంబటత్పట్టపతాకాభిరామంబును సముత్తంభితరంభాస్తంభసంభారంబునుఁ గర్పూరపాంసువిరచిత గంగవల్లీమతల్లికావేల్లితప్రాంగణంబును కస్తూరికర్దమాలిప్తవితర్దికాద్వితయోపశోభితంబును పుణ్యాంగనాకరకిసలయావలంబితచూతపల్లవలాజాక్షతాదిశోభనపదార్థసార్థంబును నైనరాజమందిరంబు చేరం జనుదెంచునప్పుడు. 80

ఉ. చేరెను లగ్నవేళ యతిశీఘ్రము రమ్మని విన్నపింపఁ బుత్తేరఁగ నంతనంతఁ జనుదెంతురు కుంతలగౌడచోళగాంధారముఖావనీశులు విదర్భనరేంద్రునియాజ్ఞఁ బాదసంచారమునన్ శశాంకకులసంభవుపాలికి భక్తినమ్రులై. 81

సీ. యామవేగండకర్ణానిలస్ఫాలన
విలసితభ్రూవల్లి వేల్లనముగఁ
దోరణమాలికాహీరాంకురచ్ఛాయ
వెలఁది లేఁజిఱునవ్వు మొలక గాఁగఁ
బ్రోదిరంభాస్తంభములమోసుటాకులు
లలిఁ బచ్చపట్టుచేలంబు గాఁగ
వీతెంచుమృదువేణువీణానినాదంబు
కలికితియ్యనినున్నపలుకు గాఁగఁ

తే. జేరఁటాండ్రకరు వాస్తపంకేరుహములఁ
బూఁచి యెత్తినకనకంపుఁబూజెకుండ
లున్నతస్తనములు గాఁగనొప్పుమిగిలెఁ
దరుణియునుబోలె నృపగృహద్వారభూమి. 82

ఉ. శంబరవైరిమూర్తి జలజద్విషదన్వయచక్రవర్తి ర
మ్యంబగు మందయానమున నర్థిమెయిం జనుదెంచెఁ గేతుచీ
నాంబరవల్లివేల్లనవిహారతరంగితవారివాహమా
ర్గం బగు రాగమందిరముప్రాంగణభూమికి సమ్మదంబునన్. 83

తే. ఎదురుగా నేగుదెంచుచో నింద్రమయ్యెఁ
బెండ్లి యిరువంకచుట్టంపుఁబెద్దలకును
నాభిముఖ్యోచితీసమ్యగర్హణార్హ
భాషణాలింగనాదిసంభావనముల. 84

మ. దమయంతీప్రియసోదరుండు దముఁ డాద్వారప్రదేశంబు నె
య్యమునం గాల్నడ నేఁగుదెంచెఁ బరిచర్యాయుక్తిగాఁ బాపు
వియ్యముఁ దోడ్కొం చరుగంగఁ గంచుకపరీహారంబునం

దారహారమదోరంబుగ. జేపపంబున విహారక్రీడ వాటింప
గన్. 85

**తే.** సైన్యముల నెల్ల వెలినుండ జాటఁ బనివి
వలయుపడవాళ్ల రాకుమారులను దొరల
నిషధరాజును గొలిచిరా నియతిఁ జేసె
ననుఁగు మొగసాల గ్రథకైశికావనిపుఁడు. 86

**వ.** అనంతరంబ యభ్యంతరకక్ష్యావిభాగంబున నరదంబు డిగ్గి
పుణ్యాంగనావిహితనీరాజనాది మంగళోపచారసంపన్నుండై గా
రాపుసియ్యంపుముం జేయి కరతలంబున నవలంబించి యల్ల
నల్లన నడిచి బంధుజనపరంపరాపరివేష్టితుండై పురోహిత
బ్రాహ్మణసహితుండై పురంధ్రీనికురంబసంబాధభరితం బయిన
వివాహమంటపంబు చేరం జనుదెంచి దూరంబున నెదురుగా
వచ్చుభీమభూపాలునకు నభివాదనంబు సేసి యతం డునుప
సమున్నతకనకాసనంబున నాసీనుండై. 87

నలదమయంతీపరిణయము

**ఉ.** పారణ చేసె రాజు మధుపర్కపుఁదేనియ మామ భీమధా
త్రీరమణుండు మంత్రసముదీరణపూర్వము గాఁగ నీయఁద
త్పారణ భోజభూపతిసుతామధురాధరచుంబనక్రియా[న్.
పారణకు న్నిదాన మయి భావము లువ్విళు లూరఁ జేయఁగ

**చ.** సకలధరాధినాథునకుఁ జంద్రనిభాస్యకుఁ గేలుఁదామరల
ప్రకటము గాఁగఁ గట్టువడెఁ బావనకౌతుకసూత్రపంక్తిచే
నొకటి పరోపఘాతకర మొక్కటిపంకజకాంతితస్కరం
బొకమరి యేల కట్టువడ కుండు మహీపతియాజ్ఞ గల్గినన్?

తే. నృపతిచేతికి మీఁదుగా నెలఁతచేయి
గీలుకొనఁజేసె నొకవేఱఁటాలపడఁతి
యదియుఁ బుణ్యాహవాచనావాప్తియయ్యె
భావియగునంబుజాక్షీపుంభావమునకు. 90

వ. అనంతరంబ. 91

ఉ. వాసికి నెక్కుకూర్మి జనవల్లభుఁ డిచ్చెను వైరసేని క
బ్జాసనవంద్య దుర్గ తన కర్థి పరంబుగ నిచ్చె నెద్దియ
క్కాసురరక్తబీజమధుకైటభశుంభనిశుంభచండముం
డాసురకంఠఖండనవిహారమహోగ్రము మండలాగ్రమున్.

క. సంతోషంబున ధరణీ
కాంతుం డల్లునకు నిచ్చె గాఢా మారం
జింతామణిదామకముఁ
జింతితకామప్రదానశితపోషమమున్. 93

తే. జమునినాలుకతో నెకసక్కె మాడఁ
దమకపడుక్రొత్తపైఁడిమోళముగటారి
భీమనృపుఁ డిచ్చె గారాపుఁబెద్దపెండ్లి
కొడుకుఁగుఱ్ఱకు నైషధక్షోణిపతికి. 94

తే. వీరమాహేశ్వరాచారపారగునకుఁ
దనకు శశిమౌళి యిచ్చినకనకరథము
కామగమనంబు నైషధక్ష్మావరునకు
మామ యిచ్చెను మా యని మహి నుతింప. 95

క. అల్లునికి నిచ్చె ధాత్రీ
వల్లభుఁ డనురక్తి నమరవల్లభుహరితో

నుల్లస మాడం జాలెదు
తెల్లనియొకకత్తలాని తేజీహయమున్. 96

తే. ప్రథమజామాత కిచ్చె భూపాలతిలకుఁ
డగ్నిశోభంబు లైనదివ్యాంబరములు
సౌహృదంబు ఘటింప వైశ్వానరుండు
దనకు నెయ్యవి పుత్తెంచెఁ దాసు మొదల. 97

తే. మలఁచి యేకాండముగ నొక్కమానికమున
వేడ్క నెద్దాని నిర్మించె విశ్వకర్మ
యట్టిదేవేంద్రదత్తమహార్ఘ్యనూత్న
వీటికాపేటి మామ భూవిభున కొసఁగె. 98

మ. పవనాహారవిషంబు సోఁకదు యదౌపమ్యంబునం గేకిఁ గే
కివిలాసంబునఁ దాండవాఁభటి సంక్రీడించుటన్ క్ష్వేళ మ
భ్యవహరించెఁ గపాలియన్న మఱియేలాచెప్పఁ దచ్ఛక్తిఁ య
న్నవగారుత్మతభుక్తిపాత్రయొసఁగెన్ రాజాత్మజాభర్తకున్.

చ. గరిమవరాటరాజు దనగాదిలియల్లున కిచ్చె ఘోటికా
కరటిపటీపటీరగణికామణికాంచనముఖ్యవస్తువుల్
పరిణయదక్షిణార్థ మయి ప్రౌఢత మీఱఁగ నప్పదార్థముల్
సరిఁ బరిపాటి నెన్నఁగ నశక్యము గీష్పతియంతవానికిన్.

సీ. భక్తిఁ బ్రదక్షిణప్రక్రమంబులఁ జేసి
రాశుశుక్షణికి నుపాసనంబు
నంశుకగ్రంథికల్యాణక్రియాచార
మాచరించిరి మందహాస మెసఁగ
నఱ్ఱెత్తి చూచిరి యాకాశమండలా
స్థానరత్నంబు నౌత్తానపాదిఁ

త్రైలోక్యపతిదేవతాఫాలతిలకంబు
దివిరి యరుంధతీదేవిఁ గనిరి
తే. బ్రాహ్మణోత్తమపుణ్యపురంధ్రివర్గ
మంగళాశీర్వచోయుక్తమహితశోభ
నాక్షతారోపణంబుల నావరించి
రంబుజాక్షియు నిషధదేశాధిపతియు. 102

ఉ. *కంకణనిక్వణంబు మొగకట్టఁగఁ గౌనసియాడ రత్నతా
టంకవిభూషణంబులు వడంకఁ గుచంబులు రాయిడింపఁగాఁ
బంకజనేత్ర గౌతమునిపంపున లాజలు దోయిలించి ధూ
మాంకునియందు వేల్చెనగహాసము తెప్పలలోనదాఁచుచున్.

సీ. చెక్కుటద్దములపైఁ జెఱలాడునప్పుడు
కస్తూరికాపత్రకములఁబోలె
శ్రవణపాశములలో జాఁగి పాఱెడునప్డు
లలితతమాలపల్లవముఁబోలెఁ
గలికికన్నులలోనఁ బొలుపారునప్పుడు
నవలీలనీలాంజనంబుఁబోలె
ఫాలభాగంబుపైఁ బఱతెంచునప్పుడు
కమనీయచూర్ణాలకములఁబోలె
తే. నప్పు డావర్జితాజ్యధారాభిఘార
పరిమిళల్లాజనవశమీపల్లవాగ్ర
హుతహుతాశనజిహ్వాసముత్థ మగుచు
హోమధూమంబు బాలపైనొయ్యఁ బొలసి. 103

ఉ. కాంచనముద్రికామణినికాయకరాళవలన్మయూఖరే
ఖాంచలచక్రచుంబితనఖాంకుర మైననృపాలుచెట్టఁ బ

ట్టించెఁ బ్రమోదసంపద ఘటిల్లఁగ నొక్కపురంధ్రి నవ్యరో
మాంచము గ్రొత్తలేఁజెమరు నయ్యుయగేలను సంభవింపఁగన్.

వ. ఇట్లు పాణిగ్రహణం బొనర్చి పురంధ్రీజనవిలోకనార్థంబు సహస్రరంధ్రీకృతంబుగాఁ జేయంబడినకౌతుకాగారంబుఁ బ్రవేశించి. 105

తే. దశశతాక్షుఁడు దొడుగుకుందనపుఁబైఁడి
కంకటముఁబోలు వేజాలకములయింటి
మధ్యభాగంబునందు శ్రీమంచ మెక్కె
రంబుజాక్షియు నిషధదేశాధిపతియు. 106

వ. అనంతరంబ భోజకులాభరణంబు లగుదమదమను లిరువంకఁ బెండ్లిచుట్టంబులకు భోజనంబులు వెట్టం గట్టడచేసి రప్పుడు.

బువ్వపుబంతి

సీ. పట్టాంశుకములపైఁ బన్నీరుఁ బ్రోక్షించి
జేయార్చి చేపట్లు సేయువారు
మక్కళించినతావు మంజిళ్లపెందెర
లుంగరంబులఁ బట్టియొత్తువారు
నగరుధూపము వెట్టి యభ్యంతరం బైన
గగనావకాశంబుఁ బొగపువారు
వెండియొడ్డెనలపై వెలచి తెచ్చినపైఁడి
పళ్లెంబు లాయత్తపఱుచువారు

తే. రంకుమృగరోమకృతనూత్నరత్నకంబ
ళాదినానావిధాభ్యర్హితాసనములు
వెట్టువారును నైరిందుబింబవదన
లుభయబాంధవభోజనోద్యోగవేళ. 108

క. ప్రయ్యవడకుండ నాడిరి
వియ్యపుమేలంబు లుభయవిధబాంధవులున్
నెయ్యంబునఁ బియ్యంబున
నొయ్యనఁ జతురాక్షరాధికోక్తిప్రౌఢిన్. 109

సీ. సర్వతోముఖపిపాసకుఁ దప్పిఁ బడియెదు
కామమోదనము నిక్కముగ వలయు
నీముఖంబున మాకు నెఱయంగ సుఖమబ్బుఁ
గాంచుఁ గావుత నిన్నుఁ గమలయోని
యనులోమమున లెస్సపనిఁ జేసికొం టిప్డు
భగవదారాధనప్రాప్తినిధివి
విద్వజ్జనులు నిన్ను విషయించి వత్తురు
కలమధురములు నీగళరవంబు
తే. లనుచు నెయ్యంపువియ్యంబు లల్లనల్ల
సరసవక్రోక్తిఁ జాతుర్యసౌష్ఠవముగ
గోష్ఠి సలిపిరి దమలోనఁ గొంత ప్రొద్దు
భోజనాగారపర్యంతభూములందు. 110

చ. లలన యొకర్తు వగ్గుకృకలాసముఁ జేరఁగ దెచ్చి వంచనన్
నలునకుఁ గుంచెవట్టు నెలనాగ పదద్వయమధ్యమంబునన్
నిలిపినఁ గాలు ప్రాఁక నది నీవియు వీడఁగఁ దోడిభామినుల్
గలకల నవ్వ నూడ్చె నది గట్టినపుట్టముపాయ శూన్యతన్.

చ. అలికులవేణి యోర్తొకనిహస్తముల న్సుఖమజ్జనాంబువుల్
గలఁతియ యెత్తి పోయ నవి గార్చుచునుండె నతండు దోయి
టన్, నెలకొని దాని క్రొమ్మెఱుఁగునిద్దపుఁజెక్కులుముద్దువెట్టు
కోఁ, గెళవులవారిచూపుగిలిగిల్లి మొఱంగఁగ వేళఁగోరుచున్.

ఉ. అవ్వలిదిక్కుమో మయి ప్రియంబున నొండులతోడ ముచ్చ
టల్, ద్రవ్వుచు నొక్కకోమలి పరాకున నుండఁగ ధూర్తుఁ
డొక్కరుం, డివ్వల వచ్చి వంచనమెయిన్ నునుమించు
మెఱుంగుటద్దము, న్నవ్వుచుఁ బట్టె దాని చరణంబులకు
న్నడు మైనమేదినిన్. 113

తే. 'ఓమెయేమె యిదేమేమె లేమ! యేమె
మేఘుపుష్పంబుఁ దే?' యంచు మేలమాడ
'మేమె మేమెలు వఱ చయ్యె మేలుమేలు
మేఁకమేఁ' కన సభవారు నిగుల నగిరి. 114

*ఉ. లాలనఁ గ్రొత్తబెబ్బులికళాసము వెట్టిరి యాసనంబుగా
గోలయు సాధు వైనయొకకోమలికిన్ నిషధేంద్రుబచ్చుకున్
మేలపుమైవడిం దమసమీపపుధూర్తులు తత్పురస్స్థలాం
గూలత యవ్వణిక్కనకుఁ గోశవిజృంభణశంక సేయఁగన్.

తే. పెడమరలి చూచె నొకచంద్రబింబవదన
వేడ్కదళుకొత్తనొకరాజవిటకుమారుఁ
బెడమరలి యేసె వాని నప్పుడ మరుండు
సానఁబెట్టిన మోహనాస్త్రంబుఁ దొడిగి. 116

ఉ. ఇంచినభక్తి నొక్కతరళేక్షణ నైషధభూమిభర్తమ
న్నించువరూధినీపతికి నేరుపు మీఱఁగ వట్టివేళ్లఁ గా
వించినతాళవృంతమున వీచుచు నుండెఁ జెమర్చుచుండె నా
చంచలనేత్ర క్రొమ్మెఱుఁగుఁజన్నులబింకముఁ జూచి యాతఁడున్.

వ. ఇట్లు హస్తపాదప్రక్షాళనగండూషముఖమజ్జనంబు లాచరించి
బంధువులు తమ తమ నిర్దిష్టంబు లగు నర్హాసనంబుల

గూర్చుండి చతుర్విధాహారంబులు భుజియింప దొణంగి
రప్పుడు. 118

మ. నివసద్బాష్ప మఖండితాఖిలము నిర్ణిక్తం బసంతృప్తమా
ర్దవ మనోన్యన్య మసంగతం బహృతసారస్యంబు గౌరం బగౌ
రవ మామోదనమోదనం బమృతపర్యాయంబు సంబంధి
బాం, ధవభూపాలసుతుల్ భుజించిరి వయోదర్పాను
రూపంబుగన్. 119

సీ. గోధూమసేవికాగుచ్ఛంబు లల్లార్చి
ఖండశర్కరలతోఁ గలపి కలపి
గుజ్జుగాఁ గాఁచినగోక్షీరపూరంబు
జమలిమండెఁగలపైఁ జల్లి చల్లి
మిరియంబుతోఁ గూడ మేళవించినతేనె
దోరంపులడ్వాలు దోఁచి తోఁచి
పలుచఁగా వండిన వలిపెంపుఁజాఁపట్లు
పెసరపప్పులతోడఁ బెనఁచి పెనఁచి
తే. గోవజవ్వాదిఁ గస్తూరిఁ గొఱఁతపఱుచు
వెన్నపడిదెంబు జొబ్బిల విద్రిచి విద్రిచి
వాపయాత్రికు లనుమోషవంతు లగుచు
వలచి భుజియించి రొగిఁ బిండివంటకములు. 120

చ. తరుణులు చంచలాలతలు తత్కరభాండనికాయ మంబుదో
త్కరములు పాలుఁ దేనెలు ఘృతంబులు వాన లఖండఖండశ
ర్కరలును ద్రాక్షపండ్లు వడగండ్లును శోభనభుక్తివేళఁ దో
ల్కరిసమయంబు పేరెలమిఁ గైకొన కుండునె భోక్తృ
సస్యముల్ ? 121

తే. పచ్చతామానికంబులపళ్లెరములఁ
బచ్చ గందనికూర లేర్పడమిఁ జూచి
పెట్ట రని పెండ్లి పెద్దలు పెడము వెట్టఁ
బెట్టుటకును నంగనలకుఁ బట్టెఁ దడవు. 122

క. అరుదుగ నపు డొక్కొకయెడ
మరకతమణిపాత్ర గగనమండల మయ్యెన్
జిరువడములపానెము శశి
ధరుఁ డయ్యెం జుక్క లయ్యె ద్రాక్షఫలంబుల్. 123

సీ. అమృతరసోపమం బైనకమ్మనియాన
వాలపాయసము జంబాల మయ్యె
మంచులప్పల మించు మండెంగమడుపులు
పొరలి తెట్టువగట్టు నురువు లయ్యెఁ
గప్పురంబులయొప్పుఁదప్పువట్టఁగఁజాలు
ఖండశర్కరలు సైకతము లయ్యె
గరుడపచ్చలచాయఁ గలపచ్చగందని
కూరలు శైవలాంకురము లయ్యె

తే. నొలుపుఁబప్పులతీరంబు లురలఁబడగఁ
బూరియలు లడ్డువంబులు పొరలి పాఱ
విమలశాల్యోదనంబుపై వెల్లిసూపు
నాజ్యధారాప్రవాహసాహస్రములకు. 124

ఉ. ఆదరణంబుతో నభినవాజ్యవిపాండురఖండశర్కరా
క్షోదసమన్వితంబుగ విశుద్ధహిరణ్మయభాజనంబులం
బైదలు లర్థిమై నిడఁగ బంధుజను ల్భుజియించి రన్నపూ
రాదరహాసచంద్రకిరణంబులఁ బోలెడుపాయసాన్నముల్.

తే. ఆరగించి రసాధారణానురక్తి
వారయాత్రికులును బెద్దవరుసవారు
దివుట శశిలాంఛనక్రవ్య తేమనంబు
నసమశరకేతనవ్యంజనామృతంబు. 126

క. సేవించి రొకటి దొలఁగం
ద్రోవక జంబీరరసముతో నూనియతో
నావం బెట్టినకిటిము
ద్రావలయము లమృతమధుర రసఖండంబుల్. 127

క. ఆమిష మనామిషముగ న
నామిష మామిషముగాఁ గుహకమార్గకళా
సామర్థ్యంబునఁ జేసిన
తేమనములు మనములం బ్రతిష్ఠించె రుచుల్. 128

చ. అసమసుధారసప్రదమునందలిరొంపు లనంగ మంచునం
బిసికినపంచదార లనఁ బేరినమీఁగడతో ఘనంబులం
బసిగొనఁ జేయువాహరిపుబప్పుయణీదధిపిండఖండముల్
మెసవిరి కంఠదఘ్నముగ మిక్కిలివేడుక వారయాత్రికుల్.

తే. మిసిమి గలపుల్ల పెరుఁగుతో మిళిత మైన
యావపచ్చళ్లు చవి చూచి రాదరమునఁ
జొట్టుమని మూర్ధములుదాఁకి యొట్టుఁదనముఁ
బొగలు వెడలింప నాసికాపుటములందు. 130

చ. *అవికయుఁ బట్టుపుట్టముచెఱంగు మఱుం గయి యున్కిఁ
జేసి గౌరవపరిమాణముం దెలియ రామికి ముచ్చిరుచున్న
యొక్కప, ల్లవునకుఁ జూపె నొక్కతె విలాసముతోఁ దన

తోరపుంజనుం,గవపొడ వింత పొ ష్మనినకై వడిఁ బొనక
హేమకుంభమున్. 131

ఉ. ఎట్టివినీతుఁడో యొకరుఁ డేణవిలోచన బంతివట్టి మా
ర్వెట్టఁగ దానివక్త్రశశిబింబముఁ జూడఁగ నోడి తాల్మిమైఁ
బట్టముఁ గట్టెఁ దచ్చరణపద్మయుగాంతరచంద్రమశ్శిలా
కుట్టిమభూమిభాగమునకుం దనమంజులదృష్టిపాతమున్. 132

చ. ఒసపరి జాణఁడొక్కఁ డొకయుగ్మలిచేసువ మాలువెట్టఁగాఁ
బసనికురంగికాపలలఫాలి నిజాధరపల్లవంబుపైఁ
బసిగొని చేరఁబట్టి మునిపండుల నొయ్యన నప్పళింపఁగా
మునిమునినవ్వు నవ్వె నది మో మొకయించుక యోర
సేయుచున్. 133

క. †చలివాలు నవ్వు లడ్డువ
ములు చన్నులు పనసతొలలు మోవులు మండెం
గలు చీరలుగ భుజిక్రియ
వలపించెం బెండ్లివారి వనితయుఁ బోలెన్. 134

తే. పద్మకోశాభినయహస్తపల్లవంబుఁ
జూపె నొకమచ్చెకంటికి సొబగుఁ డొక్కఁ
డంతయోగిర మడిగెనో! యంతలేసి
కొమరుఁబాలిండ్ల నడిగెనో! రమణి నతఁడు. 135

తే. చూచె నొకఁడు వయోవశస్తోక వికచ
కుచసమున్మేష యగునొక్కకువలయాక్షి
నుభయదోర్మూలకూలంకషోరుకఠిన
లలితవక్షోజ యగులేమ లజ్జఁ బొంద. 136

† 'తెలిపాలు' అని పాఠాంతరము.

తే. ఉష్ణశీతాన్నకబళంబు లొకఁడు సూపఁ
బవలొ రాత్రియొ నెఱుఁగ గూడ నవసర మని
దానికుత్తర మొకలతాతన్వి యిచ్చె
నధరబింబంబు విఱిచి సంధ్యాగమ మని. 137

ఉ. నాన దొలంగి చుంబన మొనర్చుటె కా దొకఁడొక్కచంద్ర
బింబానన మోముఁజంద్రుఁ జషకాంతరబింబితునిం బునః
పునః, పానకపానకర్మమునెపంబునఁ జేసి తదోష్ఠపల్లవం
బానుచు నాచరించెను సమంచితసీత్కృతచూత్కృతంబులన్.

ఆ. పంచదారఁ బొరపి భక్షింపఁగా నెత్త
భావదుష్ట మనుచు బావ నగిన
దొలఁగఁబెట్టి రోషకిలకించితంబుతోఁ
గొమ్మనరఁటిపండ్లు గూర్చె మఱది. 139

వ. ఇవ్విధంబున శుచియు మృష్టంబును బథ్యంబును నగుభోజ
నంబు సేసి పెండ్లిదొరలు సుగంధోదకంబులం జేతులు
తొడసి వార్చి ముఖవాసనంబు గైకొని కర్పూరతాంబూ
లంబులు పరిగ్రహించి దమదమనులప్రియోక్తులకు హర్షిం
చుచు నిజనివాసంబుల కరిగి రప్పుడు. 140

చ. కలికివరాటరా జడప గప్పురవీడెము వెట్టె నవ్వుచు
న్నలునడపంబువానికి ఫణాధరవల్లిదళాంతరంబునన్
బలితపుఁదేలు మైనమునఁ బన్ని యతం డది చూచి భీతిఁ ద
మ్ముల విల వైచిన న్నగిరి మూఁగినరాజకుమారు లందఱున్.

మ. మృదుమృష్టాన్నము లీప్రకారమువ నెమ్మి న్వారు ముప్పొ
ద్దుఁ గొన్నిదినంబు ల్భుజియించుచు చుండిరి సమున్నిద్రాను
రాగంబుతోఁ, బదియాఱేఁడులపువ్వుబోండ్లనునుపుంబా

లిండ్లకాశిన్యసంపదతో రాత్రులు మల్లుసాము మదనోన్మా
దంబునం జేయుచున్. 142

వ. నిషధమహీవల్లభుండును దమయంతీపరిణయమహోత్సవం
బివ్విధంబున ననుభవించి దివసచతుష్టయానంతరంబున. 143

ఆశ్వాసాంతము

శా. నారిచిత్తసరోమరాళ! నయచాణక్యా! విరించాన్వయ
క్షీరాంభోధిసుధామయూఖ! కవితాసిద్ధాంతసర్వజ్ఞ! జం
భారాతిద్విపహస్తకాండనిభబాహాఖడ్గధారాపయో
ధారాశాంతవిరోధిభూధవమహోదగ్రప్రతాపానలా! 144

క. అరివీరబసవశంకర!
శరణాగతరక్షణానుసంధానధురం
ధర! సచివగంధసింధుర!
ధరణీభరణైకదక్షదక్షిణహస్తా! 145

మాలినీ. ధరణిభరదిధీక్షాధఃకృతస్తబ్ధరోమ
ద్విరదకమఠరాజోర్వీధ్రదర్వీకరేంద్రా!
హరచరణరిరంసావ్యంజితానందసాంద్రా!
పరిహృతమతితంద్రా! భాగ్యసంపన్మహేంద్రా! 146

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్య
పుత్త్ర సకలవిద్యాసనాథ శ్రీనాథప్రణీతం బైనశృంగార
నైషధకావ్యంబునందు షష్ఠాశ్వాసము.

శ్రీ ర స్తు

# శృంగార నైషధము

## సప్తమాశ్వాసము



కం. రెడ్డి వేమవిశ్వే
శ్వరారమణకృపావిశేషసమధిగతైశ్వ
ర్యారూఢవిభవశృంగా
మారారిపదాబ్జభృంగ ! మామిడిసింగా ! 1

### నలుఁడు దమయంతీసహితుఁడై నిజరాజధాని కేఁగుట

వ. వినుము. 2

తే. పయన మైన స్వపురోహితప్రవరుఁ డైన
గౌతముండు ప్రస్థానసంగతికిఁ దగిన
మంగళాచార మొనరింప మహీవరుండు
శిబిర మెత్తఁ బడాళ్లకుఁ జెప్పఁ బనిచె. 3

ఉ. పుట్టిననాఁటఁగోలె నొకప్రొద్దు నిజాంకతలంబుఁ బాయక
న్నట్టియనుంగుఁగూఁతు దమయంతిఁ గడుంగడుదూర
మన్పుచో, నెట్టివిషాద మాత్మ నుదయింపదు కూరిమియల్లు
నంపుచో, నెట్టివిషాద మాత్మ నుదయించెనొ మామకు
నత్తగారికిన్. 4

ఉ. అక్షయరాజ్యవైభవరమానుభవాభినవప్రభాసహ
స్రాంశుఁడు గుండినాధిపతి యాత్మసుతారమణు న్వినీతతా
లక్షగుణీభవద్గుణకలాపుని నైషధునిన్ వరాటదే
శక్షితిమండలావధిగ సమ్మతి నంపె సుతద్వయంబుతోన్. 5

తే. ఆత్మమండల మవధిగా ననుచరించి
యవనినాథుఁడు జామాత ననిపి మరలె
నా ప్రతీరంబుగంధవాహంబు ననిచి
మరలి పోవుతటాకంబుతరఁగవోలె. 6

వ. అప్పుడు నిజవియోగజనితక్లేశంబునం గన్నులబాష్పాంబు
కణంబులురలఁ బ్రణామంబు నేసి తలవాంచి యున్న కూఁతుం
గౌఁగిలించుకొని గద్గదస్వరంబునం దండ్రి యిట్లనియె. 7

మ. గురు వన్నన్ ధన మన్నఁ బుణ్య మనినన్ గోత్రోదయం
బన్న దేవర యన్న న్మన మన్నఁ దుష్టి యనినన్ వాత్సల్య
మన్న న్నిజేశ్వరుఁ డన్నం బరమోపకార మనినన్ సర్వంబు
నన్నం దలోదరి! నీకున్ నిషధాధినాథుఁడె సుమీ తథ్యం
బుగాఁ జెప్పితిన్. 8

సీ. పాటించి కొలువుము భవనదైవతముల
సవతులఁ గొనియాడు సఖులఁ బోలె
నారాధనము సేయు మత్తమామల నెప్డు
పరిజనంబులమీఁదఁ గరుణగలుగు
యలుగకు కోపించినపుడు నాథునితోడ
మదిలోన నుబ్బకు మన్ననలకుఁ
దోడికోడండ్రతోఁ గూడి మాడి చరింపు
దాసీజనముఁ బ్రోవు తల్లికరణి

తే. బ్రాహ్మణులయందు గురులందు బంధులందు
భక్తివిశ్వాససౌహార్దపరత నెరపు
భవ్యపతిదేవతాచారపరమపుణ్య
ధర్మ మేమర కుండుమీ తల్లి కాన! 9

వ. అని బుజ్జగించి బుద్ధిసెప్పి కూఁతుఁ వీడ్కొనియె దమదమ
నులుం జెలియలి ననునయించి. 10

ఉ. సంకుమదంబుఁ గస్తురియుఁ జాఁదుఁబటీరము గప్పురంబునుం
గుంకుమపువ్వునుం బునుఁగు గొజ్జెఁగనీరు *ననేకభారువుల్
కంకణకంఠికాకటకకాంచిముఖాభరణవ్రజంబుతోఁ
గొంకక తోడఁబుట్టువులు గూరిమి చెల్లెలి కిచ్చి రిద్దఱున్. 11

సీ. కదళికాచంపకక్రముకపాటలచూత
కంకేళివాటికాసంకులంబు
లక్షీణబహుళపుండ్రేక్షురాజాన్నాది
భూరిసస్యసమృద్ధిభూషణములు
కమలనీలాంభోజకల్హారకుముదాఢ్య
శుంభత్తటాకోపశోభితములు
వివిధాపణస్థలీవిన్యస్తరత్నాది
బహుపదార్థవ్రాతబంధురములు

తే. గ్రామములు నూఱు క్రథకైశికంబులోనఁ
బసపు కిచ్చిరి భీమభూపాలసుతులు
దండ్రియాజ్ఞ సహోదరధర్మ మొప్ప
ననుఁగుసయిదోడు దమయంతి ననుపునపుడు. 12

*'అనేకబారువుల్; అనేకభారువుల్' అని ముద్రితలిఖితపుస్తకపాఠ
ములు.

తే. ఉభయవంశలలామ యయ్యుత్పలాక్షి
యత్తవారింటి కరిగెడునవసరమున
మాతృజనకసఖీజనభ్రాతృవిరహ
మధిపతిప్రేమజలరాశి కౌర్వ మయ్యె. 13

వ. ఇవ్విధంబున సంబంధిబంధుజనంబుల సముచితప్రకారంబుల
వీడ్కొలిపి కతిపయప్రయాణంబుల. 14

సీ. ప్రణధిలోకానీతపరితోషవార్తాభి
నందితామాత్యబృందారకంబు
రాజవీథీమహాప్రాసాదశిఖరాగ్ర
కీలితాలంకారకేతనంబుఁ
గ్రంథకైశికాధీశకన్యావలోకన
వ్యగ్రపౌరవధూసమాకులంబుఁ
గస్తూరికాలేపకర్పూరరంగవ
ల్ల్యభిరామమందిరప్రాంగణంబు

తే. సారసారమసారాశ్మతోరణాంశు
చూర్ణకుంతలమాలికాశోభమాన
గోపురశ్రీలలామంబుఁ గూర్మిపురము
డాయ నేతెంచె నిషధభూనాయకుండు. 15

తే. కలయ నేతెంచి నైషధక్ష్మావరుండు
దివుటఁ బురలక్ష్మిపై వ్రాలుదృష్టిఁ దివిచె
నాత్మనొక్కించుకయుఁ బరాకయ్యె నేనిఁ
బ్రాణవల్లభ దన్నేమియనునొ యనుచు. 16

చ. ఎదురుగ నేఁగుదెంచిరి మహీపతికిం బురివారు సర్వసం
పదలు ప్రమోదవైభవశుభస్థితియు న్నెరయంగ మిండతు

మ్మదపదుఫుల్లదోదయము మిక్కిలి వేడుకయుక్ మనంబులం
బొదలంగఁగ్రొత్తయామునికిఁబొచ్చెము లేకెదురేఁగుచాడ్పునన్.

వ. ఇట్లు మంత్రిపురోహితామాత్యదండనాథప్రధానంబుగాఁ
పౌరజనసమూహంబు దన్నెదుర్కొన సముచితప్రకారంబున.

——— నలదమయంతుల పురప్రవేశము ———

శా. ఏమో క్రొత్తయపూర్వవార్త విను చేమో చెప్పుచున్
దండనాథామాత్యాదులు పాదచారమున సేవాసక్తి
మైఁ గొల్వరా, భూమీశాగ్రణి వచ్చెఁ బట్టణము సంపూ
ర్ణానురాగంబుతో, భామానేత్రచకోరచుంబితముఖప్రాలే
యరుగ్బింబుఁడై. 19

క. సకలధరాధీశ్వరుపైఁ
బ్రకటముగాఁ జల్లి రపుడు పౌరపురంధ్రుల్
సుకుమారబాహువల్లీ
ముకుళకులసకుల్యలాజముక్తాఫలముల్. 20

మ. దమయంతీవదనావలోకనసముత్కంఠావలద్భామినీ
సముదాయాననచంద్రబింబపరిషత్సాన్నిధ్యయోగంబునన్
సముపేతార్థము లయ్యె సౌధమణిభాస్వచ్చంద్రశాలావితా
నము లుర్వీపతినందనుండు పురఘంటావీథి నేతెంచుచోన్.

తే. ధరణినాథాననేందుసుధారసంబు
సౌధజాలమృణాళికాజాలకముల
నుత్పలాక్షీకటాక్షనీలోత్పలములు
ప్రేమమునఁ దప్పివోవంగఁ బీల్చికొనియె. 22

వ. అప్పుడు. 23

సీ. నిరుపమానస్వయంవరమహోత్సవమును
మధుపర్కసత్కారమంగళంబుఁ
గమనీయతరకరగ్రహణహోమంబును
విహరణాగారప్రవేశవిధియు
నుభయబంధుభుజిక్రియోపచారంబును
బ్రాస్థానికస్వస్తిభాషణంబు
హారణార్థసంభారహారికాకృతియును
నగరసంవేశనానందకళయు
తే. ననెడువృత్తాంతముల నొప్పునధిపచరిత
మాఁడమధ్యావసానంబు లవధరించి
యమరముఖ్యులు గురియించి రలరువాన
యన్నిదినములు దా రున్కి యచ్చుపడఁగ. 24

తే. వికచపౌరాంగనాపాంగవీక్షణములు
హర్షితామరకృతపుష్పవర్షములును
గురియ నృపవీథి నరిగి భూవరుఁడు సొచ్చె
నీరజాక్షీసమేతుఁడై నిజగృహంబు. 25

ఇంద్రాదులు స్వర్గమునకు మరలుట

వ. అట విబుధులు వృథాప్రయోజనంబైనవసుధాధావన
ప్రయాసఖేదం బనుభవించి పయోధిపాథస్తరంగంబులుం
బోలె వచ్చినత్రోవయ పట్టి మరలి రప్పుడు. 26

తే. స్ఫటికభూమిధ్రములమీఁదఁ బ్రతిఫలించు
నర్కబింబంబులునుబోలె నమరవరులు
గనకరథములమీఁద నాకాశవీథిఁ
జారునైసర్గికప్రభాసౌష్ఠవమున. 27

వ. చనునప్పుడు. 28

మ. మెఱుఁగుందీఁగలచాయఁ గేతనము గ్రొమ్మించారుపీతద్యుతిం
గొఱలం జక్రవిఘట్టనంబునఁ బరిక్షుణ్ణంబులై మేఘముల్
పఱియ ల్వాఱఁగఁ గింకిణు ల్మొరయఁగాఁ బాఱె న్నభోవీథి న
త్తఱి జంభాంతకు తేరు మాతలికశాతత్రస్తాశ్వవేగంబునన్.

తే. మాటిమాటికి నాకాశమండలమున
నవల నివలఁ బయోవాహనివహమునకు
నమరనాథరథాలంబి యైనధనువు
భాసురస్ఫూర్తి విభ్రమాభరణ మయ్యె. 30

క. ధళధళ మని జలములలో
బలరిపువజ్రాయుధంబు ప్రతిబింబింపం
గెలఁకుల దండడిఁ ధిరిగెడు
జలధరముల కపుడు కులిశసంగతి గలిగెన్. 31

తే. వర్ణితం బైనసావర్ణివంశమునకుఁ
బట్టుగోడు గైనయంభోజబాంధవునకుఁ
గూడ నేతెంచుగారాపుఁగొడుకుచేతి
దండ మవ్వేళ నాలంబదండ మయ్యె. 32

ఆ. అధికదూర మగుట నాకాశలక్ష్మికిఁ
గర్ణపాశ మగుచుఁ గరము పొలిచె
దివ్యభవ్యకాంతి దేదీప్యమానమై
పాశపాణిపాణిపాశవల్లి. 33

తే. పరివహాస్కంధమారుతాస్ఫాలనముల
వీతిహోత్రుండు వర్తించువిధము చూచి

భీమనందన నీతఁడు పెండ్లియాడఁ
బోలు నని యభ్రచరకోటి బుద్ధిఁదలఁచె. 34

శా. క్షోణీవల్లభుముద్దుఁగన్నెనుసుఁబల్కుల్ గ్రోలుకోలేమి ని
ర్వాణానందము లైనవీనులకుఁ దత్ప్రాయంబు గంధర్వరా
డ్వీణానాద మొకింత సమ్మదము గావింపంగ నింద్రాదిగీ
ర్వాణాధీశచతుష్టయం బరిగెఁ దారావీథి దూరంబునన్. 35

ఉ. చిత్తములోనఁ బాయక వసించినభోజనృపాలకన్య న
త్యుత్తమరాజుఁ గూర్చి సుర లూఱటఁ బొందిరి యెంతయేని
యుం, జిత్తములోనఁ బాయక వసించిననిర్మలతత్త్వవిద్య య
త్యుత్తమశిష్యుఁగూర్చిగురుఁడూఱటఁబొందినయట్టిలాగునన్.

సీ. పక్షులు చరియించుపదవి నుల్లంఘించి
ఘనములు దిరుగుమార్గంబు గడచి
విద్యాధరశ్రేణి విహరించుపథ మెక్కి
కరువలి యేఁగెడుకక్ష్య నొచ్చి
గ్రహరాజు వాఱెడుఘంటాపథము దాఁటి
చుక్కలు వోడలెంచుచక్కి వెడలి
చదలేఱు ప్రవహించుచాయ యుత్తరియించి
ధ్రువమండలంబు పెంద్రోవ నడచి

తే. యూర్ధ్వలోకంబునకుఁ బోవుచున్నవారు
భీమభూపాలసుతమీఁదిప్రేమభరము
విడియును వీడ కాత్మ భావించువారు
వాసవుం డాదియైనగీర్వాణవరులు. 37

ఇంద్రాదులకు మన్మథుఁడు దెసుపడుట

మహాస్రగ్ధర. కని రంతంత న్నభోమా
　　ర్గమున ఘనతమస్కాండసందేహసంపా
దనలీలాజాగరూకా
　　తనువికటతనూధామధూమాయితంబుఁ
వనశాశ్యంత స్తరంగ
　　ధ్వనిసమధికదుర్వారకోలాహలంబుఁ
జనసందోహంబు భూపా
　　చ్ఛవిధగధగితాశాకటాహోదరంబున్. 38

తే. ఇరులు గవియుచు నేరాళ మెట్టయెదుర
నల్లనల్లన నేతెంచె నల్లమంది
గరిమ నాకాశచరుల కాకాశవీథి
గదలి యెదురుగ వచ్చెనో కాక యనఁగ 39

వ. ఆజనసమూహంబు ముందట. 40

సీ. రతిదేవి నెవ్వేఁగురారాపుఁజన్నులు
　　గడకన్నులకు నింపు గడలుకొలుప
గడు సైనపూవింటఁ గూడి కమ్మనితూపు
　　కటకాముఖపుఁగేలఁ గరము మెఱయ
గఱిమండలంబుపైఁ గనకంపుఁజెఱఁగుల
　　జిలుఁగుఁబచ్చనిపట్టుఁజేల మమర
నాలీఢపాదవిన్యాసంబు శృంగార
　　వీరాద్భుతములకు విందు సేయఁ

తే. జిన్ని చిగురాకుఁజేర్కోలఁ జేతఁబట్టి
పేరుటామని రాచిల్కతేరు నడుప

నుక్కడీఁ డయి యేతెంచె నుక్కు మిగిలి
కలికిగారాపుఁజెలికాఁడు కలికి మరుఁడు. 41

ఉ. చీకటితప్పునం బరులచేడియలన్ రమియింప దూతికా
లోకముమాటతీపులకు లోఁబడి భీత్యభిమానలజ్జలన్
బోకడఁబెట్టి ప్రాణ మొకపోకకుఁ గైకొను కుండుసాహసుల్
పైకొని చేరి తన్నుభయపార్శ్వములందున భక్తిగొల్చిరాన్.

తే. బుద్ధదేవపరిస్పర్ధఁ బోలెఁ దాల్చె
లోకజిద్భావ మెవ్వాఁడు లోక మెఱుఁగ
నీశ్వరునిమీఁదఁ దగిలినయీర్ష్యఁబోలె
నతనుఁడై యేలె నెవ్వఁ డీయఖిలజగము. 43

వ. అమ్మదనుండు త్రిభువనైకవీరుండు నాసీరగతుండై నభోమం
డలంబున గండుమీనుపడగ పొలుపారఁ జిగురుజగజంపు
గొడుగునీడ వాడనివనమాల వక్షస్థ్సలంబునం గ్రాల రతి
యును దానును నేతెంచిన. 44

తే. నలునిఁజూచినపిదప మన్మథునిఁ జూడ
నాకనిలయులనయనంబు లోఁకిలించె
నయ్యరోచక మమరవైద్యద్వయంబు
దీర్పఁ జాలునో చాలదో! తెలియరాదు. 45

క్రోధుఁ డెదురుపడుట

సీ. కట్టెఱ్ఱనెరలదీర్ఘవిలోచనంబుల
కడల నగ్నిస్ఫులింగంబు లురల
జృంభించి మిగులంగఁ జేవురించిన మేనఁ
బ్రస్వేదజలముఁ గంపంబుఁ బొడమఁ

కుటిలమై చిమ్మచీకటి సంఘటించుచు
నిటలభాగమున భ్రూకుటి నటింప
నత్యంతగాఢదంతాగ్రపీడనమునఁ
దొట్టవాతెఱ నెత్తు రుట్టిపడఁగ

తే. కటముల ద్రువంగ మీసాలు కత్తరిల్లఁ
గంఠకుహరంబునందు హుంకార మెసఁగ
నింగినేలయుఁ దాటింప నంగలించు
పగిది నేతెంచెఁ గ్రోధంబు గగనవీథి. 46

స్రగ్ధర.—
ఆక్రోశాక్రోశఘోషం
బయి వికటకఠోరాట్టహాసాస్పదం బై
వక్రభ్రూవల్లరీసం
వలనభయద మై స్ఫారనిశ్వాసధారా
చక్రం బై రక్తరూక్షే
క్షణ మయి విగతక్షాంతి యై నిర్దయం బై
యాక్రోధం బభ్రవీథిన్
హఠగతి నమృతాహారులన్ ధిక్కరించెన్. 47

ఉ. ఈసునఁ బుష్పసాయకుని యేటునకుం గడుదూర మైనదు
ర్వాసుని నెమ్మనంబునఁ జిరంబుగ మన్నెము దన్ని రాజ్యసిం
హాసన మెక్కకుండఁ దను నాఁగిన క్రోధముఁ జూచి భీతి మై
వాసవుఁ డొయ్యనొయ్య నఱ వ్రాలిచె ఱెప్పలు వేయుఁ
గన్నులన్. 48

తే. మండు నఁట దాను హృదయమర్మములఁ దవిలి
కన్నుఁగవ నంధకారంబు గవయు నెట్లు?

రాగ మొనరించు నఁట తా విరక్తి యెట్లు
తన ప్రభావంబు క్రోధంబు తాన యెఱుఁగు. 49

మ. భ్రుకుటీకాలభుజంగ రాజతరుణీఫూత్కారశంకావహా
ధికనిశ్వాససమీరణధ్వనులు సంతీక్ష్ణాగ్రదంతావళీ
శకలీభూతనిజాధరోష్ఠరుధిరస్రావప్రతిద్వంద్వర [డన్.
క్తకటాక్షుల్ దనపారిపార్శ్వకులు గా దర్పంపుఁ బెంపేర్ప

వ. ఇట్లేతెంచె ననంతరంబ 51

### లోభుఁ డెదురుపడుట

తే. హస్తములు విస్తరించుచు నఱి పలుకుచుఁ
గంఠగద్గది కావ్యక్తకాకువికృతి
రాలుపడి బండ్లిగుల్చుచుఁ దీలుపాటుఁ
బ్రకటదైన్యంబుఁ దోఁప లోభంబు వచ్చె. 52

సీ. కడుపుమండించునాఁకటిచిచ్చుసెగ దాఁకి
గవరనై యున్న కన్గవలవారు
భోగించువారలఁ బుల్కుపుల్కునఁ జూచి
మెల్లన గ్రుక్కిళ్లు మ్రింగువారు
కుక్షింభరిత్వంబుకోలఁది కగ్గలముగాఁ
గూఁ డెంత పెట్టినగుడుచువారు
ప్రాణగొడ్డము లైన పరమసాహసములఁ
బరులసొమ్ముల కాసపడెడువారు
తే. పామునకు బలి వెట్టని ప్రతినవారు
* ఈఁగ కెన్నఁడు నే నిలి యిడనివారు

* 'ఈఁగ కెన్నఁడు గాటిని యిచ్చువారు' అని పాఠాంతరము చింత్యము

ధనముగాఁపున్న దయ్యాలదఱుమువారు
బలిసి లోభంబు నిరువంకఁ గొలుచువారు. 53

మ. కమియం బాపము లొండు రెండు వరుసన్ గల్పింపఁగాఁ
జాలు కామము క్రోధంబును నిచ్చు మెచ్చక యహం
భావంబుతో నుండుఁ బం, చమహాపాతకసంగ్రహైక ఘటనా
చాతుర్యధుర్యంబు లోభము లోభంబు గదా గుణద్విరద
రాట్పంచాస్య మూహింపఁగన్. 54

సీ. ఇన్నియింద్రియములు నెవ్వానికి గృహంబు
లట విశేషంబు జిహ్వాంచలంబు
సంప్రార్థనాదీనచాటూక్తి యెవ్వాని
కాజన్మసంసిద్ధ మైనమతము
పాత్రహస్తములపైఁ బడుదానజలవృష్టి
వారించు నెవ్వాఁ డవగ్రహ మయి
అన్యవిత్తాపేక్ష యాత్మవిత్తాపరి
త్యాగ మెవ్వనియంతరంగగుణము.

తే. జారచోరాదిధూర్తవిహారభూమి
దైన్యకార్పణ్యజలరాశిధవళకరుఁడు
కలిమహారాజునెచ్చెలికాఁడు లోభుఁ
డతఁడు సురలకు జోహారు లనుచు మ్రొక్కె. 55

వ. అనంతరంబ. 56

మోహుఁ డెదురుపడుట

మ. తనకుం బట్టపురాణివాస మగుమిథ్యాదృష్టిచే నేతఁ గీ
ల్కొన హత్తించి విరించిముఖ్యదివిషత్కోటి న్వాడంబించు
చున్, ఘనమార్గంబున నేఁగుదెంచెను మహాకాయంబు

మోహంబు మ్రో,హానవిద్యాగమసంప్రదాయఘటనావ్యా
పార మేపారఁగన్. 57

తే. బాలు రాత్మకుటుంబజంబాలమగ్ను
లనధిగతశాస్త్రు లనధీతు లలసమతులు
దన్ను సేవింప మోహంబు దప్పఁద్రోవ
నల్లనల్లన సురల డాయంగ వచ్చె. 58

సీ. జ్ఞానప్రదీపికార్ఘుంర్ఘూసమీరంబు
కామలోభక్రోధకారణంబు
సంసారకపటేంద్రజాలవిద్యాపించ
యామ్నాయపదకంటకాంకురంబు
శూన్యవాతారణ్యశుండాలకలభంబు
కుమతసిద్ధాంతవిభ్రమగృహంబు
బహుళఘట్టకుటీప్రభాతతిగ్మమరీచి
యంధపరంపరావ్యాప్తసరణి.

తే. కన్నులకునిద్ర మదికి జో కన్ను ధృతికి
వినమి చెవులకు నెద్ది భావించి చూడ
నమ్మహామోహుఁ డెదురుగా నరుగుదేర
భ్రమసి చూచిరి వాసవాద్యమరవరులు. 59

వ. అయ్యవసరంబున. 60

కలి యెదురుపడుట

సీ. పాతకంబులు నీలిపట్టుబొందడములు
పగలింటినిద్రలు పచ్చడములు
పరదూషణంబులు ప్రాలంబహారంబు
లన్యకాంతాసక్తి యంగరాగ

మీమాంసాపరత్వంబు హేమావతంసంబు
బుధజనద్వేషంబు పువ్వుదండ
మిథ్యాప్రలాపంబు మృగనాభితిలకంబు
బహుళాశనత్వంబు పరికరంబు
తే. పరులఁజూపులు వాకోల్పఁ బ్రసభలీల
రాసభాంగరుహోగ్రధూమ్రప్రకార
బర్బరాకారదేహు లంబరము నిండి
సరస వచ్చిరి కలిరాజుసైన్యభటులు. 61

వ. ఆసుభటు లుభయపార్శ్వంబుల. 62

సీ. కుండబొజ్జల క్రింద ద్రిండుగా బిగియించి
గడితంపుమడుఁగులు గట్టినారు
బూజువట్టినదేహములపైఁ దళంబుగా
మలయజపంకంబు లలఁదినారు
నునుబట్టతలలపైఁ గనకంపుఁ జెఱఁగుల
బట్టుచీరలు మూయఁ జుట్టినారు
కరముద్రేలుడు లైనకర్ణపాశంబులఁ
దోరంపుఁబోఁగులు దొడిగినారు
తే. వెలయ మృగనాభి గీర్బొట్టు వెట్టినారు
పసిఁడిలాతాలు సేతులఁ బట్టినారు
చండముద్రాధరులు నభోమండలంబుఁ
బూరటిల బట్లు కలిరాజుఁ బొగడి పొగడి! 63

వ. త్రైలోక్యంబును వినునట్లుగా నిట్లనిరి: 'యాగఫలంబు పాషాణసలిలోన్మజ్జనంబు ; దేశాంతరదేహాంతరకాలాంతరంబులం గర్మఫలభోక్తయాత్మయనుమాట యసత్యంబు; వేదం

బప్రమాణంబు; వేదమర్మభేదంబునఁ గదా బోధిసత్త్వుండు సత్త్వహేతువుగా జగం బస్థిరంబని సమర్థించె నెద్దియెద్ది సత్తద్ది యద్దియధ్రువం;బగ్నిహోత్రంబుం ద్రయీతంత్రంబుఁ ద్రిదండంబుఁ భస్మగుంఠనంబు బుద్ధిపౌరుషహీనులగుపురుషులకు జీవికోపాయంబులు; స్వాచ్ఛందంబు ధర్మంబు; కామదేవుండ దైవంబు; మరణంబె యపవర్గంబు; భస్మీభూతంబగు భూతంబునకుం బునరాగమనంబు గల దనుట భ్రాంతిగాదె? యామ్నాయంబు లేమి యెఱుంగు? నెఱింగెనేని "కోహి తద్వేద యద్యముష్మిఁ లోకేఽస్తి వా న వేతి" యని సందేహించునే? యని వెండియు. 64

క. తారు దముఁ గాచుకొనరే
యీరసమునఁ గావఁ బోదు రింతుల వంశా
చారస్థితి డాంభికు లగు
వారు మరుఁడు దమకెకాని వారికి లేఁడే? 65

క. శతమన్యునంతధర్మ
స్థితి యెఱిఁగినవాఁడు గలఁడె త్రిభువనమునయం?
దతనియహల్యాజారత
యితరులజారత కనుజ్ఞ యిచ్చుట గాదే? 66

క. మారుఁడు దుర్వారుఁడు సం
సార మిది యనాది వంశసంరక్షణ మం
భోరుహవదనలచేతిది
యేరూపున జాతిశుద్ధి యేర్పఱుప నగున్? 67

క. రాజానుమతము ధర్మము
రాజు నిశాకరుఁడు మీకు బ్రాహ్మణులారా!

రాజు ప్రవర్తించినవే
రోజన గురుతల్పగమన ముచితము మీకున్. 68.

క. ఏకార్యంబు సుఖోత్తర
మాకార్యము సేయ నర్హమగునెడ సుకృతం
బాకాంక్షింతురు సురతము
నాకాంక్షింప రది యేమి యవనీవిబుధుల్? 69

చ. మలిచినరాలయందుఁ గుసుమంబులు వోయఁగ మీఁద
నెన్నఁడే, ఫల మొకనాఁడు గల్గు ననుపల్కెడి యెవ్వఁడు
నమ్మినాఁడు? కోమలవనరాజిలోనఁ గుసుమంబులు గోయుట
యెప్పుడప్పుడే, ఫలములు వోవా పోవునో యుపాసకులార!
తలంచి చూడుఁడా. 70

తే. అన్యదేహాప్తిసందేహ మైనయెడనుఁ
గలుషములు మాన నెబ్భంగి వలయునేని
విడుఁడు యాగంబు లో వేదవిప్రులార!
జంతుహింసామహాదోషసంశయమున. 71

తే. స్మృతులయందు బలాత్కారకృతము లెల్ల
నకృతములుగా విధించినాఁ డట్టి మనువు
బలిమి బ్రాహ్మణులార! పాపములు సేయుఁ
డేమి సేసినఁ జేయ రయ్యెదరు మీరు. 72

సీ. ఐకమత్యంబు లే దఖిలశాస్త్రములకు
నిగమంబు లోకజాడ నిలువ కాదు
నాగమంబులత్రోవ యది యొండుచందంబు
పంకంబులోనికంబంబు తర్క

మతిగాఢమై యుండు యామళంబులచాయ
యుపనిషత్తులభావ మొక్కరీతి
బహువిధంబులు మంత్రపారాయణంబులు
సాంఖ్యయోగములవాసనలు వేఱు
తే. పట్టి యేదర్శనం బైనఁ బ్రతిభకలిమి
వలసినట్లు వక్కాణింప వచ్చి యుండు
నరసి దుఃఖంబు లేక సౌఖ్యంబు కలుగు
ధర్మ మొకఁ డెఱిఁగొనఁడు విద్వాంసులార! 73
తే. అస్మితాబుద్ధి గలదేహ మనలశిఖల
భస్మమై పోవ నెచ్చోటఁ బాప ముండు?
సౌఖ్యదము లైనపరదారసంగమాది
పాపములు సేయుఁ డోపినభంగి జనులు! 74
క. మృతుఁ డఁట పుట్టుఁ బెఱుంగును
మృతుఁ డఁట వేఱొకఁడు గుడువ మేకొనుఁ దృప్తిన్
మృతునకు నఁట కర్మఫలం!
బతిధూర్తులవార్త లేటి కావర్తింపన్! 75
ఉ. చీటికి మాటికి న్నిఖిలజీవులునుం బొనరించుపాపముల్ [మైఁ
గోటులు దన్నుఁ జుట్టుకొని ఘోరపుబాధలఁ బొందు చోఁటి
బాటిలునాత్మకున్ భరమె పాపము నీయది? నిండుబండికిం
జేట భరంబె? యేమిటికిఁ జేయవు విప్రుఁడ! కిల్బిషంబులన్?
చ. కలుగుట లేమి సందియము కార్యఫలంబులయందు నిట్టిచోఁ
ఫల ముదయించె నేని దమపాలిటివేల్పులు మంత్రతంత్రశ
క్తులును తదీయలాభమునకుం దగుహేతువులందు రన్యథా
కలనకునంగలోపములు కారణమందురు మాంత్రికాధముల్.

తే. అర్థి నార్జింప వర్జింప నలవి గాని
ధర్మము నధర్మమును జెప్పఁ దగిలి మనువు
నేరములు వెట్టి దండువు నిశ్చయించి
ధరణిఁ గలచోట నర్థ మెత్తంగఁ దలచి. 78

శా. లాలామూత్రపురీషఘర్మజలకీలాలాత్మికల్ భామ లం
చేలా రోఁతలు పుట్ట నాడుదురు యోగీంద్రుల్ వృథాలాప
ముల్?, లాలామూత్రపురీషఘర్మజలకీలాలాత్ములో తారలే
ప్రాలేయాంబుపటీరపంకఘనసారక్షౌద్రదివ్యాత్ములో. 79

వ. పురాణంబు ప్రమాణీకరింతు మేని తత్ప్రణేత పారా
శర్యుఁడు పాండవులవగర చాటుకవి; కవులమాటల కేటి
పాటి? మత్స్యపురాణంబునందు మత్స్యంబు వక్తయఁట?
తిర్యగ్జంతుమతంబులు సిద్ధాంతీకరింపవచ్చునె? యది య
ట్లుండె. 80

సీ. దిననాథనందనుఁ దిత్తొల్చి విడిచిరి
కరుణలే కెముక లేరిరి దధీచిఁ
పాతాళబిలమున బలిఁ గట్టి వైచిరి
జీమూతవాహను జీవి వాపి
శెత్తి పా ల్గొనిరి శిబిం బ్రసంతటివానిఁ
గలగుండు వెట్టిరి కలశవార్థిఁ
దివుటఁ జొక్కులతేని దినగోరు మెసఁగిరి
పండు దుల్చిరి కల్పపాదపంబు
తే. నయ్యు లెంతకు నేర రర్థార్థిజనులు
వీరిమనసులు పట్ట నెవ్వారితరము?

కీర్తి యిటు వెల్గు నంద్రుద్దాక్షిణ్య ముఱువు
దారు గల్గినఁ బదివేలు దమకుఁ గలవు. 81

తే. శాంతమతిఁ గాముకత మాని సత్త్రతంతు
దీక్ష గైకొన్న వారల తెఱఁగు లెస్స
స్వర్గమున కేఁగి రంభాదివారసతుల
కుచభరంబులపై వ్రాలఁ గోర రేని. 82

తే. ఆహవంబున మృతులైనయట్టివీరు
లమరలోకంబునకుఁ బోదు రనుట గల్ల
నిజమయేని దైత్యారిచే నిహతిఁ బొంది
యతనితో విగ్రహింపరే యసురు లచట ?. 83

క. అక్షచరణుండు చెప్పిన
మోక్షములు శిలాస్వరూపములు వీనికిఁగాఁ
బ్రేక్షావంతులు దచ్ఛా
స్త్రాక్షరములు చదువ నేల యతిబాలిశులై ? 84

ఆ. దైన్యమునకుఁ ద్రోవ దలఁప నస్తైన్యంబు
గుఱివంచనంబు గడు పుడుగుట
బుద్ధి గ్లైనయట్ల భోగింప నేర్చుట
సార మైనబోధిసత్త్వమతము. 85

తే. క్రోధనులు దారు పరుల కక్రోధశిక్ష
సేయు చుందురు కపటవసిష్ఠమునులు
తారు నిర్ధనులై యుండి ధాతువాద
మొకరికిం జెప్పువిప్రలంభకులు వోలె. 86

తే. కలవు విధ్యర్థమంత్రభాగములు మూఁడు
శ్రుతుల నామూఁటియందు మీఁమతికి నెక్క

నర్థవాదాంశ మఖిలంబు ననృత మయ్యె
నట్ల యగుఁ గాక మంత్రవిధ్యంశములును.

వ. అని యీ ప్రకారంబు వాచాటులై టిట్టిభంబులుంబోలెఁ
గర్ణకంటకంబులైనదుర్వర్ణంబులు వేదంబు ప్రమాణంబు
గా దనియును నాగమంబుల నగడు సేసియు ధర్మంబుల
మర్మంబు లుచ్చిపోనాడియు పురాణంబులఁ ద్రాణలు సెఱి
చియు నితిహాసంబుల నపహసించియు యామళంబులం గలం
చియుఁ జన్నంబులఁ జిన్నవుచ్చియు మంత్రపారాయణంబులఁ
దృణీకరించియుఁ గలికిఁ గౌతూహలంబును జైనులకు సమ్మా
నంబును బౌద్ధులకు నుద్ధతియును జార్వాకులకు నిర్వృ
తియు లోకాయతుల కుత్సేకంబును బాషండులకుం జెవుల
పండువును గాపాలికుల కుపకారంబునుం గాఁ గైవారంబు
సేయుపాతకులం గనుంగొని శక్రుండు సక్రోధుండును
వరుణుం డరుణలోచనుండును నగ్ని యుద్విగ్నమానసుం
డును గృతాంతుం డత్యంతరోషుండును నై యయ్యాశా
పతులు నలువురు నల్దిక్కు మొగంబై "యోదురాత్ములారా!
యేమిదుర్భాషణంబు లాడెదరు? దంభోళిధారాసంరం
భంబును బాశవల్లీసముల్లాసంబును సముజ్జ్వలజ్వాలాకరాళ
తయు నుద్దండగదాదండతాండవంబును నెఱుంగరె? యేల
ప్రేలెదరు? పుత్రకామేష్టి శ్యేన కారీరీ ప్రముఖంబు లగు
మఖంబులు దృష్టఫలంబు లగుటం గన్నులం గానరె?
యావేశంబున గయాశ్రాద్ధాదు లపేక్షించు భూతంబులం
జూచి పుణ్యఫలంబులు తెలియ రావె? యంగారప్రవేశంబు
దేహంబులు సొక్కకుండుట నేత్రోత్పాటనంబునఁ గన్నులు

వచ్చుట యాదిగాఁ గలవిశేషంబుల దేవతాప్రభావంబులు భావింపం దగదే? యివ్విధంబునం బ్రల్లదంబు లాడెదరు గాన మిమ్ము నాలుకలుఁ గోయక సెలవులు ప్రేల్పక ప్రాణంబులు గొనక యెట్లు సైరింపవచ్చు?" ననిన భయం బంది యవ్వందిజనంబులు బృందారకులకు నమస్కరించి యి ట్లనిరి.

మ. బలభిద్వహ్ని యమప్రచేతసులకుం బ్రహ్మాదు వే మెల్లనుం
గలిభూపాలునియొద్దిపాఠకుల మీ కైవారదుర్భాషణం
బులకుం గాని యతండు మెచ్చఁడు దయాబుద్ధిం పరాధీనవృ
త్తుల నిర్వేదల మమ్ముఁ గావఁదగునీద్రోహంబు లేకుండఁగన్.

సీ. వందిజాతులము మావాచాటతాటోప
మునకు నల్గకు మయ్య యనిమిషేంద్ర!
యనపరాధులము మాయందు నక్కటికంబు
పాటింపు మయ్య కృపీటజన్మ!
పరతంత్రులము మాయబద్ధవాక్యములకుఁ
దప్పు పట్టకు మయ్య ధర్మరాజ!
యాశార్తులము మా యహంకృతిస్ఫురణకు
నెరసు లేరకు మయ్య వరుణదేవ!

తే. భయము గొందుము నిర్ఘాతపాతమునకు
దలఁకుదుము భీషణోల్కాప్రదాహమునకు
జంచలింతుము పటుదండచండిమలకుఁ
బగులుదుము పాశవల్లరీబంధములకు. 90

వ. అని యంజలిపుటంబులు లలాటంబున ఘటించి యుంచి యచ్చాటుకారులు నైవారం బుడిగి యూరకుండి రనంతరంబ. 91

ఆ. గగనమండలమునఁ గాలాయసప్రుఁదేర
మాలకాకి పడగ దూలి యాడ
ద్వాపరంబ దానుఁ దన్మధ్యవర్తియై
వచ్చువాని నీలవర్ణదేహు. 92

సీ. కఱకు లై పెరిఁగినకుఱువెండ్రుకలతోడఁ
బట్టయౌదలఁ గావిపాగ యమర
నిగిడి పూతేకు బాగుగఁ గత్తిరించిన
గడ్డంబుకొన రొమ్ముఁ గమ్మిరింప
బండికందెనతోడఁ బ్రతివచ్చుమైచాయ
నీలిపచ్చడముతో మేలవింప
నవరత్నచందనద్రవకల్పితం బైన
నూత్నత్రిపుండ్రంబు నొసల నొప్పఁ

తే. *గోఱమీసలు మిడిగ్రుడ్లు కుఱుచపొడవు
డొప్పచెవులును గొగ్గిపండులును గలిగి
యున్న మద్గ్రీవుఁ డై వచ్చుచున్న వానిఁ
గలిమహారాజుఁ గనిరి దిక్పాలవరులు. 93

క. హేలాబృందారకుఁ డగు
నాలవయుగరాజుఁ గాంచి నయనాంబుజముల్
వ్రాలిచిరి నిర్జరేంద్రులు
మాలనిఁ గనుఁగొన్న యుత్తమద్విజులక్రియన్. 94

తే. ప్రౌఢగురుకోపరీధాపలీఢుఁ డైన
యాత్రశంకుండువోలె జంభారియెదురఁ
గాంతిసంపద గోల్పోయి కలియుగంబు
సాధ్వసాతిరేకంబున జలదరించె. 95

వ. ఇట్లు ప్రభావోపనమ్రుండై ప్రణిపాతంబు సేసి. 96

తే. సేమమే నిర్జరస్వామి? శిఖి! సుఖంబె?
శర్మమే నీకు నోయమధర్మరాజ?
స్వస్తియే పాశహస్త? మీ ప్రస్తవమునఁ
దగ నపాస్తరజస్తమస్తముఁడ నైతి. 97

వ. దమయంతీ స్వయంవరంబునకుఁ బోవుచున్నవాఁడఁ గాలాతిపాతంబుగాకుండ నన్ను వీడ్కొలుపుడు నామనోరథంబు సఫలం బగునట్లుగా ననుగ్రహంబు సేయుండు మీయాశీర్వాదంబునం గృతకృత్యుండనై శీకాధీశ్వరతనూభవ వివాహంబై మిమ్ము దర్శింపంగలవాఁడ నని పల్కుటయు. 98

క. వా రన్యోన్యంబు ముఖాం
భోరుహములు సూచి నేత్రముల జిఱునగవుల్
దేరఁగ నిట్లనిరి యహం
కారగుణాంకురితబహుళ కలికిం గలికిన్. 99

సీ. తగు నయ్య! కలిరాజ! తగవుధర్మము దప్పి
యాడునె యిట్లు నీయంతవాఁడు?
పరమేష్ఠి నైష్ఠికబ్రహ్మచారిగ నిన్ను
నా డెఱుంగఁగఁ జేసినాఁడొ లేదొ?
యవకీర్ణి యని నిన్ను నవధరించినయప్డు
ద్రోహిగాఁ దలఁపఁడే ద్రుహిణుఁ డాత్మ?
నీశ్వరాజ్ఞాసేతు వెట్లు దాఁటఁగ వచ్చుఁ
దదధీసులకు నన్యథాకరించి?

తే. మాకుఁ జూడంగ నిది యసమంజసంబు
మిన్న కరుగుము కాదు నీకన్న తెఱఁగు

సత్వరంబునఁ బరుల కిచ్ఛావిఘాత
మాచరింపరు కృతబుద్ధు లయినవారు. 100

వ. త్రిభువనానందమాకందవాటికావసంతంబైన యవ్వృత్తాంతంబు సరికడచె నచ్చోటనుండియ కదా మేము మరలి వచ్చుచున్నవారము సానురాగు లగునాగులం బరిత్యజించి యనల్పు లగువేల్పుల నధిక్షేపించి యసమాను లగురాజమానులం దృణీకరించి యన్నళినాక్షి నలుండనువాని వరించె నేమిసేయవచ్చు? నీశ్వరాజ్ఞ బలీయసి, నీవును మాతోడివాఁడవ కదా, మరలి రమ్మనవుడు రోషాంధుండై యక్కలిరాజు దివిజరాజుల కిట్లనియె. 101

తే. పద్మజున కేమి? మీ కేమి? పరుల కేమి
యంగనాపరిభోగలోలాత్మకులకు?
నైష్ఠిక బ్రహ్మచారి నైయె నష్టిఁ బొంది
చేరుగడ లేక కలి చెడం జెడియెఁగాక. 102

వ. ఏకపత్నీ వ్రతస్థు లైనమీ రేల దమయంతిం గామించి పోతిరి? ధర్మంబు పరుల కుపదేశింపవచ్చుంగాక తమకుం జేయవచ్చునే? పోదురు గా కేమి? మీయందు నొక్కరుం డక్కొమ్మ వరియింపఁగలిగెనే? నిషధరాజు భోజకన్యక వరియింప మీరు లజ్జవరియించితి రింతియకాక యేమి? మిమ్ముం గడకంటం జూచుచు నెమ్మొగం బోరపుచ్చుచు నటఁ గడచి యప్పణఁతి యెట్లు చనియె? మీ రెట్లు సహించితి? రిది యసంగతంబు, చిత్తంబులు చిలివిలివోవ నత్తెత్తి మీరు సూచుచుండ నమ్మత్తకాశిని మనుష్యు నెట్లువరియించె? మీయంతవార లపేక్షించి యుండ నప్పద్మాక్షి నతిసాహసంబున నవ్వీరసేని యెట్లు

చేకొనిరొ? నతండు చేకొనినం గొనిరొః గాక యీక్ష్మపీఠ
యోని యతనివివాహంబునం గూటసాక్షిగాై కైలాటంబు
నేసి యప్పాటం దనకుం బెండ్లిఘటింపం జేయ నావటంబై
యుండునట్లు సేయక హుతం బెట్లు పరిగ్రహించె? మహాను
భావులగుమీరు భావంబుల నిట్టియభిమానభంగం బెబ్భంగి
నంగీకరించితిరో కాని ననుబోఁటికి నియ్యపవాదకందళి
చందురునియందుఁగందునుంబోలె డెందంబునం బాయదు.
మీయందఱకు నొక్కవిన్నపం బనుగ్రహించి వినుం డ
వ్వసుమతీశు మోసపుచ్చి యమ్మచ్చకంటి నెత్తుకొని మింటి
మీఁదికిం దెచ్చెద నప్పుడు మీకడకంటికిం గెంపు రాదు
గదా! మహాలాభంబుపట్టున నీర్ష్యారోషంబు లెట్టివారికిం
బుట్టు ననాదికాలప్రవృత్తంబులైన రాగద్వేషంబులు ఛేదింప
నెవ్వారికి శక్యం బగు? నది యట్లుండె మఱియొక్క యుపా
యం బవధరింపుఁడు, పాకశాసనుండు పావకుండు పరేతపతి
పాశహస్తుండు పంచముండ నైనయేను నియ్యేవురముం
బాండవులు పాంచాలినిబోలెఁ బంచికొని యనుభవింతము
గాని యప్పకంజాక్షిం బట్టికొనినత్తునే? యని పరమకపటో
పాయమాయాప్రయోగపరిపాటీపాటవంబు దేటపడ బహు
ప్రకారంబులం బలికిన. 103

ఆ. హరిహయాది విబుధు లక్కలిమూర్ఖతా
ముఖరతావికారములకు ఱోసి
కడఁగి పలికి రపుడు గంభీరభారతీ
భారతీప్రసన్నమైనభాషణముల. 104

సీ. అర్హ మెవ్వనిరూప మంగసంభవరాజ్య
రక్షసింహాసనారోహమునకుఁ
గడుగు నెవ్వనికీర్తి కార్తికీతిథినిశా
నాథబింబంబు నెన్నడిమికందు
భవన మెవ్వని ప్రతాపప్రదీపమునకుఁ
బుండరీకభవాండమండలంబు
చుట్ట మెవ్వనికేలు సురభిచింతారత్న
రోహణాచలవారివాహములకుఁ

తే. గలుష మెవ్వానిఁ దలఁచినఁ గ్రాఁగిపోవుఁ
బుణ్య మెవ్వానిఁ గీర్తింపఁ బొడవుపడయు
వాఁడు నిషధేశ్వరుండు మా వరుసవాఁడు
కలిమహారాజ! మన్నింతు గాక వాని. 105

ఉ. మచ్చిక వీరసేనునికుమారునకుం బరమోపకారికిఁ [లో
మెచ్చి జగం బెఱుంగఁ దమనెయ్యపుఁజెల్లెలి నిండుఁగొల్వు
నిచ్చితి మింతలోపలనె యింతటివారముఁ దప్ప నేర్తుమే? [కిన్.
యచ్చపలాక్షి గూఁతు రతఁ డల్లుఁడు మాటలు వేయు నేటి

ఆ. ఏము నలువురందు నెవ్వాఁడు గాఁ జాలు
నిచ్చిపుచ్చుకొన్న యీాలగ్రద్ద?
మాకు నింపు గావు మాను మీాసుద్దులు,
కలహముల మొగంబ! కలియుగంబ? .07

క. పామరతఁ బట్టఁ బాఱకు
పామర! కలిరాజ! నిషధపతి మదలీలా
పామరసావేశంబునఁ
బా మరవిందారిఁ బట్టఁ బాఱినభంగిన్. 108

క. కాలోచిత మగుకార్యం
బాలోచితముగ నొనర్పు మది మేలు విరు
ద్ధాలాపంబులు పలుమఱు
నేలా పచరింప నిపుడు? హేలానిమిషా! 109

వ. అని తమలోన. 110

క. పోయెదుఁ బో యిప్పుడు తా
త్త్రీయాకయుగంబునుం దురీయయుగంబుల్
దోయి యయి నలున కుపహతి
సేయంగా లేరు వానిశీలముకలిమిన్. 111

క. యుగశేష మశేషమహీ
జగదవనపరాయణుండు సమధికబాహా
యుగళీయుగపదుపార్జిత
జగతీవిజయుండు నలుఁడు సామాన్యుండే? 112

వ. అని వెండియు నాఖండలాదులు "పరోక్షప్రియా దేవా" యనుపురాణవచనంబు గారణంబుగా నిగూఢప్రౌఢనిజ భాషణవిశేషంబున. 113

తే. 'యామితి త్రేత్యసజ్జ్ఞాన మమరశేష
రాజసంస ది హాస్యతాం రహ తమాంసి
తత్ర మా గాస్త్వ మితి గతో ద్వాపరేణ
రాజసంసది హాస్యతాం ప్రథమ' మనిరి. 114

వ. మఱియు బహుప్రకారంబుల బుద్ధిసెప్పియుం బ్రియంబు వలికియు హెచ్చుఁ గొండాడియు బృందారకులు గలిద్వాపరంబుల భూలోకగమనంబు ప్రతిషేధించిరి. ఇట్లు ప్రతిషేధించినను నారిసుభాషితంబు పెడచెవులం బెట్టి మోర

కంబును సాహసంబును మదంబును నమాయయు నవివేకంబుఁ
దనకు నైజగుణంబు లగుటం గలియుగంబు, కరయుగంబు
మొగిచి యి ట్లనియె. 115

ఉ. వేలుపులార! మీకుఁ బదివేలనమస్కృతు లాచరించెదన్
మేలు దలంపుఁ డే నవనిమీఁదఁ జరించెదఁ గొంతకాల మ
ద్వేలత నెవ్వఁడే నొకఁడు దేశములోన నధర్మ వర్తియై
ప్రాలినవాఁడు లేఁడె పలువంకల నారసి చూడ వచ్చినన్?

తే. వానిదుర్వృత్తి నెపముగా వసుధ యేలు
నలునిపైఁ బ్రత్యవాయంబు గొలుపువాఁడఁ
గొలిపి యతనిఁ బ్రవేశించి నిలుచువాఁడ
నిలిచి యాతని మననీక యలఁచువాఁడ. 117

మ. వినుఁడీ నాదుప్రతిజ్ఞ వేల్పులు! జగద్విఖ్యాతచారిత్రు నా
తని నేఁ బట్టెద నెట్టియేని యొకరంధ్రం బబ్బెడుంగాక యే
నను వేలంబును గొల్చు దేవతలు రాలా యేమి? యావంతత
ప్పున నైనం గలి సొచ్చుఁగాని మయిమైఁ బోనిచ్చునే
యెవ్వరిన్? 118

తే. ఆవగింజలు దాటికాయలుగ నాడి
దొడ్డ సేయుదు సన్నంపుదోస మైన
హరిహరబ్రహ్మ లైననాయంతవారె
కపటమాహేంద్రజాలాదికౌశలమున?. 119

క. కాదంబరిఁ ద్రావింతును
జూదం బాడింతు వలలఁ జొక్కులఁ బెట్టం
బైదలుల నియోగింతును
వైదర్భతనూజమీఁదివల పుడిగింతున్. 120

తే. వేయుమాటలు నేల? యో విబుధలార!
యవధరింపుఁడు నిజము మీయడుగులాన
భైమితో భూమితో బెడఁ బాపువాఁడ
నిమిషమాత్రంబునంద యానిషధపతిని. 121

వ. అని పలికిన నెమ్మనంబులం గుత్సించుచు నతని యుత్సాహంబు దైవకల్పితంబు గావున నన్యథాకరింప నలవి గాక నాకవప్రముఖు లగుబర్హిర్ముఖు లన్యోన్యముఖావలోకనంబు సేసి మనకుం గలిరాజుతోడ సంవాదం బింతియ చాలు, తమ్ముండు నన్నయు నగుకలిద్వాపరంబులు బ్రహ్మలోకంబున నుండి యాబ్రహ్మనియోగంబునఁ బోవుచున్నవారు గావ లయుఁ బాతెడునీళ్లకుం గట్టపెట్టం బని యేమి? 'పోదండు పోదం డ'ని పోయిరి. కలియును, గామక్రోధలోభమోహా పరివారపరివృతుండై నిషధదేశంబుచాయన భూమండ లంబునకు డిగ్గె నప్పుడు. 122

## నిషధదేశంబునఁ గలిపురుషుని దుర్వర్తనము

సీ. *హోమాగ్ని ధూమోర్మి కుద్వేగ మొందుచుఁ
గ్రతుధూమములచేత గాసిపడుచు
నతిథిపాదక్షాళనాంభఃప్లుతము లైన
గృహమేధిమందిరక్షితితలముల
జీరువారుచుఁ బూర్తశిశిరానిలంబులఁ
జలిపట్టి వణఁకుచు సవనశిష్ట
పుటపాకములవెక్కఁ బురపురం బొక్కుచుఁ
బశుబంధములఁ జూచి భయముపడుచు

* 'హోమాజ్యగంధోర్మి' అని పాఠకల్పనము సమంజసము.

తే. వ్రతులబృసులకు యతికోటిరాంభములకు
బ్రహ్మచారులయాషాఢపంక్తులకును
నంతరంగంబులో నాత్మహాననశంక
తరతరమె యుద్భవిల్లంగఁ దల్లడిలుచు. 123

సీ. సవనయూపస్తంభసంభారములఁ జూచి
శూలంబులో యని స్రుక్కి స్రుక్కి
భూదేవనిటలోర్ధ్వపుండ్రంబు లీక్షించి
ఖడ్గంబులో యని కలఁగి కలఁగి
బ్రహ్మచారిజనోత్కరంపుమౌంజులు సూచి
పాశంబులో యని భ్రమసి భ్రమసి
యధ్వరస్రుజ్నికాయంబు లాలోకించి
యురగంబులో యని యులికి యులికి

తే. విప్రనికరం బనుష్ఠానవేళలందుఁ
బాణిపంకేరుహోదరాభ్యంతరమున
నినిచి యెత్తినయాచమనీయతీర్థ
జలము శాపోదకం బని యలికి యలికి. 124

సీ. ఆత్మఘాతకుఁ జూచి హర్షింపఁగా నేల?
యతఁడు సర్వస్వారయజ్ఞకర్త
బ్రహ్మఘ్నుఁ గని యేల పరితోష మందంగ?
నాతఁడు సర్వమేధాభిరతుఁడు
బ్రహ్మచారిత్వరీరతి కేల మోదింప?
నది మహావ్రతదీక్షకంగకంబు
విప్రులమధుపానవిధి కేల యలరంగ?
సౌత్రామణీష్టియాజకులు వారు

తే. ధూళిధూసరుఁ బరికించి యేల నిక్క?
పావనస్నానవిధిమృదాభవ్యుఁ డాతఁ
డనుచు మూఁడవయుగము దన్నచట నచట
భ్రాంతిఁ దీర్పఁగ గతిలేక భంగపడుచు. 125

వ. నిషధదేశంబులోఁ జనువాఁడు మఱియును. 126

తే. స్నాతకుల ఘాతుకులఁగాఁగ సంస్మరించు
నహితులకుఁబోలె వెఱచునగ్న్యాహితులకుఁ
దలఁచు దాంతుఁ గృతాంతుఁగాఁ గలియుగంబు
మానితం బైనయమ్మహీమండలమున. 127

సీ. బౌద్ధులఁ బాటించుఁ బరమబంధులఁబోలెఁ
జార్వాకులకుఁ గరాంజలి ఘటించు
జైనులంబొడగన్న సంతోషమునఁ దేలుఁ
జే యని మ్రొక్కు లోకాయతులకు
వైతండికుల కభివాదనం బొనరించుఁ
బాషండులకుఁ జాల భక్తి సేయుఁ
గాపాలికులకు సత్కారంబు గావించుఁ
బరిచయించును దిగంబరులతోడఁ

తే. బాశుపతకక్షపాలికాభస్మధూళి
పాళి యుద్ధూళనక్రియావేళయందు
గాలివెంబడిఁ బైఁ రాలఁ గళవళించుఁ
గలియుగము పావకస్ఫులింగంబు లనుచు. 128

క. వేగుంబోకల మేల్కని
భాగవతోద్గీయమానభగవద్గీతా

రాగంబులు విని మది ను
ద్వేగంబు వహించుఁ జేఁదు దిన్నవిధమునన్. 129

సీ. అప్పరాకుఁడు పరాకమ్మగా రే తెంచు
త్రోవకు దూరంబు తొలఁగిపోవు
నాదోసకారి సన్న్యాసి దవ్వులఁ గాంచి
యోలంబునకు దారియొదిఁగి యుండు
నాపాపజాతి మాసోపవాసిని నీడ
లంఘింపఁ బోయి కాల్నిలియఁ గూలు
నావెనుగొలుకు యాయావరవ్రతధారిఁ
బగదారి యని డస్సి పండ్లు గొలుకు

తే. నానృశంసుండు నుసుఁగు వైఖానసులకు
నాదురాత్ముండు శ్రోత్రియు నపహసించు
నాఖలుఁడు సోమయాజి నిరాకరించు
నక్కిరాతుఁ డనుష్ఠాత ధిక్కరించు. 130

శా. ఆనిర్భాగ్యుఁడు గాళరాత్రి యని హాహాకారముం జేయుఁ డెం,దాన న్నాధ్వస మంది బ్రాహ్మణులు సంధ్యావేళఁ జేత స్నమా,ధానం బొప్పఁగ నావహింప నుదయత్సప్తాశ్వబింబంబులోఁ,గా నాకాశపథంబు నిండికొని శ్రీగాయత్రి యే తేరఁగాన్. 131

తే. జినగవేషణనిరతుఁ డాచెట్ట సూచు
* నభినవబ్రహ్మచారిచయంబు నెదుర
క్షపణకాలోకనార్థి యాఖలుఁడు గాంచు
నక్షపణకేళిరాజసూయాధ్వరమున. 132

* 'అభినవబ్రహ్మచారిచయాజినంబు' అని పాఠకల్పనము మూలానుగుణము.

మ. యజమానప్రమదావికస్వరభగన్యస్తాశ్వదీర్ఘస్మర
ధ్వజదండం బగునశ్వమేధమఖతంత్రంబు న్నిరీక్షించి యి
క్కుజనుండొత్తిలి నవ్వె వేదవిదులం గుత్సించి పుష్పాస్త్రుచే
నిజహస్తంబున వ్రేసి యశ్రుకణముల్ నిండార నేత్రంబులన్.

వ. ఇవ్విధంబున. 134

ఉ. భాండికమండలీప్రకృతిబంధుఁడు బంధకికాప్రియుండు పా
షండసఖుండు జైనతరుషండవసంతుఁడునుం దిగంబర
స్థండిలశాయియుం గపటధార్మికమిత్త్రుఁడు నై వినింద్యక
ర్మం డతఁ డుండెఁ గొన్ని దినముల్ నిషధావనిమండలంబునన్.

మ. కలికాలంబు విదర్భరాజతనయాగాఢాంకపాళీమహో
త్కలికాలంబునఁ సంచరించె నిషధక్ష్మామండలి న్మార్గభూ
నలనిగ్రాహిణి యైనపారిషద సైన్యశ్రేణి దర్పోద్ధతిక్ -
నలనిగ్రాహిణియైనయాత్రకు సముల్లాసంబు సంధిల్లఁగాన్.

వ. ఇవ్విధంబునఁ గలియుగంబు తిరిగితిరిగి యొప్పట్టునం బాపంబు
రూపింప లేక యొక్కచోట నేకాంతంబునం దమయంతవట్టు
వారినిం గూడి మంతనం బుండి “రంధ్రాన్వేషణంబులంగాని
దోషంబులు గానంబడవు, రంధ్రాన్వేషణంబులు గాల
క్రమంబునంగాని ఫలింపనేరవు, గావున ద్వాపరం బదే
శంబున వివాదలేశంబు లరయునది, నాకుం గామక్రోధ
లోభమోహంబులకును వేఱువేఱ యధికారంబులు పాలు
వెట్టెద, నవి యెయ్యవి యం టేని. 137

సీ. యతి మాచకమ్మ గోత్రాలు దీక్షాపత్ని
మగనిఁ బాసినయింతి మఱునిపాలు

తీర్థవాసులును మాంత్రికులు దాయాదులుఁ
దర్కవాదులును గ్రోధంబుపాలు
యజనదీక్షితులు నధ్యయనపాఠకులును
భస్మగుంఠనులు లోభంబుపాలు
బాలవైతండికపామరాహంకార
చుంబకమతులు మోహంబుపాలు

తే. కేళిసౌధమహాచంద్రశాలయందు
హంసతూలికపాన్పుపై నహరహంబు
నవవధూకేళివిహరణోన్మత్తుఁడైన
నిషధనాథుండు నాపాలు నిక్క మరయ. 138

వ. అని యందఱ నియోగించి. 139

ఉ. కాకపతాకతోఁ ఘనసృగాలకిశోరకరథ్యపంక్తితో
గీకసపాలికాఘటితకింకిణికావలితోడఁ గూడి భ
ల్లూకపకృత్తిక్లృప్తమగులోహశతాంగముఁ గొంచుఁ బోవనా
జ్ఞాకృతిఁ బంచె నప్డు నిజ సారథి గ్రైనదురాత్ము దుస్సహున్.

వ. పంచి యనంతరంబ యన్నిగ్రహయుండు దానును గర్దభధూళి లగ్నంబున నిషధనగరంబుఁ బ్రవేశించి సంధ్యాకాలంబున మసకమసక చీఁకటిం గుఱుహూపుడుం బుట్టంబు ముసుంగు వెట్టికొని పెడతెరువున శూన్యభవనద్వారవేదికా విటంకంబుల విశ్రమించుచు దేవమందిరప్రాంగణంబులకుం దొలంగి వేశవాటంబునడుమ నొయ్యన నడచి యట మలంగి దురోదరక్రీడావినోదంబుల ననుమోదించుచుఁ గాదంబరీగృహంబు లొరసికొనుచుఁ జైత్యంబులు గడచి శృంగాటకంబులు దాఁటి దూరంబు చని నిభృతప్రకారంబున నృప

గారంబు డాసి యచ్చేరువం గేళిసౌధంబు కెలన శిలాప్రాకార పరివృతంబై నందనవనంబునకు విందనం జాలి చాలం జెన్నొందుమందిరోద్యానంబు దఱిసి నెత్తమ్మికొలని కుత్తరంబునఁ గేళాకూళికిం బడమటఁ గుటజకురంటకఝింటికా సర్జఖర్జూరకేతకీషండమండలంబులోనం గాఱుకొని గాలికిం దూఱరానియొక్కయీరంబు సొచ్చి యచ్చట. 141

శా. సంతోషంబున నాశ్రయించె విలసచ్ఛాఖోపశాఖాశిఖా
సంతానోదయచుంబితాంబరదిశాచక్రంబు భూపాలశు
ద్ధాంతారామరమాంగనాభిసరణవ్యాపారసంకేతవి
శ్రాంతిస్థానకము న్విభీతకమహాసత్త్వంసహాజాతమున్. 142

వ. ఇట్లు కలిరాజు నిషధరాజధర్షణార్థంబు శుద్ధాంతలీలావనంబులోనితాఁడిమ్రానికోటరంబున వసియించి రంధ్రాన్వేషణ తత్పరుండై యుండె నట పూర్వంబున. 143

నలదమయంతీగృహప్రవేశము

తే. అవ్విధంబున నిషధదేశాధిరాజు
నగరు సొత్తెంచి యంతరాంతరములందు
దొరల మంత్రుల దండనాథులను నృపుల
నిజనివాసంబులకు నన్పె నిలిచి నిలిచి. 144

ఉ. పాయఁ దొలంగుఁ డం చుభయపార్శ్వములం బగళంబు
సేయుచుం, దోయజలోచన ల్గొలిచి తోఁ జనుదేరఁగఁ బెండ్లి
కూఁతుర, త్యాయతవైభవస్ఫురణ నంతిపురంబున కేఁగు
దెంచెఁ బై, డాయఁగ జిడ్డవై చినకడానిమెఱుంగుహసిండి
పాలకిన్.

ఉ. కైశికవృత్తి యొప్పఁ గ్రథకైశికరాజసుతావివాహదీ
క్షాశుభవస్తుసంయుతము గా బయకారు లొనర్చినట్టిప్రా
వేశికమంగళ ధ్రువలు వీసుల కింపుగఁ బాడి రంగనల్
దేశివిధంబు మార్గమున తేటయు నొక్కట పాళగింపఁగాన్.

వ. అనంతరంబ వధూవరులు లౌకికవైదికాచారపారంగతు లగు పెద్దలపనుపున గృహప్రవేశసమయోచితంబు లగుమంగళాచారంబులు ప్రవర్తించుచుండి, రప్పుడు వివిధశిల్పకల్పనానిపుణు లగుశిల్పిజనులు సుపర్వపర్వతశిఖరోత్సేధం బగు విహారసౌధం బలంకరించి రందు. 147

విహారసౌధవర్ణనము

క. ఒకచోటఁ బువ్వుఁబందిరి
యొకచోఁ జప్పరము దూఁగుటుయ్యెల యొకచో
సకినల గిలిగిలిమంచం
బొకచోఁ గప్పురపుఁ బలుఁగుటోవరి యొకచోన్. 148

సీ. ఒకచోట సాలభంజిక గీలు వన్నిన
మురిపెంపురవగోండ్లి పరిఢవించుఁ
గుడ్యగర్భాగారగూఢ యై యొకచోట
నలవోక నొక్కపద్మాక్షి పలుకు
నొకచోట జలయంత్రయుక్తి నీలపుటాల
మొగులు చల్లనిచిన్నిముసురు గురియు
నొకచోటఁ బగలుచంద్రికలు గాయుచు నుండుఁ
జంద్రకాంతోపలస్తంభవితతి

తే. రమణఁ బోషితరాజకీరములతోడ
నొక్కచోట విటంకనిర్యూహపంక్తి

నసమశరశాస్త్రకారిక లభ్యసించు
శారికలు నూత్నకనకపంజరములందు. 149

తే. కోరకించినకడకంటికొలికి జూచి
వాడివాలికపూఁదూపు వంక దీర్చు
చొరగి రతిదేవిపాలిండ్ల నొత్తగిలిన
యించువిలుకాని వ్రాసినా రిడుపునందు. 150

సీ. అమరవల్లభుఁడు గౌఁతముమూర్తి యిల్లాలి
జీకటితప్పు నేసినవిధంబు
సితభానుఁ డాచార్యుచిగురాకుఁబోఁడిపైఁ
గన్నువైచినకన్నె కలుపుమరులు
నట్టేట దాశకన్యకకు నువ్విళ్లూరి
జాలిఁ బొందినపరాశరువిరాళి
గారాపుఁగూఁతుపైఁగాఁ గానిపనిఁ బూను
వనజసంభవునినెమ్మనము వెలితి

తే. దారువనవీథి శీతాంశుధరునిరంతు
శౌరిగోపాలకామినీచౌర్యకేళి
కామరసభావములు మించి కానఁబడఁగఁ
దీర్చి యిడుపులయందుఁ జిత్రించినారు. 151

చ. భవజలరాశిదాఁటు నెడ భావజవాయువు వీచినం దపగ
ప్రవహణముల్ సమున్నతసుపర్వవధూకుచపర్వతాహతిం
బవిలిన దీనతావికలభావము నొందిన మౌని నావిక
ప్రవరులభావచిత్రములు వ్రాసినవారు కపోతపాలికన్. 152

శా. చూడాహేమవిటంకకోణములయంచు న్మెట్టి యెవ్వారికిం
జూడం గాల్గొ వడంకునన్నెలవునం జోద్యంబు వేద్యంబుగాఁ

బాడుం గోమలపంచమస్వరమునం బంచేషుశౌర్యాంకము
ల్గ్రీడాకిన్నరయుగ్మముల్ నఖరపాళిం గిన్నెర ల్మీటుచున్.

తే. వలచుఁ గస్తూరినిగరాలతలుపు దెఱవ
గాజుటోవరిలో ధూపగంధలహరి
హాటదురుసూక్ష్మ ర్తినాసికాపుటకుటీర
కోటరాంతగకుటుంబితాపాటవమున. 154

క. అచ్చట నచ్చట నిడుపుగ
విచ్చినఁగుసుమాస్త్రశాస్త్రవేదులమనముల్
మెచ్చించుఁ దెరలమంజిడి
పచ్చడములు చతురశీతిబంధంబులతోన్. 155

క. కలకంఠులకును సురతపుఁ
గులుకుటెలుంగులు వచించుగురువులువోలెన్
వలభులఁ గలకలరవములఁ
గలకల యని పలుకుఁ గలికికలవింకంబుల్. 156

ఉ. టంకముఖంబుల న్మణివిటంకములన్ లిఖియించి యున్న మీ
నాంకరసప్రసంగమధురాదిమగాథలు పారదారికా
హంకరణక్రియాసమభిహారమహాపరిహాససంకథా
సంకలితంబు లొప్పిదపుశైలిఁ బఠింతురు ప్రౌఢభామినుల్.

**నలదమయంతులవిహారము**

వ. ఇట్టికేళీసౌధంబున నిషధరాజు వధూసహాయుండై రతి
సహాయుండైనమన్మథుండుచుంబో లెనభీష్టవిషయోపభోగం
బులం దృతీయపురుషార్థంబు చరితార్థంబుఁ జేయువాఁడై.

తే. కామశరవృత్తవర్తికాగంధతైల
దీపితానేకదీపికాదీప్తిజాల

వర్ధితాటోపకామదేవప్రతాప
మయినమాహాత్మ్యమెక్కె నింతియును దాను. 159

సీ. ప్రథమానురాగంబు రాజహంసముచేతఁ
దెలిపి యంపినయట్టిడిట్టతనముఁ
బేరోలగంబునఁ బెద్దగద్దియనుండి
దృష్టించి డిగ్గనిధీరతయును
నుత్తరప్రత్యుత్తరోక్తినైపుణశక్తి
గర్వంబు సూపినకలికితనము
వరణావసరమున వాసవాదులమాయ
మాయింప నేర్చినమతిబలంబు

తే. నాత్మదివ్యావతారతావ్యంజకంపుఁ
బ్రౌఢిఁ బచరింప వ్రీడాభరంబుకలిమి
వైశికం బయి యుండు నెవ్వారికిఁ జూడఁ
గాన లజ్జింప లజ్జించెఁ గమలవదన. 160

తే. స్వప్నసంభోగశతసహస్రములు వోయె
భ్రమసమీహావినోదార్బుదములు సనియె
మనములో నిండియున్నది ననువుఁ గూర్మి
యింక లజ్జాభయంబుల కెడము గలదె? 161

తే. ఉపలములకంటెఁ గఠినంబు లొక్కవేళఁ
గుసుమములకంటె నొకవేళఁ గోమలములు
గాన లజ్జాభయంబులు గలవొ లేవొ!
పువ్వుఁబోఁడులహృదయంబు లెవ్వఁ డెఱుఁగు? 162

వ. కళావతీప్రముఖసఖీజనప్రయత్నంబున నవరత్నశయ్యాసనా
థంబును ధవళదుకూలకీలితమనోజ్ఞంబునుఁ బ్రత్యంతస్థాపిత

కనక కలశభృంగారుతాలవృంతదర్పణతాంబూల పేటికాఫల
కుసుమగంధకస్తూరికాదిపరికరోపశోభితంబును నగు కౌతు
కాగారంబు ప్రవేశించి. 163

క. వ్రీళాసరిన్నిమజ్జన
లీలోచితనమనస్సల్లలితముఖి యగుచుఁ
నేలఁ బదాంగుళి వ్రాయుచు
బాలామణి నిల్చెఁ దలిమపర్యంతమునన్. 164

ఉ. భావము పల్లవింపఁ బువుఁబానుపుమీఁదికి నేర్పున న్వాయ
స్యావలి దార్ప నెంతయును నర్మిలితోఁ గుసుమాస్త్రశాస్త్రవి
ద్యావిదుఁడో య్యఁ బైఁదిగిచియక్కునఁ జేర్చెభుజాయుగాంక
పాళీవలయంబులోనఁ దవిలించి కురంగవిశాలలోచనన్. 165

క.. హారపరితోషమున
భూరమణుఁడు గమిచె నింతిపొంకపుఁజన్నుల్
కూరిమి నేరిమిఁ బులకాం
కూరంబులు వొడమఁ జిగురుఁగోరులకొనలన్. 166

చ. శుచి యగుహారదామమున శుక్తిజరత్నవిభాపరీక్షణం
బుచితపుఁగైతవంబుగఁ బ్రియుండు ప్రియం బెసలారఁ జూచి
నం, గుచలికుచద్వయం బొరసికొంచుఁ బయిం బులకాంకు
రంబులం, బ్రచురము నేయుచు న్నిగిడె బాణి వధూమణి
కంఠసీమకున్. 167

తే. నవసమాగమవేళ నయ్యవసరమున
నువిద లజ్జాభరంబున కోహటించి
నైదుపదిసేసె వలరాజునంతవాఁడు
నరయ నెవ్వానిసొమ్ము జయాజయములు. 168

సీ. ఒకదీప మార్చిన నున్నదీపంబులు
నప్పుడ తమకుఁ దా మాఱుటయును
దాలవృంతానిలచేలాంచలాదిక
వ్యాపారముల దీప మాఱమియును
నాఱినదీపంబు లప్రయత్నంబున
మఱి చూడఁ జూడఁగ మండుటయును
మండి యాఱియు నాఱి మండినదీపంబు
వెలుఁగుఁజీకటియుఁ గావించుటయును

తే. గలుగునట్లుగ వరశక్తికలన రాజు
శిల్పముల నవ్వులాటకుఁ జేయుచుండఁ
దరుణి కుతుకత్రపాద్భుతాతంకభార
సంకటస్థాయివై సారిణాంక యయ్యె. 169

తే. తరుణి లజ్జాభరంబుచేఁ దన్నువడియుఁ
దోయజానన వెఱపుచేఁ ద్రోపునడియు
నుల్లమున ఖేద మందక యుండ నట్టి!
బాలుఁడా యేమి తలఁపోయఁ బంచశరుఁడు? 170

ఉ. ఇంచుక యుల్లసించినను నేమని చెప్పఁగ? లజ్జ వచ్చి త
ర్జించును సాధ్వసం బడరి శిక్ష యొనర్చును మౌగ్ధ్య మేచి వా
రించుఁ బ్రగల్భభావము ధరించి య శేని వధూమనోగతిం
బంచశిలీముఖుండు పసిపాపఁడు వో నవసంగమంబునన్. 171

సీ. మూర్ధాలకంబులఁ ద్రుక్కుఁ జక్కఁగఁ దీర్చి
నలువు నెమ్మనములో మొలవఁ బెట్టు
గర్పూరహారంబు గదియించు నెపమునఁ
గుచకోరకంబుల గోళ్లఁ గముచుఁ

దల్పయంత్రణనిరోధంబునంకిలి కోర్చి
యర్ధాంకపాళిక నాదరించుఁ
నిబిడనీవీబంధనిర్మోక్షణమునకుఁ
బని పూని భీతిఁ గంపంబునొందు

**తే.** నూరుసంవాహనమునకు నుత్సహించు
ఘననితంబంబుపై నుండ మనసు వెట్టు
నిమ్ననాభికి డిగ్గంగ నెమ్మిసేయుఁ
బద్మలోచన మరఁగి భూపాలుకరము. 172

**తే.** విభుఁడు పరిహాస మాడి నవ్వించుఁగాని
పడయ లేఁడయ్యె నెన్ని యుపాయములను
రాజబింబాస్యతాంబూలరాగసుభగ
దంతకురువిందమాలికాదర్శనంబు. 173

**మ.** మనుజాధీశుఁడు మగ్న హారలతికామాణిక్యముద్రాంకిత
స్తనభారంబుగ గాఢనిర్దయపరిష్వంగంబు పూఁబోఁడికిన్
ననుపుంగూరిమిమై వడి న్మరపెఁ దన్మందాక్షభావంబునన్
దనపూవిల్లును నొక్కచందమునఁ గందర్పుం డొగిన్ ద్రోవంపఁ
గాన్. 174

**తే.** మెలతఁ యప్పుడు మందాక్షమీలితములు
సౌహృదస్మేరములు నైనసంగమముల
ముకుళితంబులుఁ బుష్పితంబులును నైన
భూజములతోడియుద్యానభూమిఁబోలె. 175

**సీ.** 'అధరంబు చవిసూపు మన్య మేమియు నొల్ల'
నని చెక్కుఁ జేరి మంతనము వలుకు

దైన్యంబు దోఁపఁ బ్రార్థన సేసి తుదిఁబొంచి
బలిమి సొంపునన చుంబన మొనర్చు
'వదనారవిందాసవము ప్రసాదముసేసి
నను నేలికొంటి గా'యనుచు మెచ్చు
'ననుఁగుభృత్యునకు నీపని యర్హ మగు' నంచు
నూరుసంవాహనం బొయ్యఁ జేయు
తే. 'నేల కుసుమాస్త్రకేలికి నింత వెఱవ!
వెఱవ కేనేమి నీసఖీవితతి యేమి?'
యనుచుఁ దగ బుజ్జగించి హస్తాంబుజమున
వలపుఁగీలు దెమల్చు భూవల్లభుండు. 176
సీ. పతిపాణిపల్లవచ్యుతనీవిబంధన
వ్యగ్రబాలాహస్తవనరుహంబు
ధవకృతాధరబింబదశనక్షతివ్యథా
భుగ్న లీలావతీభ్రూలతంబు
ధరణినాయకభుజాపరిరంభమండలీ
గాఢపీడితవధూఘనకుచంబు
వరనఖాంకురమృదువ్యాపారపులకిత
నీరజాక్షీనితంబోరుయుగళి
ఆ. యస్తివామ్యభార మస్తికౌతూహలం
బస్తిఘర్మసలిల మస్తికంప
మస్తిభీతి యస్తిహర్ష మస్తివ్యథం
బస్తివాంఛ మయ్యె నపుడు రతము. 177
చ. కుతుకమునం గురంగమదకుంకుమచర్చ వహించి నీలలో
హితరుచులై స్వయంభు లయి యీహితసౌఖ్యవిధాయు

లైన య,య్యతివపయోధరంబులకు నర్ధనిశాసమయంబున
న్నమం,చితనఖకింశుకార్చనము సేసె మహీపతి భక్తి
యేర్పడన్. 178

తే. లావునను గూడి పాణిపల్లవయుగమున
నొత్తిపట్టిన సరకు గా కుల్లసమున
హారకాంతిచ్ఛలంబున నల్లనవ్వ
తరుణిచన్నులు రాజుచిత్తము హరించె. 179

క. తరుణికి ధాత్రీపతికిని
బరిచుంబనవేళ దంతపరిపీడన మి
క్షురసంపుఁబానకములో
మిరియపుఁగారంబువోలె మెచ్చొసరించెన్. 180

తే. చూచియునుఁ జూచుఁ గ్రమ్మఱ సుదతిఁ దివుటఁ
గౌఁగిలించియు నప్పుడ కౌఁగిలించు
జుంబనము సేసియును రాజసూనుఁ డెలమిఁ
జుంబనము సేయుఁ జౌనరుక్త్యంబుగాఁగ. 181

తే. కులుకుబెలుఁగుల నలరారు పులకములను
గంపములను సమగ్రసీత్కారములను
జుంబనక్రీడలందు రాసుతునిమోము
శీతకరుఁ డౌట చెప్పక చెప్పె నబల. 182

ఉ. వంచన లేక యాననము వాంచినయప్పుడు ఫాల మోర గా
వించుచుఁ జెక్కుటద్దములు వ్రీడభరంబునఁ గీ లెటింగి చుం
బించి మనంబు తాలిమి గభీరతరిత్తకు నెత్తఁ బూనిన
మించి ముఖాబ్జచుంబనము మేకొనినవ్వ విభుండు నేర్పునన్.

తే. సతతతాంబూలభోగ కషాయితములు
సుదయభాస్కరనవసౌరభోల్బణములు
నయినయధరామృతముఁల నింతియును బతియుఁ
జలిపి రన్యోన్యమధుపానలలితకేళి. 184

చ. అవహితభావభావితసహస్రకరామృతభానుమండలుం
డవుచు నసమ్మతక్షణసమభ్యుదితం బగుభావలాభలా
ఘవము మదిం జయించి ప్రియకాంత రసాంతరసన్నిరుద్ధమా
ర్దవఁ గరఁగించుచుం గరఁగె రాజు సమంచితపారవశ్యఁడై.

తే. భాగ్యవశమున భావలాభంబు లపుడు
రెండుసమమైనఁ గుసుమకోదండనర్మ
కర్మకాండసమాపనశర్మసార
సంవిభాగంబు సమమయ్యె సతికిఁ బతికి. 186

వ. ఇవ్విధంబున నవ్వామ వామపాదతలవిలుప్తమన్మథశ్రీ విలాసుం డై నయవ్విలాసివలనం బ్రథమపరిహాసంబునం బతంగపుంగవగవీహైయంగవీనరసరసాయనాస్వాద ప్రరూఢంబునుఁ జిరకాలావస్థానసుస్థిరంబును వివిధవిఘ్న పరంపరానిస్తారనిరంకుశభాగ్యోదయంబును సౌభాగ్యగర్వసర్వస్వసహాయంబునునైన నిజానురాగంబునకుం దగి వ్రీడాజితమన్మథంబులును దుల్యలజ్జాస్మరంబులును గందర్పవిజితమందాక్షంబులును నగుకేళీవిశేషంబులఁ గుచకుంకుమపంకంబుచేతను నున్నుంగురులచిన్ని పువ్వులచేతను నడుగు నెత్తమ్ముల క్రొత్తలత్తుకచేతను బింబాధరంపుఁదాంబూలరసరాగంబులచేతనుం బర్యంకభాగంబు దేటపఱుపం దులాకోటీరటనంబును గంకణఝణఝణత్కారంబును మేఖలా

కలాపకింకిణీకలకలంబునుఁ గులుకుబెలుంగులం గలసి సకినల కీలుఁబఱపులచప్పుళ్లు విప్పు నేయం గ్రమంబున విచ్ఛిన్న హారమండలం బగుసురతాండవంబునకుం గళాసిక యగు పారవశ్యంబునం గుసుమకార్ముకనర్మకర్మకాండకేళీసమాపనా శర్మసారంబు సమసంవిభాగంబుగాఁ బంచికొని యనుభ వించుచు నిశ్వాసధారాసారంబుల వాసాగారంబధివాసిం చుచు నెడనెడం బ్రియనఖక్షతార్పణంబులు ఫాణితంబునం దొనర్చిన మరి చావచూర్ణంబులం బోల నర్ధనిమీలితనయన తారకంబునుఁ బ్రస్వేదబిందుకందలిత నాసికాశిఖరంబునుఁ జర్వణాఘాతబింబాధరశయాళుయావకంబును సామిలుప్త లలాటతిలకంబును నగువదనకమలంబు హృదయవల్లభు వక్షస్థలైకదేశంబునం జేర్చె నప్పుడమ్మిథునంబు. 187

మహాస్రగ్ధర.—

సరి యాతాయాతరంహ
శ్చలకలితరతశ్రాంతినిశ్వాసధారా
పరిషద్వ్యామిశ్రభావ
ప్రవిఘటితమిథఃప్రాణభేదోదయంబై
యొరిమన్వక్షోజపాళీ
యుగకరిమకరీయుగ్భుజామధ్యచిహ్న
భరణవ్యక్తైకభావో
భయవిలసితహృద్భాగమై నిద్రవోయెన్! 188

వ. మఱియును. 189

తే. సురతపారవశ్యంబులఁ జొక్కి చొక్కి
కేళినిద్రాసుఖంబులఁ దేలి తేలి

మేలుకొని బాహ్యరతిలీల మించి మించి
దంపతులు గ్రీడసల్పిరి తనివి సనక. 190

సీ. ప్రాణేశునొసలిలాక్షాంకంబు వొడ గాంచి
ముసిముసినవ్వుతో మోము మలఁచు
నేల నవ్వితి? చెప్పు మిప్పు డం చడిగిన
నధిపుచేతికి నించుటద్ద మిచ్చు
మఱుపెట్టి చనుదోయి మదనాంకములు సూచుఁ
దనునవ్వువిభుఁజూపులన యదల్చు
రాజుచేఁ జికురభారము సెజ్జ మోవంగ
మ్రొక్కించుకొనుఁ బాదములకు నలిగి

తే. చంద్రమూర్తిజిగీషానురూపకళల
కతనఁ దేకాదశాకృతి గైనభంగిఁ
జరణనఖదర్పణములందు ధరణివిభుఁడు
లీలఁ బ్రతిబింబితుండుగా లోలనయన. 191

సీ. దంతక్షతవ్యథాదాయికాస్యమునకు
దంతక్షతవ్యథ దండు వగొప్పెఁ
గుచకుంభమర్దనక్రూరకర్మం బైన
కరము పాదము లొత్తి కరుణ వడసె
దీప మార్పినయప్డు దీప్తిసూపినకల్ల
మహారత్నము మ్రొక్కి మాన్చికొనియె
నొత్తినతప్పు వో నుడిపెఁ గ్రీడాశ్రాంతి
నమృతంబు గురిసి దివ్యాభరణము

తే. మోస గాకుండ నపరాధములకుఁ దగిన
శాస్తి యన్నింటి కిబ్భంగి సంభవించె

సతికిఁ బతికిని నవ్వేళ సంఘటిల్లు
శంబరారాతిధర్మయుద్ధంబునందు. 192

ఉ. మంకెనపువ్వుమీఁదియళిమాడ్కి నృపాధరపల్లవోదరా
లంకృతిమైనదంతపదలాంఛనముం గని కన్నుఁగోనలం
దంకురితంబు లైనదరహాసలవంబులు పద్మనేత్ర యి
ట్టింకులు సేసెఁ బక్షములయీఁటమిఁ గాటుక చిమ్మచీకటిన్.

ఉ. క్రిక్కిఱిచన్నుదోయి యిరుగ్రేవలకాంతియుఁ బంచబాణుఁ
గ్రొవ్వెక్కఁగఁజేయ హస్తయుగ మెత్తివిహారభరంపుఁ బేర్మి
కిఁ, విక్కి ప్రసూనము ల్గురియువేనలి వీడిచి కొప్పువెట్టుచోఁ
జొక్కులఁబెట్టె భూవరునిచూపులఁ గోమలి బాహు
మూలముల్. 194

శా. వాసోభూషణగంధమాల్యరచనావైచిత్ర్యసజ్జాంగియై
యాసీమంతిని యన్యకాంత యనుమిథ్యాభ్రాంతి పుట్టిం
చుచు, న్వాసాగారమునందు నొక్కతెయ నానాభంగి వర్తిం
చు న,త్యాసక్తి న్నవసౌఖ్యలీలల విభుం డామోదముం
బొందఁగాన్. 195

ఉ. కైటభవైరియుఁ జలధికన్యయు నాదిగఁ గీటకంబునుం
గీటకపత్నియుం దుదిగఁ గృత్స్నము రాజును దాను నై
నిరా,ఘాటరతిఁ సుఖించుటకుఁ గాంక్ష యొనర్చు మనోంబు
జంబునఁ, బాటలగంధి నిత్యనిరుపాధికరాగనిబంధనంబునన్.

ఆ. వనిత రూపవేషవాసోంగవాసనా
భూషణాదిబహువిశేషరచన
నన్యదివ్యకాంత యనుశంక పుట్టించి
నేర్పు క్రొత్త గాఁగ నృపతిఁ గవయు. 197

వ. ఇవ్విధంబున నమ్మిథునంబు నిధువనక్రీడాపరాధీనంబై యానందజలధి నోలలాడుచుండ నవ్విభావరి జరాభావంబు ధరియించె. మనోభవుండు కోదండం బెక్కుడించి సంగ్రామ విరామసూచకంబుగాఁ గుక్కుటకంఠ కాహళంబులు పట్టించె, నప్పుడు వైతాళికులుం గేళీప్రాసాదపర్యంతభాగంబున నుండి యుచ్చైస్స్వరంబున నిట్లనిరి. 198

ఆశ్వాసాంతము

మ. ప్రణతానేకనృపాలమౌళివలభీపర్యంకరత్నావళీ
ఘృణికిర్మీరితపాదపీఠ జయలక్ష్మీకేళిమాణిక్యద
ర్పణ! దర్పాంధవిరోధిరాజనివహప్రాణానిలాహారభ
క్షణకుక్షింభరిభూరిదక్షిణభుజాస్తంభాసికుంభీనసా! 199

క. ప్రౌఢజయశ్రీకుచభర
గాఢపరీరంభకేళికౌతుకసుఖసం
రూఢనవపులకముకుళ
వ్యూఢోరస్థల! విలోచనోత్సవమూర్తీ! 200

మాలిని—

అమృతజలధికన్యాప్రాణనాథాంఘ్రిసీమా
సముదితసురగంగాసామ్యకీర్తిప్రదీపా!
కమలభవపురంధ్రీకంఠనక్షత్రమాలా
సమధికమణిరోచిస్స్వచ్ఛలీలానులాపా! 201

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్య పుత్త్ర సకలవిద్యాసనాథ శ్రీనాథప్రణీతంబైన శృంగార నైషధకావ్యంబునందు సప్తమాశ్వాసము.

శ్రీ ర స్తు

# శృంగార నైషధము

## అష్టమాశ్వాసము



శ్రీధామ రెడ్డి వేమ
క్ష్మాధీశ్వరసచివసింగనామాత్య ! దిశా
సౌధశిఖరాగ్రకీలిత
సాధీయస్స్ఫటిక కుంభసన్నిభకీర్తీ ! 1

వ. అవధరింపుము. 2

### ప్రాభాతవైతాళికగీతములు

మ. జయ శీతాంశుకులావతంస! నిషధస్వామీ! మహారాజ! య
వ్యయధైర్యాకర ! నిద్ర మేల్కొనుము సంధ్యావేళ
యేతెంచె నీ, నయనాబ్జంబుల కిచ్చు భవ్యశకునానందైక
కల్యాణముల్, శయనోత్థాయము భోజరాజతనయాసంఫుల్ల
నేత్రాబ్జముల్. 3

మ. వరుణప్రేయసి యైనదిక్కుఁ గదియ న్వాంఛించుచున్
జంద్రికా, పరిధానంబుఁ గ్రమక్రమంబునఁ బరిభ్రంశంబు
నొందించు చం, దురునిం గన్గొని యింద్రదిగ్వనిత ప్రత్యూష

ప్రసాదోదయ, స్ఫురణవ్యాజమున న్నిజాననమున న్పూనెం
బ్రహాసద్యుతుల్. 4

సీ. చంద్రాతపంబులుసాంద్రతుషారతమ
స్సహాయుధ్వాలై పరిశ్రాంతిఁ బొంచె
నతిదరిద్రాణదేహద్యుతి ప్రాణమై
ప్రాలేయకిరణబింబంబువ్రాలె
నపరస్పరంబులై యాకాశవీధికిఁ
గొన్ని భాస్కరకరాంకురము లెగసె
నమహాతితరదీప్తి నంతంతఁ జుక్కలు
సంఖ్యావిధేయ శేషంబు లయ్యెః
తే. గుముదకేదారమున నుండి క్రొత్తవిరియుఁ
గమలషండంబునకు వేడ్కఁ గాఁపువచ్చె
కొదమతుమ్మెదకడ తెక్కఁ గుసుమవెట్టె
నభినవం బైన ప్రథమసంధ్యాగమంబు. 5

క. కరవాఁడిసూదితుద మొన
నర దఱువంబడిన ముత్తియంబునుబోలెఁ
గర మొప్పె రజనికరణీ
కరవమథువు హిమము కుశశిఖాశిఖరమునన్. 6

మ. దివిషద్దంపతితల్ప మైనగగనోద్దేశంబునం దారకా
నివహంబు ల్గుసుమప్రసంగములు గా నిర్వాణకాంతిచ్ఛటా
నవతూలప్రకరోదరంభరినిశానాథుండు గండోపధా
నవిధాలీల వహించె నత్తటి నఖండం బైనబింబంబుతోన్. 7

శా. శ్యైనంపాతమెయి న్నభంబునసహస్రాంశుండు వైచెఁ గర
శ్యేనవ్రాతము నంధకారబలిభుక్ఛ్రేణీజిఘాంసారతిఁ

దానం జంద్రుఁడు పశ్చిమాశకు శశత్రాణార్థమై యేఁగె ను
డ్డీనం బయ్యె నుడువ్రజంబు పరిపాటిం బారువాలో యనున్.

క. లఘుగతి ననూరుసారథి
విఘటితతిమిరుఁ డయి వీఁడె విచ్చేసె దివిన్
మఘవపురప్రాసాద
ప్రఘాణకప్రాంగణము లుపఘ్నంబులు గాన్. 9

చ. గ్రహములు నిర్జరీసురతకాలవిసూత్రితహార రత్నసం
గ్రహములు మేఘవీథి యనుకౌతుకమందిరచత్వరంబునన్
బహుకరమార్జనావిధి ప్రభాతముఖంబునఁ బాయఁ దట్టె ని
ష్ఠహహ భుజిష్యవో నియతి!యంతకయారసిచూడవచ్చెన్.

సీ. ఆమ్నాయశాఖాసహస్రవివర్తంబు
లుడురాజకల్యాణహోమవహ్ను
లాకాశహర్మ్యాగ్రహస్తదీపంబులు
ప్రాలేయజలరాశిబాడబములు
చక్రవాకమనోవిశల్యౌషధంబులు
దశదిశాకుంకుమస్థాసకములు
రాజమండలకాంతిరాజయక్ష్మము లంధ
కారవేదండకంఠీరవములు

తే. పద్మవననిర్నిబంధనబాంధవములు
కైరవాకరసమ్మోహకారణములు
సవితృమణిపావకేంధనసామిధేను
లెగసె నుదయాద్రియవుల నీరెండకొనలు. 11

క. పసిపాపయెండకొనలను
మసమసకనియిరులుఁ గలసి మన మలరించెన్

దెసల నలుగడల గుంజా
విసరంబుల సరులు ప్రేలవిడిచినభంగిన్. 12

సీ. నముచిసూదనువీటినడువీథిచక్కటి
నింతకు నేతెంచు నినుని తేరు
కట్టుపకాసులై గగనాంగణంబున
మందేహులింతకు మాటుకొంద్రు
స్రవియించు నింతకుఁ బ్రథమాద్రినటులలో
నూష్మసోఁకి శిలాజతూత్కరములు
ప్రీతి నింతకు నేఁగుఁ బిన్నపెద్దంతయు
వినుతసావిత్రిమంత్రజపము వినసొంపు

తే. మేలుకొను మిదె రాజన్యమీనకేతు!
కాలకంఠసమర్చనాకాలమయ్యె
విశ్వవిశ్వంభరాభారవిధృతిదీక్ష!
దీర్ఘతరనేత్ర! నిషధధాత్రీకళత్ర! 13

వ. మఱియునుం దిమిరవిరహపాండురాయమాణదిఙ్మండలంబును విచేయతారకంబును దరిద్రాణప్రాణరోహిణీరమణబింబచుంబ్యమానచరమాచలశిఖరభాగంబును శిశిరసలిలక్షోదకుక్షింభరితీరకంఠరవిమయూఖంబును గుముదకేదారనిద్రాసుఖనిదానంబును, నిశావిరహవిహ్వలచక్రాహ్వయవిహంగమస్త్రీపుంసహృదయ బృంహితాహ్లాదంబును గువలయినీకుక్షింభ్రాణాయమాన మధుస్తబంభరంబును లవణస్యదోపవాహ్యాహయవిలేహ్యమానమాణి మంథశిలాశకలంబును, సంధ్యాయమానవ్రతపరాయణవిశిష్టాధ్వైత్ర జనవిహితాధ్యయనవిరామంబును బ్రాహ్మణాభిమంత్రిత తార్ఘ్యాంజలిజల

వజ్రధారావిదారితమందేహదేహంబును నై యత్తఱిం గ్రొత్తవిరియు నెత్తమ్మివిరులకేసరంబులవాసనలు గ్రోలి మత్తిల్లి యుల్లాసంబునం దూలియాడు కొదమతుమ్మెదకదుపులు ఘుసృణసుమనశ్శ్రేణిశోణం బగుపొదుపుసంజకెంజాయయుం గలయ బెరసి గురువెందపేరులయందంబు వహించుటయునుం, గుళికిసలయంబులమీఁదం బ్రాలేయాంభఃకణక్రమసంభృతంబులై రజనియనుపిడియేనుంగుఫూత్కారంబు సేసి యుమిసినం జిలికిన కరవమథుశీకరంబులంబోని యుదకబిందుసందోహంబులు సుషిరకరణనిపుణ నికరనిశాతాయససూచీశలాకాశిఖాంకురసంకరంబునం గరంబు హత్తినముత్తియంబుల ననుకరించుటయును, వికసితైకదళంబు లగుకుశేశయకోరకంబులచేతం గమలాకరంబులు మిహిరకిరణాభోగభోజనార్థంబు సంధ్యారాగాంబువుం జేత మొదల నాపోశనం బెత్తుభావంబు భజియించుటయును, చులుకితతమస్సింధుపూరంబు లగుబిసినీబాంధవువి కరంబులవలన రంధ్రస్రుతంబు లగునంధకారబిందుసందోహంబు లిందిందిరవ్యాజంబున నంభోజవనంబులోనం దొరఁగి విస్మృమరమధుస్రోతశ్శికచ్ఛద్వయీపరిసరంబులం బంకశంకావహం బగుటయునుఁ, దటరుహతరునికాయనిష్కుహక్రీడానీడంబుల నిద్రించి మేల్కాంచి కలగొనం బల్కుపులుఁగులగొలుఁగులకోలాహలంబులచేతనుంబోలెఁ బ్రత్యుద్బుద్ధంబు లగు సరోజాతంబులలో మధువ్రతవ్రాతంబులు వధూవదనలబ్ధమధురాధరసుధాపానంబుతోడ సాధువిధీయమానంబు లైన మధుపానమహోత్సవంబులం బ్రవర్తిల్లుటయు, గాఢతమతమ

స్తమాలగహనభంగమాతంగంబులును గనత్కనకరేణుత్రస
రేణువిసరపిశంగంబులు నగుపతంగకిరణశృంగంబులు భవన
వలభిజాలంబులం దూఱి భ్రమదణుగణాక్రాంతంబులై కుంద
పరిభ్రమణభ్రాంతి నాపాదించుటయును విభాతలక్ష్మీవిలాసంబు
విశ్వనయనోత్సవం బయ్యె; వెండియు:— 14

మ. సలిలాభ్యుక్షణకంబుసంభవరజోజంబాలపాండూభవ
జ్జలజచ్ఛిత్కరపత్త్రభావభజనన్ సంధిల్లి శీతాంశుమం
డల మిద్ధ స్తమితార్ధబింబ మగుచు న్నక్షత్రశంఖచ్ఛిదా
కలనచ్ఛేకసరోజబాంధవకరాగ్రస్వైరనిష్పీడనన్. 15

చ. తటుకున నస్తమించెఁ బతిదైన్యముఁ జూడఁగ నోడి తారకా
పటలమునుం ద్రియామయును బాపురె! యింతులవాఁడిపంత
ముల్!, గటకట! తద్వియోగమునఁ గ్రాగి నశింపఁడ నిష్ఠు
రాత్ముఁడై, పటిక మొకో విధుండు? సడుపట్టుకలంకము నల్ల
గారయో? 16

ఉ. నిద్దుర మేలుకొమ్ము రజనీకరవంశవతంస! కుంకుమం
బద్దినభంగి మింట నదె యామినిచెల్లెలు కాల్యసంధ్య దా
నుద్దియ సేయుచున్నయది యుష్ణమయూఖసుతప్రసూతికిం
బ్రొద్దులు సొచ్చి యున్నయది పూర్వదిశాసరసీరుహాక్షికిన్.

శా. వైదర్భీహృదయేశ! మేలుకొని నిర్వర్తింపు సంధ్యానవ
ప్రాదుర్భావవిధేయముల్ విధికలాపంబుల్ ముహూర్తంబు
లో,నాదిత్యుం డిటఁ దోడుసూపుఁ బటురంహఃపిష్టపిష్టీకృత
త్మాదిగ్వ్యోమమహాతమోఘ్నము నమోఘుంబుల్ మయూ
ఖౌఘమున్. 18

శా. ప్రాతఃకాలము వాయసంబు 'పణినాపతో క్తశాస్త్రంబులో
దాతజ్ స్థానులు చెప్పఁ డెవ్వి?' యనుచందం బొప్పఁ గాకా
యనం, జాతుర్యం బలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిల
వ్రాతం బిచ్చెఁ దుహీంతుహీ యనిగృహారామప్రదేశంబులన్.

ఉ. వారక రాత్రియెల్లఁ బ్రియవల్లభుఁ డైనశశాంకుఁ గూడి యి
చ్ఛారతికేళి జాగరము సల్పినఖిన్నత నొక్కొ దీర్ఘికా
కైరవరాజి యుప్పు నిజగర్భనివిష్టమదద్విరేఫఘుం
కారమిషంబునం దఱచుగా గుఱువెట్టుచు నిద్రవోయెడిన్.

వ. అని యివ్విధంబునం బ్రభాతకాలవర్ణనంబు సేయువైతాళి
కుల నాదరించి. 21

మహాస్రగ్ధర.—

బలవద్దారిద్ర్యముద్రా
ప్రకుపితకమలాపాటలాపాంగరోచిః
కలికాసందేహదాన
క్షమకమలమణిగ్రామజాగ్రన్మయూఖో
జ్జ్వలశుద్ధస్వర్ణభూషా
నముదయముదయత్స్వాంతసంప్రీతి నయ్యా
ర్థులకుం బుత్తెంచె భూనా
థుసతియుడిగపుందోయజాతాక్షిచేతన్. 22

వ. అప్పుడు. 23

నలుఁడు ప్రాతఃకాలకృత్యంబులం దీర్చుట

తే. తనకు నెద్దానిఁ గన్యాప్రదాన వేళఁ
యౌతకంబున నిచ్చె నెయ్యంపుమామ

యట్టియీశ్వరవరదత్తమైనరథముఁ
గామగమనంబుఁ దలఁచె నక్షణమ నృపతి. 24.

క. మదిఁ దలఁచినంతమాత్రన
యుదయించుసహస్రరశ్మికుపమానంబై
మదనక్రీడాసౌధము
తుదనిలువున నిలిచె రథము తోయదవీథిన్. 25.

తే. కనకకింకిణికాజాలకములు మెఱయ
గగనతరుపుష్పమగుపుష్పకంబువోలె
నెచట నుండియొ యేతెంచి యెదుట నున్న
పసిఁడి తేరెక్కె వసుమతీపాలసుతుఁడు. 26.

శా. వాతాహారవిరోధి నెక్కు చను విష్వక్సేనుఁడుం బోలె ని
ర్ధౌతాసిద్యుతి మేచకంబగువియద్భాగంబునన్ భాస్కర
ద్యోతస్ఫీతవిమాన మెక్కి మదిలో నుత్సాహ మేపారఁగాఁ
బ్రాతస్స్నానము సేయఁ బోయె ధరణీపాలుండుమిన్నేటికిన్.

వ. ఏఁగి యట మహానటజటాటవీవాట నవతరించి నభోవీథీ మేఖీ
భూతం బగుధ్రువమండలం బొరసికొనుచు శింశుమారా
కారంబునం దారకామూర్తియై పవ్వళించిన పాంచజన్య
ధరునిచరణపల్లవంబుఁ బ్రక్షాళించుచు, సోమార్కమయ
మహాసోపానంబులఁ బ్రవహించి, పరివహాపవనఝంపాసంపా
తంబులం దూఁగియాడు కరుళ్లచప్పుళ్లు దిక్పుటంబుల
నాస్ఫోటింపం, ద్రివిష్టపలలాటికాతిలకంబును నరకపురగోపుర
ద్వార దంతార్గళయును నారాయణచరణారవిందమకరంద
బిందునిష్యందంబునుఁ బుండరీకభవకమండలుతీర్థధారయు
నైనయమ్మహానది డాసి విమానంబు డిగ్గి, జలావగాహనా

యాత జంభారాతి కుంభి కుంభస్థలిసాంద్ర సిందూర పరాగ సంధ్యాయమానసలిలంబును నప్సరఃకుచతటీపటీరచర్చావమ చర్చికాసురభిళంబునుఁ బ్రతీరపారిజాతకుసుమధూళిపాళిపి శంగితసైకతంబునుఁ జింతామణి శిలాసంఘాతసంఘట్టన సము చ్ఛలజ్జలశీకరాసారచ్ఛటాస్ఫోటిత గగనభాగంబును గన త్కనకపులినవేదికామధ్యాసీన కామధుగ్ధేనూధస్యధారా ధోరణీ ప్రవాహబృంహితోర్మియు నగునొక్క రేవున డిగ్గి తత్ప్రదేశంబున. 28

సీ. అత్యంతనియతిఁ బంచాంగంబు పఠియించె
నఘమర్షణస్నాన మాచరించె
దైవతఋషిపితృతర్పణం బొనరించె
సంధ్య నారాధించె సవితఁ గొలిచె
గాంగేయవాలుకాలింగమూర్తిని నిల్పి
కాంచనాబ్జములఁ బూజించె శివునిఁ
బారిజాతకలతాపల్లవాగ్రంబులు
చిదిమి యొయ్యన మేపెఁ ద్రిదశగవికిఁ
తే. గేలుదోయెత్తి యాదలఁ గీలుకొలిపి
గగనమునిరాజులైనచుక్కలకు మ్రొక్కి
దివ్యరథ మెక్కి వేగ యేతెంచె మరలి
యధిపుఁ డటు సురనదిఁ దీర్థయాత్ర సలిపి. 29

తే. హృద్యసౌధాద్రికుట్టిమానేకరూప
ధాతుకాధిత్యకా తటాంతరము సేరె
ధరణినాథపురందరాధ్యాసితంబు
రత్న దివ్యవిమానధారాధరంబు. 30

తే. దివసముఖకార్యజాతంబుఁ దీర్చి వచ్చు
పతి నెదుర్కొనె భక్తిసంభ్రమ మెలర్పఁ
జెలువ ప్రత్యగ్దిశాసింధు సలిలవీచి
తూర్పుదెస వచ్చునిండుచందురునిఁబోలె. 31

నలదమయంతుల గోష్ఠి

వ. తరణిఖరకిరణకందళితమందాకినీకనకారవిందంబునకు విందై నిజసందర్శనానందమందస్మితసుందరం బగునయ్యిందువదన వదనంబు మదనరాగంబు సంపాదింప సర్వాసర్వంసహానిలింప సార్వభౌముండు. 32

ఉ. మానససంప్రమోదము సమగ్రముగా సురలోకవాహినీ
స్నానవిధిప్రవృత్తివచనంబునఁ జెప్పక చెప్పినట్లు స
న్మాననఁ దన్నెదుర్కొనినమానవతీజనతాలలామకుం
గానుక యిచ్చెఁ దావి వెలి గాని కనత్కనకారవిందమున్.

క. పురుషోత్తమలాలిత య
త్తరుణీమణి మిగుల నొప్పెఁ దత్సమయమునన్
సురసింధుహేమకమలము
కరకమలంబున ధరించి కమలయుఁబోలెన్. 34

తే. రాజముఖికి నయ్యేకవరాటకంబు
లలితసమ్మానమున నేకలక్ష మయ్యె
రాజకృపఁ గన్న యొక్కవరాటకంబు
నేకలక్షం బగును సంశయింపనేల? 35

వ. అనంతరంబ విధివిశేషంబు సమాప్తింపంగోరి చకోరలోచనం గడకంట నీక్షించుచు నిషధాధ్యక్షుం డగ్నిహోత్రగృహంబునకుం జని. 36

తే. తన కనిష్ఠంబు లగుకలిద్వాపరముల
కేతు సూపియుఁ బోలె ధాత్రీశ్వరుండు
నిత్యసత్త్రేత ఋత్విక్ప్రణీత యైన
త్రేత సేవించె విజితమిత్త్రేతరుండు. 37

తే. విభుఁడు ప్రాహ్ణాతనక్రియావిధికలాప
మీవిధంబునఁ దీర్చి సద్భావ మొప్ప
భామినీభావజిజ్ఞాసఁ బాదపద్మ
యుగము నిశ్శబ్దముగ మెట్టు చొయ్య వచ్చె. 38

ఉ. మిన్నక చేర వచ్చి యొకమేలపుమైపడిఁ బువ్వుఁబోఁడి త్రా
ల్గన్నులు మూసెఁ బాణికమలంబుల భూపతి నవ్వుచున్న యా
సన్నసఖీజనంబుఁ గనుసన్న నదల్చుచు నవ్వధూటి త్రా
ల్గన్నులఁ జేరలం గొలుచుకైవడిఁ గన్నుల నవ్వ దేఱఁగాన్.

తే. ఒక్కపూఁబోఁడి భ్రూసంజ్ఞ నొయ్యఁ బిలిచి
యాత్మహస్తాధికారమయ్యబ్జవదన
హస్తములకిచ్చి యెఱుఁగనియట్ల తాను
వసుమతీశుండు నగె నస్డై వచ్చినట్లు. 40

తే. జ్ఞాతహస్తాంబుజాంతరస్పర్శ యగుటఁ
గైతవంబు నెపంబు గాఁ గమలనయన
మానసంబున మానసంపద వహించె
నాననంబున ధరియించె మౌనముద్ర. 41

చ. కుటిలకటాక్షవీక్షణముఁ గోమలనూత్నకపోలరాగముం
జటులసమంచితభ్రుకుటిసంవళనంబునుఁ జూచు వేడుక౯
జిటపొట రేఁచె రాజు సరసీరుహనేత్రకుఁ గామకేళికి౯
గటుకులు గానిమానములు గావె ప్రదీపనసిద్ధిహేతువుల్.

వ. అప్పుడు నృపతి సామోపాయంబునం బ్రణయమానం బపన
యింపం దలంచి యి ట్లనియె. 43

ఉ. దాస్యము నిన్న రే కుసుమధన్వుఁ డొకండును సాక్షిగా సరో
జాస్య! సహించినాఁడ, విను, మప్పుడ మ్రొక్కుట లేదు, నీకు వి
శ్వాస్యుఁడఁగాన మ్రొక్కఁగొను స్వస్తటినీసలిలాభిషేకసా
రస్యపవిత్రమస్తకము వ్రాల్చెద నీపదయుగ్మకంబుపైఁ. 44

తే. కుటిల మగునీకటాక్షంబుఁ గువలయాక్షి!
యించుకించుక నామీఁద నెట్టఁబాఱె
నిగిడి మరలినభావంబు నిజము దెలిసె
శ్రవణకూపనిపాతైకశంకఁ జూప? 45

క. లేయెండ వేఁడి యయ్యుం
దోయజషండముల కింపు దొలఁకించు క్రియన్
నీయలుక పరుసనయ్యును
నాయెడపకు వేడ్క సేయు నళినదళాక్షీ! 46

తే. చిప్పుఁ గెమ్మోవిచిలుగాటు నెపము గాఁగఁ
దామరసనేత్ర! కోపింపఁ దగదు మమ్ము
ఫలరసాస్వాద మొనరించుచిలుక మీఁదఁ
బింబవల్లీమతల్లి కోపించు నెట్లు? 47

తే. ఉవిద! నీమాట విన నొల్ల మూరకుండు
కా దనక వింటిమే నేమి కారణంబొ?
రాజకీరంబు మము నిష్ఠురంబు లాడుఁ
బ్రతిపదంబును బరుసగాఁ బలుకు వీణ. 48

వ. అని వెండియు రసావేశంబున. 49

తే. చూడ వేటికి నిడువాలుసోగమీాల
సూడు పట్టంగఁజాలెడుచూపుఁగొనలఁ
బలుకుపలుకున నమృతంబు చిలుకుచుండఁ
బలుక వేటికిఁ జిలుకలకొలికికాన! 50

శా. కోపం బిత్తయు నుజ్జగించి సుమనఃకోదండనారాచధా
రాపాణింధమ మైననీధవళనేత్రజ్యోత్స్నపైఁ జల్లవే
తాపం బాఱఁగఁ గౌఁగిలించుకొనవే తథ్యంబు నీబంట నే
యోపుంస్కోకిలవాణి! యోశశిముఖి! యోపక్వబింబాధరా!

మ. విసువౌచున్నది కాలయాపనకు నువ్విళ్లూరెడుఁ భావముల్
రసభంగం బగు మానరోష మతిదీర్ఘం బయ్యె నే నింతటం
బ్రసభాలింగనపూర్వకంబుగ మనోరాగంబు రెట్టింపఁ గా
ణిసిథాత్వర్థ మనుగ్రహింపఁ గదవే నీరేజపత్త్రేక్షణా! 52

వ. అని పలికి బలిమిన యాలింగనంబు సేసి తల్పంబునకుం దార్చె.

తే. పతి కళావతి యనుదానిఁ బద్మనయన
దమసహోదరిగారాపుదాదికూఁతు
నంతికమునకు రప్పించి యాదరించి
నర్మసాక్షిణిఁ గావించి నగుచుఁ బలికె. 54

వ. కళావతీ! నీవు నొడికారపుమాట లాడం బ్రోడ వని విందుము. నీ వెఱుంగని పాడిపంతంబులు లేవు. తగవు దప్పక చెప్పె దేని గొన్ని మాట లడిగెదము. మాటలాడక విచారించి యుత్తరం బిమ్ము. 55.

తే. అన్యపురుషునిఁ గలలోన నైనఁ దలఁప
దాత్మలో నంద్రు మీావిదర్భాత్మజాత

యన్యపురుషుఁడు గాఁడె పుష్పాయుధుండు?
వనిత దనయాత్మలోన నెట్లునిచె నతని. 56

వ. అని యడిగిన నది యిట్లనియె. 57

తే. వనితహృదయంబులో నున్న వాఁడ వీవు
నీప్రతిచ్ఛాయ మదనుండు నృపవరేణ్య!
యట్లు గాకున్న నశరీరుఁ డయినయతఁడు
పుణ్యశుభమూర్తి దేవరఁ బోలు టెట్లు?. 58

వ. అనిన నృపాలుం డిట్లనియె. 59

తే. తోఁకచుక్కలఁబోలు వృక్షోయజముల
వెలితి లేకుండ మీఁబోఁటి చెలులఁ జూచుఁ
గాంత వీక్షింప దరగంటఁ గాని మమ్ము
నేము సేసినయపరాధ మేమి? సెపుమ. 60

క. భూపాల! మెఱుఁగుఁబోఁడుల
చూపులకంట్రాయి నీదు సొబగ గ్లగుటన్
మాపిన్నది యిసిఱింతల
చూపుల నరగంట వెఱచుచు న్నినుఁ జూచున్. 61

క. కలకంఠి దనకు వలసినఁ
'గలికీ' యని నిన్నుఁ బిలుచుఁ గలమధురముగా
'నల' యను రెండక్షరములు
పలుకఁగ నాలుకకు నెంత భారంబో కదా? 62

తే. మగువ దేవరదివ్యనామము జపించు
నెమ్మనమ్మున నిత్యవ్రతమ్ము గాఁగ
నచ్ఛముక్తాఫలై కావళిచ్ఛలమునఁ
జన్నుఁగవ నక్షసూత్రంబు సంతరించి. 63

వ. అనిన నలుం డి ట్లనియె. 64

చ. మదగజరాజకుంభముల మచ్చరికించు చురోజకుంభముల్
గదిసి కలంతమేరయునుఁ గైకొనియున్నవి యెల్లవారికిన్
విదితము గాఁగ నిట్టితఱి నీచెలిడెందమునందు నేనియుం
గదలక మాకు నుండ నవకాశము లేదు గదే కళావతీ! 65.

తే. రమణిహృదయంబునను మహారాజ వీవు
గరిమ విచ్చేసి యుండినకారణమున
ధీనివక్షోరుహంబు లాలోన నుండ
నెడము లేకున్న మరి కదా వెడలె వెలికి? 66

వ. అని కళావతి రాజు నుద్దేశించి. 67

ఉ. వంచన యింత లేక కరవాఁడినఖంబుల నొక్కినొక్కి నొ
ప్పించితి రెండునేతులనుఁ బెద్దయులావున నొత్తి యొత్తి పీ
డించితి విట్టిఱాకటికిడెందమువానికి నీకుఁ గాక పూ
చంచలనేత్ర యొప్పులకుచంబులు పయ్యెదలోన డాఁగెడున్.

ఉ. మ్రుచ్చిలి గంధవారణసమూహము కుంభవిలాససంపదల్
మ్రుచ్చిలి మించుపయ్యెదలలోపల డాఁగుచు నుండు నెప్పు
మీ, నెచ్చెలికత్తెచన్నుఁగవ నీవు విచారము సేయఁ మా
మదిన్, మ్రుచ్చుల గిట్టి పట్టుదురు నొంపుదు రేమనవచ్చు
రాజులన్? 69

వ. అని పలికి రాజు కళావతీ! మామాటలకుం బ్రత్యుత్త
రంబులు పొసంగ నిచ్చితి; మేలనవచ్చు! నీప్రసంగం బిట్లుండె
నీచెలికత్తియ నేఁడు మాతోడ నేల పలుకదు? నీవు చెలిఁ
జేరి మంతనంబుండి తదభిప్రాయం బెఱింగిమాకుం జెప్పుమా.
మెచ్చుగల దనినం బ్రసాదం బని మదనరాజకార్యషాడ్గుణ్య

చక్రవర్తిని యగు నయ్యింతి దమయంతిం జేరవచ్చి యపుడ
క్షీణమంత్రరహస్యంబున. 70

మ. వరివస్యానియమం బఖండితముగా వాత్స్యాయనీయాదిక
స్మరశాస్త్రంబులు వింటి నాముఖమునన్ జాణుండు నీభర్త నే
ర్పరివై చిత్తముకెక్కెఱింగి సురతప్రాగల్భ్యముల్ సూపితే
సరసీజానన! యన్న నుగ్మలి వయస్యన్ ప్రేసె గెంపామరన్.

వ. ప్రేసి యసూయాకుటిలం బగుకటాక్షవీక్షణంబునం దర్జించె,
నిట్లు నిర్భర్త్సింపఁబడి వైదర్భిం జూచి రిత్తయలుకఁ దెచ్చు
కొని 'యుపదేశగురువ నగునాకు రతిరహస్యవార్త సెప్ప
వైతి, ధూర్తవై నీవు సెప్పకుండుదు గాకేమి? నా నేర్చిన నీమ
గనిచేతన చెప్పించెద, నిదె చూడు' మన మఱియుం గొంత
తడవు మంతనం బున్నయది సైరు శుద్ధాంతచారిణి మహీ
కాంతునితో ని ట్లనియె. 72

తే. 'అధిప! వైదర్భి దర్భాంకురాగ్రబుద్ధి
మనతలంపులఁ బోల దీమగువతలఁపు
బాల యనుచున్నవార మిప్పద్మనయన
నిట్టిప్రౌఢియుఁ గలదె యేయింతులకును? 73

వ. ప్రణయకోపంబులు రతిదీపనౌషధంబులు; పొలయలుక లేక
మగవారికి మగువలు ప్రీతులు గారు; దీర్ఘంబు లయ్యేనేని
యవియే ప్రేమభంగకారణంబులు, గావునం గోపం బింత
మాత్రంబు చాలు నని పలికి దేవరమూఱుగాఁ బాదప్రణా
మంబు సేయంబోయి లీలాకమలంబున మొత్తుపడితిఁ, బడు
దుఁగాకేమి? యన్నుత్తకాశినిచిత్తం బెఱింగి నచ్చితి నవధ
రింపుము. 74

ఉ. తా మది నమ్మకున్నది విదర్భనరేంద్రతనూజ నిన్ను సు
త్రాముఁడ వంచు నీయరమరంబునఁ బో మన సీదు నీకు సు
త్రాముఁడు గానివానికిఁ బ్రతాపమునం జదలేటిపైఁడికెం
దామరపువ్వుఁ దేవళమె ధాత్రికి మాటలు వేయు నేటికిన్?

క. దంభోళిభాగ్యరేఖా
దంభంబునఁ బ్రస్ఫుటముగ ధరియించెదు హ
స్తాంభోజంబున దేవర
జంభారివె యగుట కేల సందేహింపన్? 76

తే. లోకపాలుఁడ వస్వల్పలోచనుఁడవు
వజ్రపాణివి దేవతావల్లభుండ
విన్ని లాంఛనములఁగూడ నింద్రుఁడవుదు
నైషధుండ వగుటకుఁ జిహ్నంబు సెపుమ. 77

వ. మహేంద్రుం డింద్రజాలమాయావిదుండు, స్వయంవరసమ
యంబునం దెట్లట్ల నలరూపధారియై వచ్చెనో యని శంకించు
చున్న యది. మందాకినీకాంచనకమలదానంబు సుమీ యీ
సందేహంబునకు నిదానంబు. 78

ఉ. రోయఁ డొకించుకేనియు మరుత్పతి యన్యకళత్రదూషణా
న్యాయము సేయ మస్తకమదాంధతనాశ్రమభూమిఁ గొక్కు
రో, కో యని కూయఁడే యతఁడు కుక్కుటమై నడిరేయి
గౌతమప్రేయసిఁ బొందఁ గోరి తనపెద్దతనంబు జలంబు
పాలుగాన్. 79

వ. నీవు తత్త్వనైషధుండ వైతేని యనన్యసాక్షికంబు లగు
శయ్యారహస్యంబు లుగ్గడించి యిప్పంకజాక్షిశంకాకలంకం
బపనయింపు మనుటయు మందస్మితసుందర వదనారవిందుం

డై యయ్యిందుముఖి నుద్దేశించి పురందరుం డనుసందే
హంబు డిందుపడు నట్లుగా మహీపురందరుం డి ట్లనియె. 80

తే. మఱచితే నెమ్మనంబులో మెఱుఁగుబోఁడి!
ప్రథమరతికేళి నతిపరిశ్రాంతిఁ బొంది
కూడ రెండవరతికి నూల్కొననినిన్ను
గ్రీష్మ యామిని యని యేను గేలిగొంటి. 81

తే. నీవు మృదుశయ్యఁ గపటంపునిద్ర వోవ
నెలఁత! కేల్దమ్మి యిడితి నీనిమ్ననాభి
నప్పు డచ్చోటఁ బులకంబు లంకురింప
నంబురుహనాభి వైనచందంబుఁ దలఁపు. 82

ఉ. కామిని! ఘర్మబిందువులు గస్తురిబొట్టునఁ దోఁగి రేఖలై
కోమలగండపాలికలకోణములన్ దిగజాఱ నంచల
శ్యామల మైనయాత్మవదనాబ్జముఁ జూతుఁగదే మదీయచిం
తామణిదామదర్పణమున న్నెఱిఁ దత్సమయోచితంబుగాన్.

తే. తరుణి! యెఱుఁగవె వీటికాదానవేళ
గురుజనప్రాంతమునయందు గూఢవృత్తి
నాగవల్లీదళంబు నెన్నడుమఁ జీఱి
మడిచి యందిచ్చినపుడు గోరిడుదుఁ గేల? 84

ఉ. మానిని! భోజనావసరమధ్యమునం గొనియాడ గోస్తనిం
దేనియ సంస్తుతింప వినుతింపను మీఁగడ ఖండశర్కరా
పానక ముగ్గడింపఁ బ్రతిపక్షచటూక్తినిసర్గరోషర
క్తానన మైననీయధర మల్గునొ యంచు మదిం దలంకుచున్.

తే. ఆననం బాదిగా నాభి యవధి గాఁగఁ
బ్రేమ భవదంగకములు చుంబించునపుడు

చరమచుంబనవేళ నోసరసిజాక్షి!
యేను జెక్కిలి గిలిగింత లిడుటఁ దలఁతె? 86

మ. అని సంకల్పభవైకసాక్షు లగుశయ్యానేకసంభోగచి
హ్నానలక్ష్మ భూపతి ప్రత్యభిజ్ఞ కొలిక్కై యందంద వాక్రువ్వ
న,వ్వనితారత్నము వాలుఁగన్నులఁ బతి న్వారించుచున్నానె
నొ,య్యన ధాత్రేయి శ్రుతిద్వయంబు నిజహస్తాంభోజయు
గ్మంబునన్. 87

వ. ఇట్లు లజ్జావశంబునం దనవీనులు మూసిన. 88

తే. అధిప! తాటంకచక్రధారాంచలములు
వాఁడులతికోమలములు పూఁబోఁడి చేతు
లొయ్య నేతెంచి శ్రుతరోధ ముడుప నీకు
నర్మమాయాస మైనను నయ్యెఁ గాని. 89

వ. అనిన విని నీవు మాన్యురాలవు నీమాట యతిక్రమింప వచ్చునే? యనుచు నమ్మచ్చకంటిం గ్రుచ్చి కౌఁగిలించుకొని శయ్యాంతలంబునకుం దెచ్చి ముచ్చట వోవం జెక్కుటద్దంబులు ముద్దు వెట్టుకొనియె నయ్యవసరంబున సమీపాపక క్ష్యాంతరంబుననుండి వైతాళికపురంధ్రి యుచ్చైస్స్వరంబున.

మాధ్యాహ్నికము

సీ. అవధారు దేవ! మధ్యాహ్న సంధ్యావేళ
దినయౌవనంబు దోతెంచె నిపుడు
అతితీవ్రతాపతప్తాంగియై మేదిని
భవదాప్త వనవాగపిపాసు వయ్యె
మార్తాండమండలీమధ్యభాగంబున
నీడెందమునఁబోలె నిలిచె శివుఁడు

నిష్ప్రతీపం బైనసీప్రవాహంబునో
సొచ్చుకుండాడె పే రెంతవాఁడి

తే. సీలనీలంబు లైనసీనిషధనేఱుల
యంచుఁ బ్రవహించు చమలఁగంగాంబుధారఁ
బలుచుగాక కళింపజాసలిలవేణి
తరళతరవీచికాపూర్వపరిచయంబు. 91

వ. అని వైతాళికపురంధ్రి పలికెను. 92

తే. ధరణినాథుండు గేళిసౌధంబు డిగ్గి
జలక మింటికి నేతెంచె సమ్మదమున
నవసరము వేచి యున్న నానావనిపులు
దర్పవద్వ్యాల నిలిచి వందన మొనర్ప. 93

తే. అంగుళిక్షేపలోచనాపాంగభంగి
విభ్రమభ్రూతరంగసంవేల్లనముల
నాదరంబు ప్రసాదించి యవ్విభుండు
సకలనృపతుల నిజనివాసముల కనిచె. 94

వ. అనిచి మజ్జనశాల కరిగి.

తే. కలపములతోడి నవయక్షకర్దమమున
నలుఁగు వెట్టించికొని రాజనందనుండు
మహితమృగనాభిపంకంబు మౌళిఁ దాల్చి
జలజలోచన లార్పంగ జలకమాడె. 96

చ. మహిపతి భామినీకరసమంచిత కాంచనకుంభతీర్థవా
ర్లహరులు మూర్ధభాగమునఁ బ్రాలఁగ నొప్పె విలోచనోత్సవా
వహమహనీయమూర్తి యయి హారిజలోచనపాదతీర్థవా
ర్లహరులు మూర్ధభాగమునఁ బ్రాలఁగ నొప్పు హిమాద్రి కైవడిన్.

క. వ్యోమగ్రామ్యాస్తను లగు
భామలు మును జలక మార్పఁ బదపడి నిషధ
స్వామికిఁ దీర్థం బార్చిరి
భూమీనిర్జరులు మంత్రపూతాంబువులన్. 98

ఉ. అంతరకల్ప్యమానచుళు కాచమనంబుగ నైషధక్షమా
కాంతుఁడు తీర్థమాడె మధుకైటభవైరపదాంబుజోదరో
ద్భ్రాంతమధూళి నైనశుభవారి మహీదివిజుల్వినిర్మల
స్వాంతులు చేరువన్నిలిచి వారుణసూక్తములుచ్చరింపఁగన్.

తే. కమలకింజల్కరేణుసంకాశ మైన
గౌరమృత్స్నాద్రవం బంగకములఁ బూసి
తీర్థమాడె మహారాజు త్రిదశసింధు
పుణ్యజలముల సంకల్పపూర్వకముగ. 100

క. గర్భధృతవారితకోమల
దర్భం బై యొప్పె ధరణిధవుహస్తము వై
దర్భీకుచయుగ విరహా
విర్భద్గూవమాంకురాభివృతమునుబోలెన్. 101

తే. మృదులతరగౌరమృద్బిందువదనచంద్ర
చికురశేషాంబుమౌక్తిక ప్రకరదశన
గురుపయఃకుంభపృథులవక్షోజకుంభ
పతి భజించె గంగాజలాప్లవనలక్ష్మి. 102

సీ. సీమంత మేర్పడఁ జికురభారమున సు
శ్లిష్టబంధంబుగ శిఖ యమర్చి
గన్నేరుఁబూచాయఁ గనుపట్టుజిలుగైన
సలిలకాషాయవస్త్రంబుఁ గట్టి

చంద్రాతపముతోడ సరి యైనవెలిపట్టుఁ
బుట్ట ముత్తరవాసముగ ధరించి
ప్రక్షాళితము లైనపదయుగంబువన్నియ
కనకంపుగొడుగుఁబాగాలు దొడిగి

తే. శైవుఁ డగుబ్రాహ్మణబ్రహ్మచారి యిచ్చు
హస్త మవలంబనంబుగ నల్లనడిచి
నియతమౌనవ్రతంబుతో నృపతి సొచ్చె
శాంతచిత్తుఁ డై దేవపూజాగృహంబు. 103




సీ. అభినవాజ్యసమేధితాఖండదీపంబుఁ
బుష్పమండలికావిభూషితంబు
ననవద్యబహునివేద్యసమన్వితంబును
వివిధచిత్రసువస్త్రవిలసితంబు
నఖిలతీర్థాంబుపూర్ణార్ఘ్యపాత్రంబును
గలధౌతరత్నోపకరణచితము
శశికాంతకుట్టిమస్ఫాటికుట్టిమితమును
జందనస్రక్కుశాక్షతయుతంబు

తే. నయినయద్దేవపూజాగృహంబునందు
భద్రపీఠాసనస్థుఁడై పరమనియతి
నాగమోక్తప్రకారంబు ననుసరించి
శంభులింగంబుఁ బూజించె జనవిభుండు. 104

తే. గసిఁడిదుత్తూరపుష్పంబు ఫాలనయను
పానవట్టంబుపైఁ బెట్టెఁ బార్థివుండు.

విశ్వపతి యాత్మసంగ్రామవిజయలబ్ధ
మదనకాహళముగ దాని మదిఁ దలంచె. 105

క. అమృతాంశుమౌళిమౌళిం
గమలభవకపాలమాలికకు సదృశముగా
విమలారవిందకోరక
సముదయమాల్యంబు నిషధజనపతి చుట్టెన్. 106

సీ. ఖట్వాంగపాణిఁ జెంగల్వపుష్పంబుల
ఫాలలోచను బిల్వపల్లవముల
నాగేంద్రకేయూరు నాగకేసరముల
బాలేందుకోటీరుఁ బాటలములఁ
గుసుమకోదండారిఁ గుంఁదవర్ధనములఁ
గాంచనాచలచాపుఁ గాంచనముల
నంబికాహృదయేశ్వు నసితాంబుజంబుల
దక్షాధ్వరధ్వంసి దమనకములఁ

తే. బొండుమల్లియవిరిదండ ఖండపరశు
నఖిలసురసార్వభౌము దూర్వాంకురముల
బంతిశ్రీవత్సలాంఛనప్రాణబంధు
శివునిఁ జేమంతిబంతిఁ బూజించె నలుఁడు. 107

ఉ. డగ్గఱి మేదినీపరిబృఢప్రవరుండు సువర్ణపాత్రలఁ
బుగ్గన దివ్యసౌరభవిభూతి యెలర్పఁగ సాత్కరించెఁ బెం
పగ్గల మైనభక్తి మహిషాక్షరజత్రసరేణుసమ్మిళ
ద్గుగ్గులుధూపధూమములు గోఘలతారకరాజమౌళికిన్.

తేఁ సరసధూపార్థమై కామశరములందుఁ
బురములందునుఁ బొగసూపె భూవరుండు

మదనసంహారుఁడును బురమర్దనుండును
నయినదేవర కామోద మావహిల్లు. 109

సీ. పద్మాసనస్థుఁడై భావించె మానస
కమలకర్ణికయందుఁ గాలకంఠుఁ
బంచాస్యునెమ్ముల జపించెఁ బంచబ్రహ్మ
పంచాక్షరంబులఁ బరమనియతి
భక్ష్యభోజ్యాదికబహుపదార్థంబుల
నసమాక్షునకు నుపహార మిచ్చె
రాజదేవోపచారప్రకారంబుల
నతిభక్తిఁ గొలిచె రాజార్ధమౌళి
తే. మంత్రపుష్పంబుఁ బెట్టె మన్మథవిరోధి
మూర్ధభాగంబునందు సమ్మోద మెసఁగ
నవనిసంస్పృష్టసకలాంగుఁ డగుచు మ్రొక్కె
నిఖిలలోకైకభర్తకు నిషధరాజు. 110

—హరిభూజ—

వ. అనంతరంబ పరమపురుషునిం బురుషోత్తమను నారాధింప నద్దే
వునిసన్నిధికి వచ్చి. 111

సీ. కీలుకొప్పునఁ బైఁడి గేదంగిరేకులు
కోణలు గానంగ రాఁ గుదురుపఱిచి
కర్ణపాశంబులఁ గలధౌతమయపాండు
పుండరీకవతంసములు ధరించి
బాహామధ్యంబునఁ బవడంపుఁ జిప్పులఁ
బచ్చలఁ దోమాలె యచ్చుపఱిచి

చరణపీఠంబుల గరుడాంకమణిఖండ
తుళసీదళంబులు నెలవుకొలిపి
తే. పురుషసూక్తనిపాఠంబు పరిచయించి
పావనాష్టాక్షరీమంత్రపఠనఁ దగిలి
పాంచరాత్రోదితక్రియాపథమునందు
నలిననాభు సమారాధనంబు సేసె. 112

చ. గురుతరకౌస్తుభాశ్మమణికుట్టిమ మైనరథాంగ పాణిపే
రురమునఁ బూన్చె నొక్కయసితోత్పలమాలిక షట్పదావళీ
గరుదనిలావతారమునఁ గంపము నొందెడు రేఖ లిందిరా
తరళకటాక్షవీక్షణవిధావికటాయిత మభ్యసింపఁగాన్. 113

క. అలనాఁటి కాళియోరగ
వలనంబులు దలఁప కున్నె వనమాలి మది
న్నలదత్తవికచవిచికిల
కలికాడుండుభకదంబఘటితాంగకుఁడై. 114

క. నరనాథసమర్పిత మగు
విరవాదులదండ యొప్పె వెన్నుని పాదాం
బురుహంబున నంగుటమున
నురలినయాకాశగంగ కుపమానంబై. 115

హరిస్తుతి

వ. ఇవ్విధంబున నిషధదేశాధ్యక్షుండు పుండరీకాక్షు నర్చించి
ప్రణామంబు సేసి యప్పరమపురుషు నిట్లని స్తుతియించె. 116
సీ. జయ భూర్భువస్స్వస్త్రిజగదేకనాయక!
జయ సర్వదేవతాసార్వభౌమ!

జయ పూర్వగీర్వాణసంహార కారణ!
జయ కుక్షినిహితవిశ్వప్రపంచ!
జయ జహ్నుకన్యకాజనకపాదాంభోజ!
జయ కోమలాంబుదశ్యామలాంగ!
జయ వైజయంతికాస్రక్పరిష్కారాలంకార!
జయ పుండరీకవిశాలనయన!
తే. జయ శతక్రతుముఖమరుచ్చక్రవాళ
కనకకోటీరచారుసంఘటితనూత్న
రత్ననీరాజనక్రియారాజమాన
చరణపీఠాంతికోద్దేశ! జయ రమేశ! 117

క. భవదీయము లగుమంత్రము
లవాఙ్మనసగోచరంబు లంభోరుహాసం
భవభవుల కనిన శక్యం
బవునే మాబోఁటివారి కచ్యుత! పొగడన్? 118

శా. ఓదామోదర! యిందిరాయువతివిద్యుల్లేఖతో నూత్నపిం
ఛాదామత్రిదశేంద్రకార్ముకముతో సమ్యక్కృపావృష్టితో
నీదేహం బనుమేచకాంబుదము మన్నేత్రద్వయీచాతకా
హ్లాదంబుం బొనరించుఁగాత భవతాపాటోపముం బాపుచున్.




తే. కపటమత్స్యంబ వైనీవు గడలి నడుమఁ
బుచ్ఛ మల్లార్ప నెగసినభూరిజలము
మింటఁ గడుఁ దెల్లనై పాఱు చుంటఁ జూచి
యభ్రనది యంచు వర్ణించె నఖిలజగము. 120

క. గతభువనసర్గసముదయ
ధృతభూవలయాంకసదృశదృఢచరమతనూ
వితతబహుచక్రచిహ్నా ముఁ
బతగధ్వజ! కపటకచ్ఛపము నినుఁ గొలుతున్. 121

తే. చించి వెడలినతనురుహశ్రేణిచేతఁ
బద్మజాండంబు కడప వ్రాబంతిఁ బోలఁ
బెరిఁగియున్నట్టికిటిరూపధరుని నిన్ను
ఖురచతుష్టయబిలచతుశ్శరధిఁ గొలుతు. 122

మ. అతిగంభీరహిరణ్యదైత్యహృదయాహంకారకూపోదరా
పతితస్వర్ణరమాసువర్ణకలశప్రత్యుద్ధృతిప్రక్రియా
యతపంచాంగుళలోహయంత్ర మగునీహస్తంబు వర్ణింతును
ద్ధతకంఠధ్వనికుంఠితారిహృదయోత్కంఠా! నృకంఠీరవా!

తే. 'భోగిసహవాససంబంధములు భజింతు
భువనధార హస్తంబునఁ బోయు' మనుచు
రెంటమాటల బలిఁ బ్రతారించినట్టి
దంభవామన! మామనస్తాప ముడుపు. 124

మ. తటినాక్రాంతసమస్తలోక! బలిదైత్యధ్వంసి! యోదేవ? నీ
యటకా లుద్ధతి రాహుమండలము బ్రహ్మాండంబుతో నొత్తి
నం, గుఱుగుట్టం జెడ సంది బిట్టొరలునట్లో రాహి నీ యంఘ్రి
కిఁ, గిఱు జెపైనవిధంబు నామనములోఁ గిలించిన
ట్లయ్యెడున్. 125

తే. తిరిగె నఁట జాంబవంతుండు దేవ! నీకు
దైత్యబంధనవేళఁ బ్రదక్షిణంబు

దద్భ్రమీచక్రవలయంబు దంభవటుక!
యుచితబంధనరజ్జు వై యుండ కున్నె? 126

తే. క్షత్రజాతికి నీచేయి కారణంబు
దక్షయంబున కదియ నిదాన మయ్యెఁ
గారణమునందు విలయంబు గార్యమునను
ననుట యుచితంబు గాదె రామావతార! 127

సీ. తను సృజించినవిధాతకుఁ బూర్వరాముండు
లీలాభ్యసనహస్తలేఖనముగఁ
దనవిశ్వభూషణత్వముతోడ ఖరదూష
ణచ్ఛిదాకేళి యన్వయము నొందఁ
దన్నుఁ జింతించునధ్యాత్మవేదులు రాక్ష
సానీకహృన్మోహ మాసపడఁగఁ
దనఖడ్గధారఁ ద్రెచ్చినశంబుకునికీర్తి
కడలికంబుకదంబకంబు గెలువ

తే. దివ్యనామసహస్రప్రతినిధి యనఁగఁ
దారకబ్రహ్మ మనఁ దనపేరు మెఱయ
నతిశయిల్లిననీసప్తమావతార
మహారహంబును వర్ణింతు నాదిపురుష! 128

సీ. జనకాజ్ఞకును లోకజనవాదమునకుఁగా
నుర్వీజ యగులక్ష్మి నుజ్జగించి
తజునిఁ బుత్రునిఁ జేసి తట్టినెయ్యముపొంకెు
నజునిపౌత్త్రుండవై యవతరిలితి
ధాత్రి నిక్ష్వాకుసంతతి నుద్భవం బొంది
యాశ్రయించినవారి కమృత మిత్తు

వాలాయముగ విశ్రవసుకూర్మికన్నెకు
విశ్రవస్త్వము గూర్ప వేడ్కపడితి
తే. పెద్దకాలంబు వాసితి ప్రియవధూటి
ననుజు నొకనాఁడు వాసి దేహంబు దొఱఁగి
తెవ్వఁడెఱుఁగును నీచంద మిట్టి దనఁగ
రాజితానేకగుణభద్ర! రామభద్ర! 129
తే. కామసమ్మోహితక్రౌంచఘాతమునకు
వగచి నీచాటుకవి చెంచువానిఁ గినిసెఁ
గామమోహిత యగునింతిఁ గస్తిపఱుప
ననుజుఁ బురికొల్పి తిడినీకుఁ జనునె రామ! 130
తే. నందనోద్యానవాటికాంతరముఁ జొచ్చి
వితరణస్పర్ధఁ బోలె దైవతకుజంబుఁ
బెఱికి భువిమీఁదఁ బడవైచి పేర్చినట్టి
విక్రమాలంకరిష్ణు శ్రీవిష్ణుఁ గొలుతు. 131
తే. శైశవమునాఁడు కర్పరీశకలపాళిఁ
దెచ్చి కాళిందితరఁగలఁ ద్రెవ్వవైతు
భావిబాణభుజాదండభంజనమున
కభ్యసన మయ్యెఁ నీకది యబ్జనాభ! 132
చ. వలపలికన్ను నీకు రవి వారిజలోచన! చందురుండు డా
పలినయనంబు కర్ణుఁడును బాష్ఠుఁడుఁ దత్ప్రియనందనుండుఁద
త్కులజుఁడు వీరొకండొకనితోఁగలహింపసహించి తెట్లొకో?
వలపలిలోచనాబ్జమును వామదృగబ్జము వేఱె యచ్యుతా?
తే. అమరపతిసూను నిర్జించి తాక్కఁగూడి
దైత్యమర్దన! రామావతారవేళ

నామనగ్క్లేశ ముడుగనే యార్కి నణఁచి
తమరపతిసూనుఁగూడి కృష్ణావతార! 134

తే. దైత్యమర్దన! శ్రీవత్సధారణంబు
పొసఁగు దేవర శ్రీవల్లభుండ వగుటఁ
దామరసనేత్ర! నీవు రాధాప్రియుండ
వకట! రాధేయుఁ జంపించుటర్హమగునె? 135

తే. కుముదబాంధవ! రేవతీరమణ! భద్ర!
కామపాల! శరన్మేఘగౌరవర్ణ!
త్రిజగతీలోచనోత్సవ! దేవ! నీకు
నందమై యుండు నీలాంబరాకలనము. 136

క. బలరామకృష్ణసంజ్ఞలఁ
దెలుపు నలుపు నైనదివ్య తేజంబులతో
నిలమీఁద నవతరించిన
జలజాక్షునినెఱులు శస్త్రసౌరభ మొసఁగున్. 137

తే. ఏక! యద్వయవాది! త్రయీవిదూర!
యనవగీతచతుర్విధఖ్యాతిమార్గ!
పంచబాణారి! షడభిజ్ఞ! సప్తపురుష!
బుద్ధ! సంపత్పరంపరావృద్ధి నొసఁగు. 138

తే. బుద్ధ! నీగట్టిహృదయసంపుటము దాఁకి
కుంఠితము లయ్యె మరునంపకోల లెల్ల
మొద్దువోయికదా యిప్డు మునివిరోధి!
యలరు లెల్లను వస్త్రలాస్యంబు లగుట్యె. 139

తే. ముఖ్యచతురాననుఁడ వీవు మునిశరణ్య!
గౌణచతురాననుం డలకమలభవుఁడు

నీవు సర్వజ్ఞుఁడవు బుద్ధదేవ! నిజము
శంభు సర్వజ్ఞుఁ డగుట లాక్షణికవృత్తి. 140

తే. జ్ఞానకర్మేంద్రియోపాధిసంప్రభూత
దశమహాకల్కనీహారదశశశాంక
దశమదివ్యావతారు నత్యంతనియతిఁ
గల్కిదేవుని నినుఁ గొల్తుఁ గైటభారి! 141

క. విశ్వవ్యాప్తయశోని
శ్త్రైశ్వర్యసమృద్ధి విష్ణుయశుఁ డనునామం
బీశ్వర, కల్కిసమాహ్వాయ
నిశ్వసదర్థ మయి చెల్లు నీజనకునకున్. 142

క. కురువీరపంక్తికంధర
హిరణ్యకశిపుల జయించి తీ వంబురుహో
దర! మూఁడవతారంబుల
నరహరిలీలావిడంబనప్రౌఢుఁడ వై. 143

తే. అర్జునచ్ఛేద మొనరించి తర్ధచక్ర
సన్నిభం బైనశితపరశ్వధముచేత
సర్వలోకేశ! సంపూర్ణచక్రధార
బాణభంజన మొనరింపఁ బరువె నీకు? 144

తే. ప్రథమపరమేష్ఠి వై ననీప్రకృతియందు
శేషఫణిరాజ వై ననీశిరసునందుఁ
గపటబాలుండ వై ననీకడుపునందు
విశ్వములు నుండు నని నాథ! విందు శ్రుతుల. 145

క. సంసారినికరమానస, సంసద్భవనావకరరజశ్శోధని యో
కంసారి! నీపదాబ్జని, నంసాపరిశుద్ధి బుద్ధినై పుణిఁ దలఁపన్.

తే. ధర్మబీజవియన్న దీతానసార!
కామితార్థప్రదానైక కల్పవృక్ష!
కామజనక! చిదాత్మప్రకాశరూప!
కమలనాథ! చతుర్వర్గగతివి నీవ. 147

తే. విశ్వరూప భవద్వ్యాకృతివిభవమహిమ
యెంత వర్ణింపఁ జాలు మాయీనమనము!
ప్రత్యపుచీరవెలుఁగున బడుగువాని
హేమశైలంబు చిదిప ఆ తెన్ని నుడుచు! 148

వ. అని యనేకప్రకారంబులం బ్రస్తుతించి నమస్కరించె, నివ్విధంబున దేవతార్చనం బొనర్చి భోజనకార్యంబులు దీర్చి విచిత్రవైజయంతం బగుశుద్ధాంతకేళీసౌధం బెక్కి విహిత కులదేవతాభక్తియుం గృతభుక్తియును నగునయ్యంతిమహాదేవితోడం గూడె ననంతరంబ. 149




శా. ఆరామారమణుల్ రమాసతియు నైత్యారాతియుం బోలె శృం
గారక్రీడలఁ బ్రొద్దు పుచ్చిరి వధూగంధర్వకన్యాకళా
కీరాలాపకలాపకోకిలకుహూకేళీమయూరాంగనా
చారీమండలతాండవారభటికాసంరంభసంభావనన్. 150




వ. అంత. 151

తే. గగనహరినీలశైలశృంగమున నుండి
దొల్లిపడెఁ బ్రొద్దు జేగురుఁ గల్లువోలెఁ
దన్ని పాతసముద్ధూతధాతుధూళి
చందమునఁ దోఁచె దివసావసానసంధ్య. 152

ఉ. కోమలతామ్రచూళికలక్రొవ్వొఱపుంజముఁ బ్రోదివెట్టని
స్సీమకఠోరతారరుతిఁ జెట్టుప లార్చుచు నజ్జులెత్తి వి
శ్రామము పోలెఁ గూసె విలసచ్ఛరమాచలకూటపక్కణ
గ్రామటికాకుటీరశిఖరంబులఁ గుక్కుటచక్రవాళముల్.

చ. తలఁ బ్రతిబింబభానుమణిఁ దాల్చి విహారవనాంతరంబునన్
మలఁగి మలంగి పెంజిలుమునాగువుభంగి నవీనసారణీ
సలిలభరంబు దోలుకొని చయ్యన వచ్చినఁ జూచి భీతి బి
ట్టులియుచుఁ బోయె నత్తటి వియోగముఁబొంది రథాంగ
దంపతుల్. 154

శా. రశ్మిగ్రాహిగపత్మదగ్రజకరారబ్ధావిరామభ్రమిం
గాశ్మీరాభనవేష్టకారుచిరరాగంబున్ సహస్రాంశుశా
ణాశ్మంబున్ గదియించె ధాత నవసంధ్యాఖడ్గము న్వేదనా
వేశ్మస్వాంతరథాంగదంపతిచమూవిచ్ఛేదలీలార్థమై. 155

తే. సలిలనిధిసార్వభౌమకాన్తాపురంధ్రి
యోలగందంపుఁబసుపాడెనో కొ యనఁగఁ
గమలకింజల్కరేణుసంకాశ మగుచు
నింగి నెఱసంజకెంజాయ నివ్వటిల్లె. 156

క. కుసుమం బద్దినవిధమునఁ
బసుపున హత్తించినట్లు బంగారమునం
బస నిచ్చినగతి సంధ్యా
వసరంబున నింగి యరుణవర్ణం బయ్యెన్. 157

క. అభినవసంధ్యాతాండవ
రభసరయచ్ఛిన్న హిమధరాధరకన్యా

ప్రభుహారాస్థులభంగిన్
నభస్థ్సలిం దారకాగణంబులు పొడిచెన్. 158

మ. చరమాశానికషోపలాంచలమునన్ సంధ్యాప్రకాశోదయం
బౌరఁ గావించి విరించిచేఁ గొనినసూట్యం డన్పదార్వన్నెబం
గరపుం బూదియకై వియద్విపణి వేడ్కం గాలమన్పచ్చు చె
చ్చెరఁ జెల్లించినగవ్వచౌక మన మించెం దారకాచక్రముల్.

నక్షత్రవర్ణనము

మ. నభ మెల్లం గలయంగ నిండఁ బొడిచె న్సంధ్యావశేషాదృతా
రభటీడంబరతాండవభ్రమరికారంభంబున న్శాంభవీ
ప్రభుపాదాహతి మింటికి న్నెగయుచున్ బ్రహ్మాండగోళంబు
తోఁ, నభిసంబద్ధము లయ్యెనో రజతశైలాశ్మంబు లన్న
ట్టుడుల్. 160

*సీ. చుక్కలో యివి? గావు పుపలోకవాహినీ
విమలాంబుకణకదంబములు గాని
తారలో యివి? గావు తారాపథాంభోధి
కమనీయపులినసంఘములు గాని
యుడువులో యివి? గావు మృడునంబరంబున
దాపించినట్టిముత్యాలు గాని
రిక్కలో యివి? గావు రేచామ తుఱుముపైఁ
జెరివినమల్లెక్రొవ్విరులు గాని
తే. యనుచు లోకంబు సందేహ మందు చుండఁ
బొడిచె బ్రహ్మాండపేటికాపుటకుటీర
చారుకర్పూరఫాలికాసంచయములు
మెండుకొని రోలి నక్షత్రమండలములు. 161

చ. హాటదురులీల నిర్జరులు నచ్చరలేమలు వేల్పు పేట నొ
క్కటఁ విహరింప సందడికిఁ గాక తొలంగి చరించుమీనక
ర్కటమకరంబు లొక్కొ! యనఁగా గగనాగ్రమునందు
మీనక, ర్కటమకరంబు లెంతయుఁ బ్రకాశము నొందె
నిశాప్రసంగతిన్. 162

మ. విపులాకాశనిపాతభీతికలనావిన్యస్తదుర్వర్ణకీ
లపరిస్ఫూర్తినిశాలతాకుసుమముల్ భాసిల్లె బ్రహ్మాండమం
టపకాష్ఠామలకీటరంధ్రరజముల్ నాకాపగాచక్రవా
కపురంధ్రీనయనాశ్రుబిందువులు నక్షత్రగ్రహగ్రామముల్.

అంధకారవర్ణనము

ఉ. కాలకిరాతపాదతలఘట్టనఁ జేసి వియద్వనీమహా
కాలఫలంబు భాస్కరుఁడు గ్రక్కున నస్తమహామహీధర
స్థూలశిలాస్థలిం బడియెఁ దోరము లైనతదీయబీజముల్
నీలరుచుల్ వడిం జెదరె నింగి ననచ్ఛతమశ్ఛలంబునన్. 164

తే. పగలు బ్రహ్మాండభాండకర్పరమునందు
గగనమణిదీపమున నైనకజ్జలంబు
రాలెనో కాక యంధకారంబు పేరఁ
గాలవాతూలహతి నిశావేళయందు. 165

వ. అంత నమ్మహీకాంతుం డట మున్న నిశాముఖోచితక్రియాక
లాపంబులు నిర్వర్తించుటంజేసి క్రీడాసౌధంబు నేడవనిలువు
నకు దమయంతీసమేతంబుగా నరిగి యచ్చోట శుద్ధాంత
కాంతాజనంబు పరివేష్టింపం గొలువుండె, నప్పుడు పొడుపు
గుబ్బలిమీఁదం బొడతెంచుపూర్ణచంద్రబింబంబుం బొడగని
యంగన కిట్లనియె. 166

### చంద్రవర్ణనము

తే. శుద్ధకాంచనపిండంబు సూర్యుఁ డిగిచి
పూర్ణశశిపూఁతబంగారుపుటము నొసఁగి
సాయ మసుధూర్తు వంచించె జగమునెల్ల
చెల్లఁబో జెడునదె చూడు తెలిసె! విధుఁడు. 167

సీ. ఇందుకాంతంబుల నెబ్భంగి నడిసెనో
నిష్యందకీలాలనిర్ఝరములు?
చక్రవాకముల లోచనయుగ్మకముల నె
ట్లుబ్బెనో విరహబాష్పోదకములు?
చంద్రాతపమున నే చందాన గురిసెనో
ధారాళ మగుచు నీహారవృష్టి?
విపినవీథికల నే విధమునఁ గాఱెనో
శేఫాలికాపుష్పసీధుధార?
తే. యస్మి సుఖముల నభివృద్ధి యొసఁగ దేని
యొఱఁగి పవలింటియట్లన యుండుఁగాక
యూరు కేల విజృంభించు నుదధు లేదు
సుత్పలేక్షణ! యీశశాంకోదయమున. 168

క. లీలావతి! యామవతీ
కాళిందీసైకతంబు గగనోదన్వ
ద్వేలాడిండీరము చం
ద్రాలోకం బింతయొప్పునా యివ్వేళన్! 169

ఉ. దేవి! తమోమషీరసము తేటఁ బొసంగఁగ గట్టిపెట్టి యం
కావళి వ్రాయఁగాఁ దొడఁగె నంబరసంపుటకాంతరంబునం

బూవిలుకానిశౌర్యగుణముల్ హరిణాంకుఁడు ముత్తియంబు
లం, దావడముల్ రచించినవిధంబున ఋక్షటికాముఖంబులన్.

తే. భామ! యీశానమాళి నీచందమామ
కొంచెమైయుండునవయవాంకువముకంటె
దాసి గ్రహముండమాల్యమండలమునడుమఁ
గీల్కొనినరాహువక్త్ర మీక్షించి యొక్కొ? 171

క. శివునకుఁ జకోరమునకుఁ
దివిజులకును నిచ్చెఁ దుహినదీధితి యీతం
డవయవము గుచుల నమృతము
సువిప! తగుం గల్పతరుసహోదరుఁ డగుటన్. 172

ఉ. అంగద నంకవర్తి హరిణాభ్యవహారవిలోలబుద్ధి యై
మ్రింగు విధుంతుదుం డనెడు మేటిభుజంగమమీశశాంకునా
సంగముఁ బాయఁ డీయవసరంబున మేలని మెచ్చి యో సుమీ
మ్రింగియుఁ గ్రాయు నచ్చెలువ మెత్త! విధుం గనుగంద
కుండఁగన్. 173

తే. లతల క్రీడఁ దిలతండులితము లగుచుఁ
గాంత! యీనిండు రేజేనికరము లమరు
సంగుళీకీలితేంద్రనీలాంగుళీయ
కంబులునుఁ బోలె లీలావనంబునందు. 174

తే. తండ్రి కంభోధికినిబోలె ధవళనేత్ర!
హానివృద్ధులు గల నీశశాంకునకును

రాజబింబనిభాస్య! కారణగుణంబు
గార్యమున సంక్రమించుట గలదకాదె? 175

తే. వహ్ని మొదలైనయఖిలదైవతగణంబు
దృష్టిఁ బొందుదు రీసుధాదీప్తియందు
మహితపుణ్యాత్మకళ్యాణగృహమునందుఁ
బోఁ(ఁ)తి! యభ్యాగతులు దృప్తిఁబొందునట్లు. 176

తే. ప్రవహావాయుతురంగ మంబరమునందు
డప్పిగొని యీసుధాంశుమండలము సొచ్చి
యమృతపంకంబులోనం బ్రుంగుటయును
వెడలలేకున్న యదిచూడు విద్రుమోష్ఠి! 177

సీ. ఓషధీసందేశభాషాప్రణిధి యైన
మృగము గాఁబోలు నీ మృగము తరుణి!
రుద్రాగ్రహత్రాసవిద్రావితం బైన
మృగము గాఁబోలు నీమృగము తరుణి!
ప్రవహానామకమహాపవనవాహన మైన
మృగము గాఁబోలు నీమృగము తరుణి!
రోహిణీశుద్ధాంతగేహావర్ధిత మైన
మృగము గాఁబోలు నీమృగము తరుణి!

తే. సతతసేవాసమాయాతసకలభువన
భవ్యవిపినౌషధీలతాపల్లవాగ్ర
భక్షణక్షీబ మై సుధాపాయి యగుచు
మగువ! యీచంద్రునందు నీమృగము బ్రతికె. 178

తే. కంతుఁడును నీవిధుండు నొక్కంతవారు
సఖ్య మీయిద్దఱకు నొప్పుసదృశులగుట
ముదిత! యొక్కండు హరునినెన్నుదుటికంట
నొకఁడు కంసారికుడికంట నోహటిలిరి. 179

ఉ. బాలిక! యీసుధాకరుఁడు పంకజనాభునివామభాగదృ
గ్గోళక మైననాఁడు నవకోమలబాలతమాలకందళీ
కాళిమ గేలి సేయునడుకం దిది తన్నయనాంతరంబున
న్నీలకనీనికామఘవనీలమణిత్వము నొందకుండునే? 180

ఆ. కమలవిపినదాహకంతోక్తపటుతీవ్ర
శక్తి యగుహిమాగ్ని సంగమునఁ
గందఁబోలు శిశిరకరుడెంద మీభంగి
నాఁతి! యొండుకారణంబు లేదు. 181

క. హరితచ్ఛాయాచ్ఛలమున
భరఖేదము వాయ నమృతపానీయసరో
వర మగునీశశియందుం
దరుణీ! యోలాడుచున్న ధరణిం గంటే? 182

తే. జనకుఁ డగుదుగ్ధవార్ధి కుచ్చైశ్శ్రవంబు
గలిగె నైరావణంబును గలిగె నట్టి
తనకు గారాబుఁబట్టికి వనజవైరి
కొక్కకుందేలు గలుగుట యువిద! యరుదె? 183

తే. జ్యోత్స్న నాఁగఁ దమిస్రనాసుభయభార్య
లుడుపతికినందు నొకతె దెల్పోర్తు నలుపు

తాను వారికి మెచ్చుగాఁ దాల్పఁ బోలుఁ
దెలుపునలుపును నగుసోను నెలఁతి! యిపుడు. 184

మ. గణుతింపంగ నితండు పాల్కడలికిన్ గాఢాపుఁబుత్రుండు
బ్రాహ్మణరాజౌషధిభర్త నెట్టుకొని సంపాదించినన్ బ్రాంతి
యౌ, మణిమంత్రౌషధము ల్పురావిహితకర్మం బెట్టిదో
కాక లక్షణకాలుష్యము రాజయక్ష్మమును జిక్కం బెట్టలేఁ
డయ్యెడున్. 185

క. కాలతమతిమిరనీలీ
కాలాగురుసమకళంకకజ్జలపంక
క్షాళనగోక్షీరము లివె
ప్రాలేయకరాంశు లంబరము శోధించెన్. 186

తే. జలదకాళిమఁ బాపంగఁ జాలెఁ గాని
సహజకాళిమఁ బాపంగఁ జాల దయ్యె
శారదారంభవేళ యీచందురునకు
నతివ! యయ్యెడి దోఁ గానియదియుఁ గాదు. 187

తే. అస్తమించినయప్పుడే యమృతకరుని
కళలు పదునొక్కఁ డొక్క. రుద్రులశిరంబు
లసమబాణునిదోఁ జొచ్చునైదుకళలు
కాంత! యిది సూవె పదియాఱుకళలలెక్క. 188

తే. అమృతజంబాలముల సందు లదిగె యదిగె
వేయునక్షత్రముల నొక్కవిధముఁ వానిఁ

జేర్చి విధి చందురునిఁగా నొనర్చెనేని
లలన! నీమోముసరి సకళంకుఁ డితఁడు. 189

తే. చంద్రమండల మిది పితృస్థాన మగుట
జనసమావర్జితస్వధాసలిలతిలలు
మంత్రబలమున నెక్కె నీమధ్యమునకుఁ
జంద్రబింబాస్య! లాంఛనచ్ఛాయ గాదు. 190

మ. ఇదె వీక్షింపు చకోరశాబకనిభాక్షీ! దీర్ఘికాహంసి యి
ప్పుదకాంతరప్రతిబింబితుం గగనమధ్యోపస్థితుం జంద్రునిన్
మది దర్శించి నిజాధినాథుఁ డనుచున్ వాత్సల్యమేపారఁగాఁ
జదరొప్పంబరిచుంబనంబొనరుచుం జంచూపుటాగ్రంబునన్.

మ. అకలంకాఖిలదీర్ఘికాజలతపస్యత్కైరవశ్రేణికా
ముకుళీభావసమాధిభంగకలనాముగ్ధాప్సరఃకామినీ
వికచాస్యాంబుజ మీనిశాకరుఁడు దేవీ! చూడుమీసాంద్ర
చంద్రిక లేతద్దరహాసచంద్రికలు సందేహంబు లేదెంతయున్.

మ. నవలావణ్యరసంబు పళ్లెరములోనం బోసి యగ్రంబునన్
భవదీయాస్య మొనర్చి యార్చి పిదపం బ్రాలేయరుఙ్మండలం
బు వినిర్మించె విరించి యచ్చిలుమువో పూఁబోఁడి యాచిహ్న
మంబుపులం వాతఁడు చేదోలించు మిసిమిం బుట్టెన్
సరోజాతముల్. 193

శా. ఛాయామార్గభుజంగహారమును జంచత్తారకామండల
స్ఫాయద్దివ్యకపాలభూషణము జ్యోత్స్నాభస్మగౌరంబునై
యీయాకాశము శంభుమూర్తి యగు తన్నేర్పాటునం

దెల్పెడుం, బ్రియతూణిమభూతి సూక్ష్మతరమధ్యా! దేవి !
వీక్షింపుమీ. 194

మ. అలరుంబోఁడి ! సహస్రపత్రతులనాహంకారలీలావిశృం
ఖలసౌభాగ్యకళాకలాప మగునీకాంతాస్యముం బోలఁగా
వలదా యీశశికిం గళంకికి మృగవ్యాధోత్తమాంగస్థలీ
వలదాకాశధునీతటావనివనీవానీరకోయష్టికిన్. 195

క. దేవి ! యితఁడు హార్యక్షీ
భావము భజియించి యుండఁ బ్రకృతివిరోధం
బేవెంటఁ గలిగె నొక్కో
కావలమున నకట ! సింహికాసూనునకున్. 196

స్రగ్ధర.—
నానాథావళ్యసంతా
నములకును నిదానంబు నా నొప్పు నీరా
కానక్షత్రేశుమేనం
గలదె యొకకళంకంబునుం గాకతాళీ
యానన్ బైత్రోవ రాఁగా
హరిహాయనగరీహస్తిరాడ్గండపిండ
స్థానాపాదానదాన
ద్రవనవలవముల్ దాఁకెఁగా కభ్రవీథిన్. 197

మ. ఉడువీథీహరినీలరత్నమయపాత్రోత్సంగభాగంబునం
గడుగారా మొనరన్ ఝషాంకునకు నంకచ్ఛాయ యన్ కమ్మ
న్మాఁటిడితోఁ గూడ సుధాంశుబింబ మను నేయింబాయసా

హారముం, గుడువంబెట్టినో బంతికూళ్లకును జాఱోరంబు
లేపారం గాన్? 198

శా. అభ్రాంతంబున సింహికాతనయదంష్ట్రాంకూరయంత్రోద్భవ
శ్వభ్రాళీపతయాంశుదీధితి సుధాసారచ్ఛటావాహియై
శుభ్రాంశుండు సహస్రధారకలశస్ఫూర్తిం బ్రవర్తిల్లె హే
లాభ్రాజిష్ణురతిస్మరోద్వహనకల్యాణార్థసంసిద్ధికిన్. 199

క. పదియేనుదినంబులకుం
బదియే న్గళ లెక్క మేను పరిపూర్ణముగాం
బదియాఱవకళ యితనిది
మదిరాక్షి! వృషధ్వజుండు మాళి ధరించున్. 200

సీ. ముక్కంటితలపువ్వు మున్నీటి లేంబట్టి
కైటభారాతిడాకన్నుదమ్మి
గగనలక్ష్మికి దంతకాండతాటంకంబు
కలువలవిందు జక్కవలగొంగ
వలరాజు వెల్లెల్లి వనజబాంధవునుద్ది
శిశిరాంశురత్నంబుచేదుమందు
గన్నులపండువు గ్రహసార్వభౌముండు
సురలయాంకటిపంట యిరులదాయ
తే. శ్రీమహాలక్ష్మిసైదోడ శేషభువన
సాధకలధౌతకలశంబు చందమామ
రాజవదన! కల్యాణపరంపరాభి
వృద్ధి గావించుంగాత మీావిశ్వమునకు. 201

## ॥ గ్రంథోపసంహారము ॥

వ. అనుచు నిజవంశమకుటమాణిక్యం బైనసరోహిణీరమణునకు రమణీసమేతంబుగాఁ బుష్పాంజలి సమర్పించి యంగుళీయకమణిప్రభాసందోహంబు చంద్రకాంతిప్రవాహంబుపై వెల్లిగొన భూవల్లభుండు పాణిపల్లవంబులు మొగిడ్చి ఫాలభాగంబునం గీలుకొలిపె నిర్విఘ్నంబున నాయింటను [illegible] రాగసంపద బొంపిరి వారిసం బ్రాజ్యంబు లగు రాజ్యసుఖంబు లనుభవించుచుండిరి! తత్కాలంబునం జాతుర్వర్ణ్యంబు స్వధర్మంబుఁ దప్పక నెలంగె. వాతజ్వరాగ్నిక్షుత్పిపాసావ్యాఘ్రతస్కరాదిభయంబు లుడిగెఁ; బర్జన్యుండు కాలంబు దప్పక వర్షించె. దేశంబులు ధనధాన్యసమృద్ధంబులయ్యె. సురభు లమృతంబులు గురిసెఁ; వనస్రులుపుటకపుటకంబున మధుస్యందనంబుఁ జిందె; సకలజనంబులు పరమానందంబు నొందిరి. మహామల్లదేవీనందనుండును శ్రీహీరకోహణాచలరత్నప్రరోహంబును చింతామణిమంత్రచింతనఫలంబును గన్యాకుబ్జరాజాస్థానసంగమంగళాభరణంబును గౌడవిజయ కావ్యకర్తయును గవిచక్రవర్తియు ఖండనగ్రంథకారుండును వైతండికకమలషండవేదండంబును నగు భట్టహర్షమహాకవీశ్వరుండు కవికులాదృష్టాధ్వపాంథుండొనర్చిననైషధశృంగారకావ్యం బాంధ్రభాషావిశేషంబున శేషమనీషిహృదయంగమంబుగా శబ్దం బనుసరించియు నభిప్రాయంబు గుర్తించియు భావం బుపలక్షించియు రసంబు పోషించియు నలంకారంబు భూషించియు నౌచిత్యం బాదరించియు ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారం

